శ్రీరస్తు
శ్రీశారదాంబాయైనమః

# చిత్రాశ్వీయము



పరిష్కర్తలు
కవిరాజ విశ్వనాథ సత్యనారాయణగారు యం. ఏ.
ఉభయభాషాప్రవీణ విశ్వనాథ వేంకటేశ్వరశాస్త్రిగారు





గ్రంథకర్త
కళాకోవిద బాలసరస్వతి లలితకవి
కోట వీరాంజనేయశర్మ

# చిత్రాశ్వీయము



వి భూ లికి విమర్శనము
త॥ స॥ మూర్తి.

పరిష్కర్తలు

కవిరాజ విశ్వనాథ సత్యనారాయణగారు యం. ఏ.

ఉభయభాషాప్రవీణ విశ్వనాథ వేంకటేశ్వరశాస్త్రిగారు

గ్రంథకర్త

కళాకోవిద బాలసరస్వతి. లలితకవి

కోట వీరాంజనేయశర్మ

మొదటి కూర్పు 1000 ప్రతులు

తెనాలి ది ఓరియంటల్ పవర్ ప్రెస్ నందు ముద్రితము

 [వెల 1—0—0



# ఆశీస్సు

—:o:—

చిరకాలమ్ము సరస్వతీ చరణ మంజీర ధ్వనుల్ త్వద్గృహాం
తరసీమన్ నటియించుగాతఁ, దని పద్మా దేవి త్వద్ధృత్సరో
వరమున్ దా ననసూయయై కమల సంప్రాప్తమ్మునుం జేయు గా
త రహిన్ గాంచఁగ వైశ్యవారినిధి చంద్రా! సత్యనారాయణా!

# పండితాభిప్రాయములు

శ్రీమత్పరదేవతాయైనమః

ప్రస్తుతపు మకాం:
రాజమహేంద్రవరము
17-1-39

"చిత్రాశ్వీయము" అను నీప్రబంధమును నేను అక్కడక్కడ చదివితిని. తెలుఁగు శైలిలో నేమి సంస్కృతపద భూయిష్ఠమగు ధారలో నేమి లేశమును కుంటువడని రచనగలిగి యున్నదని చెప్పుటకు సందియములేదు. ఇంతకుము న్నీ కవి కొన్ని చిన్నపొత్తములు రచించి యున్నను ప్రబంధనిర్మాణమున కిదియే ఆద్య మనవచ్చును. ప్రాచీన కవుల మార్గమునే పట్టి ప్రబంధనిర్మాణమున కీయన ప్రవర్తించెనని ఆ యా వర్ణనముల వలన తెలియనయ్యెడిని. గ్రంథము నీతిబోధక మైనదనుటకు గ్రంథ ప్రతిపాద్యవస్తువు సావిత్రీసత్యవంతులగుట వలననే యొకకారణము. పయిఁగా నీయన నీతిబోధకముగా నుండి విద్యార్థులకు పఠనీయము కావలెనను సదుద్దేశముతోఁ గూడఁ గొంత ప్రయత్నించి నట్లక్కడక్కడి పద్యముల వలన గోచరించును. లోకోక్తులు కొన్ని సందర్భోచితముగా నందందిముడ్పఁబడినవి. అన్నిటికన్న నీనిలో ధారాశుద్ధి మిక్కిలి హృద్యముగా నున్నది. విద్యాశాఖవారిద్దానిని విద్యార్థులకుఁ బాఠ్యముగా ననుగ్రహించి గ్రంథకర్తకుఁ బ్రోత్సాహకులగుదురని నమ్ముచున్నాను. భగవంతుఁ డీతనిచే నింకను నిట్టి పొత్తము లనేకములు రచింపఁజేసి ఇతోధికమైన శ్రేయస్సును ప్రసాదించుగాక యని ఆశీర్వచించు చున్నాను.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.

* * *

శ్రీ వీరాంజనేయ శర్మగారు కవియే గాదు లలితకవి.
ముల యింపు నింపి ముదమునుగూర్చు పొందిక సుమధురము. 'స్నే
మన వారలలో నూటికి నొక్కండు, 'ప్రాక్తన విశేషజన్మ సంప్రా
వశత' 'సర్వజన దుర్లభంబైన' పల్కుం బల్కున ముద్దు లొల్క
బల్కుట' నలవరచు కొనును. 'సృష్టివైచిత్ర్యమునకు నచ్చెర
నొందు' టయె సహృదయుని సహృదయత. కావ్యభావకుని య
రంగము నందు కలగలుపు లేని నిర్మలత సంప్రాప్తమైనని
హృదయ సీమలోని సమున్మిషచ్చాతుర్య మవగత మగును.

"కమ్మ పుష్పాల్లుగల వసంతమ్మునందు, వీనులకు విం
పాడు పికమువోలె" "గుబురుగా నున్న లేమావిగున్న నీడ
మించిన" యీకవి "ప్రతిపదంబును మకరందరసము విరిసి
నేర్తును బద్యముల్ వ్రాయనేర్తు" ననంగలండు. "జిలుగుం బల్కు
లోని సారము బ్రశంసింపంగ సామాన్యమే" "ఇదియు నదియ
వర్ణింపనేల నెన్నిసద్గుణంబులు కలవో" "తెల్లంబుగానిందుం
బడిన వానిజెప్పనెటులో" కాని లోలోపున హృదయ సంవాదము
నాస్వాదింపం గలము. "ఇటులెంచగా నెన్ని యర్థములకు,
సృష్టి" ప్రబంధ కవితల నాస్వాదింప రాదను భావమున పరిణత
కాని భావకులు స్వాత్మసంవాదభరులై విసంవాద దూరులుకారు.

"సాహంకారతమిూఱ నీదెసను శాత్రవ్యంబుల మనోజ్ఞం
దేహంబుల మఱపింపం జేయుచును బ్రీతింగొల్పగా" నీకవి
"ద్రవరూప మొందుచుం బ్రావాహంబై వడిం బాఱెడిన్" స
సభావమున మెలగ నేర్చిన సహృదయు లీ చిత్రాశ్వీయమును భా
"అపరిమితమైన యానంద మనుభవించి" నచో "సావిత్రి
తంబు వ్రాయుటకునై సంకల్పమున్ జేసి" కృతకృత్యుడైన
కవి ధన్యుడు కాగలడు. శ్రీ ఆంజనేయ శర్మగారు— "సుమ
నున్న పుష్పాడిని శోధనం జేసి గ్రహించి దానిని విమలవియన్న
హృదయవీథి తరంగ గృహంబులను నివాసము నొనరించు పద్మ
చారుపరాగమునందు గల్పి తీవ్రముగ సమాహరించి భువిపై

జల్లె'' సమీక్షయొనర్చి సహృదయులు సహృదయతను చాటుట కిది సమయము.

తెనాలి,
23-1-1939.

జమ్ములమడక మాధవరామశర్మ,
సాహిత్యవిద్యాప్రవీణ,
సాహిత్యాలంకార భాషాశాస్త్రాధ్యాపకుడు
Vice Principal
*Sanskrit College, Tenali.*

* * *

శ్రీ కోట వీరాంజనేయ శర్మగారు రచించిన చిత్రాశ్వీయమనెడి ప్రబంధము చదివి చాల సంతోష భరితుడ నైతిని. కవిత్వము చెప్పగల వారెల్లరు ప్రబంధకర్తలు కాజాలరు. పద్యరచనా సామర్థ్యముతో పాటు వస్తునిర్వహణ శక్తికూడ నున్న నేకాని కావ్యశిల్పము పరిణతము కాదు. అట్టి ప్రబంధనిర్మాత లరుదుగా నున్న యీ కాలములో ఇట్టి మహాకావ్యమును ఇంత మధురముగా రచించి పూర్వమహాకవుల దలపించు నీ కవీశ్వరుని త్రికరణశుద్ధిగా నభినందించుచున్నాను.

వాల్తేరు,
ఆంధ్ర యూనివర్సిటి.

పింగళి లక్ష్మీకాంతం,
19—1—39.

* * *

ఈ చిత్రాశ్వీయ గ్రంథకర్త కొన్నాళ్లు మా కళాశాలలో స్తున్న కారణమున ఈయన కవితానిష్ఠ నేను బాగుగా నెఱుగుదును. సుకృత వశమున సహజసుందర మగు కవితాశక్తి యీయన కలవడినది. నిరుపమమగు నీయన కవితాధార చూచి యచ్చెరువందెడి మాకు నేటి యీ కావ్యము మిక్కిలి సంతోషము గూర్చినది. పూర్వమార్గముల చక్కగా నెఱింగి ఆ దారినే నడచు యీయన లేఖిని ముమ్ముందింకను మంచి కావ్యములను రచింప గలదని ఆశించు ఈ ప్రథమ యత్నము భాషాభిమానుల ఆదరమునకు పాత్రము గాగలదని నమ్ముచున్నాను.

17-1-1939

కా. వేంకటేశ్వరరావు
ఆంధ్రజాతీయ కళాశాల, బందరు.

* * *

ఈ రోజులు మహా వేగంతో మార్పులు ఒకదాన్ని ఒకటి త్రో
ముకు వచ్చే రోజులు. సాహిత్యశారద దినానికొక ఆహా
విధానం కూర్చుకొంటూంది. మిరుమిట్లు గొలిపే ఈ మార్పు రోజుల్లో
ఒకసారి వెనక్కు చూచుకొనడం ఒక విధమైన ఉత్కృష్టానంద
ఇస్తుంది. మహాకవులైన పూర్వుల రచనా వైదగ్ధ్యమే కాకుండా
రీతులను అనుసరించే నవకవుల రచనలున్ను ఆనందం ఇస్తవి.

శ్రీ కోట వీరాంజనేయ శర్మ గాయకుడు, ప్రసిద్ధి కెక్కి
బాలనటుడు. మహా ఝురీవేగంతో కవిత్వం నడపగలాడు. పూ
ఫక్కిగా శ్రీ సావిత్రీదేవి చరిత్ర రచించాడు. ఆతని పద్యాల పోక
నడికారము, బాణి, సూరన, పోతన, శ్రీనాథుడు మొదలయి
దివ్యకవులను స్మరింప చేస్తుంటవి. ఈ కవి కొత్త పోకడలను స
రించుకొని సహజ కవితా మాధురిని నూతన సృష్టికి కడగ గలా
ఆశిస్తూ ఆతడు చిరంజీవి అగు గాక అని ఆశీర్వదిస్తున్నాను.

ఆంధ్రజాతీయ కళాశాల, బందరు, 17, జనవరి 1939 } అడివి బాపిరాజు
కులపతి

* * *

చిత్రాశ్వీయము చాలవఱకుఁ జదివితిని. కవిత ఝురీవేగమ
నున్నది. సంస్కృతాంధ్రములు రెండును ధారాళముగా నడిచిన
కవులకు వలసిన స్వాతంత్ర్యత యీ కావ్యకర్తయందు లెస్సగానున్న
చచ్చుకథ లల్లుటయే సారస్వత నిష్ణాతత్వమని తలంచు దినముల
నిట్టి ప్రబంధరచన సాక్షాత్కరించుట భాషాదేవి యదృష్టము.

బాపట్ల, తుమ్మల సీతారామమూర్తి చౌద
24—1—39.

# పీఠిక

ఈ గ్రంథకర్త శ్రీ కోట వీరాంజనేయశర్మ గారు. సంస్కృతముఁ జదువ లేదు. కాని యీ గ్రంథముఁ జదివిన తరువాత యీయన చదువ లేదని యెవరును నమ్మఁజాలరు. ఈయన తెలుఁగులలోఁ బెద్ద పరిశ్రమఁ జేసి, కష్టపడి కవిత్వము సంపాదించ లేదు. ఈ గ్రంథముఁ జదివిన తరువాత దీనిని ఎవరును విశ్వసించరు. కాని, పరిశ్రమ చేయక పోయినచో నింతటి యుద్గ్రంథ మెట్లు వ్రాసెనని ప్రశ్న పుట్టును. దానికి సమాధానముగా నాశ్వాసాంత గద్యమునఁ జదివినచో ప్రసన్నాంజనేయ మంత్రశక్తి యని తెలియగలదు. మనిసినిఁ జూచినచో నీ మాటయు నమ్మరు. అయినను పుస్తకము కొంచెము లోతుగాఁ జూచినచో సహజశక్తి తక్కువ, యావేశించినశక్తి యెక్కువ యని తెలియగలదు. ఈయన తాను చతుర్విధకవిత్వనిరంతరుఁ డని గద్యలోఁ జెప్పుకొనెను. ప్రబంధ కవిత్వము కావ్యరచన చేతనే తెలియుచున్నది. చాటుకవిత్వముఁ జెప్పవచ్చును. ఆశుకవిత్వము కూడ కలుగవచ్చును. కాని బంధకవిత్వము కష్టము. అది సామాన్యముగ నేటి యువకులలో నెవ్వరును వ్రాయనిది. అది కూడ నీ కావ్యమునఁ గనిపించుచున్నది. ఇట్టి సమగ్రశక్తి తప్పకుండ నుపాసనా బలమే కావలయును. ఈ కావ్యము మూఁడశ్వాసములు. ప్రథమాశ్వాసమున నశ్వపతి సంతానార్థమైన మంత్రోపదేశముల వఱకే చెప్పఁబడినది. ద్వితీయాశ్వాసమున సావిత్రీ సత్యవంతుల వివాహ నిశ్చయము వఱకున్నది. తక్కిన కథ యంతయుఁ దృతీయాశ్వాసమున నున్నది. కావ్యము మొత్తముమీఁద 570 పద్యములు. తృతీయాశ్వాసములో 170. ప్రధానకథకు వినియోగించిన పద్యముల సంఖ్య తక్కువ. ఇది యొక రచనా విశేషము. చివర భాగమున కథను తరుముకు పోయి పాఠకునకు వ్యగ్రత కలిగించుటకు చేసెడు నుపాయము. ప్రథమాశ్వాసమున కథయే లేదు. అందుచేత మఱి రెండు కథలు రాజుతో నారదుఁడు చెప్పినట్లు కల్పించెను. మొదటికథ మంత్రో

పాసనా ప్రాశస్త్యమును బోధించును. రెండవది తన్మంత్రబలముచే
ఫలముఁబొందిన బలిచక్రవర్తికథ. ఈ రెంటిచేత సావిత్రీదేవివంటి మహా
దేవి యుద్భవిల్లు నని శంకారోపించి చెప్పినట్లుగా నీ యాశ్వాసము
రచింపఁబడినది. రెండవ యాశ్వాసమున సావిత్రి జన్మించెను. ఆమెక
గలలో సత్యవంతుఁడు కనిపించెను. ఇందులో ఒక చిలుక యింద్రుఁ
పంపున సావిత్రికి దేవీకరుణాంశులు బోధించును. ఈ చిలుక క
కల్పన. ఈ కల్పనచేత సావిత్రి మహాపతివ్రత యగుట, వరప్రసా
జనిత యగుట, యొక మహాకార్యముఁ జేయునంత సామర్థ్యము
గల్గిన కారణ జన్మురాలగుట, యవి యన్నియు విస్పష్టీకరింపఁబడిన
ఈ యాశ్వాస విభజనము, నీ కల్పనముఁ జూచినచోఁ గవి యుద్దేశమ
స్పష్టమగును. కవి యెంత సేపటికిని సావిత్రియొక్క మహాపవిత్రత్వము
నామెయొక్క మాహాత్మ్యముఁ దన కావ్యమునఁ బ్రతిబింబిం
వలయుననియే యిట్లు వ్రాసెను. కథ కన్న నామె మాహాత్మ్య ప్రక
నము ప్రధానముగా గోచరించును. ఈవిషయములు కథాకల్పన
మాత్రముచేతనే కాదు, రచనా పద్ధతి చేత గూడ గోచరించును
ఇతరులు పద్యము వ్రాయుచోట నీకవి వచనములే వ్రాయును. వ
నము వ్రాయునప్పటి ప్రయత్నము, తీర్పు పద్యములందు పట్టదు
తృతీయాశ్వాసమున నీ మాహాత్మ్య ప్రకటనము మిక్కిలిగాఁ బ్రదర్శి
చెను. భారతములోని కథకే మార్పుఁజేసెను. సావిత్రి యమలో
మునకుఁ బోవుట, తన పాతివ్రత్యమహిమచేతనే కాదు, సావిత్రీదే
కరుణచేత. ఇది యొక చిత్రమైన వ్యాఖ్యానము. నిజముగాఁ శా
విత్ర్యము తాదృశ్మహత్త్వము సంపాదించి పెట్టలేదు. ఉపా
నాబలము యోగ బలము. వీని చేతనే యధికశక్తులు వచ్చును. అ
సూయ, సుమతి, సావిత్రి మొదలైన తల్లులు పతివ్రతలే కాదు
మహాయోగినులు, తపోరాసులు. వారిమహత్త్వ ప్రకటనమున క
యొక హేతువు. అంతటి పతివ్రతలు నేఁడును కలరు. లేరనుట
భారత దేశము గొడ్డువోలేదు. కాని వీ రట్టి మహత్త్వ ప్రకటనము
జేయఁగలరా? చేయలేరు. ఎందుచేత? యోగశక్తులు లేవు కనుక

తపశ్శక్తులు లేవు కనక. పాతివ్రత్యము వ్రతము, తపస్సుకాదు. దాని యందు తపోభావము కలదు. ఈ వ్యాఖ్యాన బుద్ధిచేత యముఁడు కనిపించనపుడు సావిత్రి తన యుపాసనా దేవత యైన పరాశక్తిని ప్రార్థించి యామె సాహాయ్యమున యమలోకమునకుఁ బోయెను. వైతరణి దాటెను. అసిపత్ర వనము లంఘించెను. ఇది కథా నిర్మాణ వైఖరి.

ఈ కవి యితర శక్తులు దీనితోఁ బాటు తులఁదూగు నవి. పద్యరచన సులభముగా, ముద్దుగా, సుఖముగా నుండును. వచన రచనను గూర్చి చాల చెప్పవలయును. ఈయన వచన రచనలోఁ బూర్వకవు లెంతమంది యెన్ని మార్గములఁ బోయిరో యన్ని మార్గములు పుడికి పుచ్చుకొన్నవాఁడు. యుద్ధవర్ణన సమయ ములోఁ బ్రథమాశ్వాసమున 117 వ సంఖ్య గల వచనముఁ దిక్కన్నగారి వచనము నెంత పోలునో చూడవచ్చును. ద్వితీయా శ్వాసమున 202 చంద్రికావర్ణనము. తృతీయాశ్వాసమున 55 శరదాగమనము. ఈ వర్ణనలు రెండును జదివి చూచినచో బ్రబంధ కవుల వచనము నీయన యెట్లు సంపూర్ణ శక్తి మంతముగ ననుక రించెనో తెలియఁ గలదు. గ్రంథములో నే వచనముఁ దీసినను రచనలోఁ బ్రౌఢము కనిపించును. ఈయనది గద్యమునందుఁ బ్రౌఢమార్గము. పద్యము నందు మధురమార్గము. ప్రబంధరచనయం దిదియే యుత్తమ మార్గ మేమో యనిపించున ట్లున్నది.

ఈయన గొప్ప యుపజ్ఞ కలవాఁడు. "ఎదజల్లు మనిపించు మదకరీంద్రమ్ములు" ఇది చాల క్రొత్తరకపు వర్ణన. ఏనుగులను గొండ లతోఁ బోల్తురు. కాని, చూచినచో "నెదజల్లు మను" నని యెవరు వర్ణింతురు ?

అశ్వపతి వన విహారముఁ జేసెను. ఆ సమయమునఁ బెంపుడు మృగముల నెట్లు లాలించెనో వర్ణించి రాజుయొక్క దయామూల కమైన గుండె యనుచమత్కారముగాఁ జూపించెను. ఆరాజును వర్ణిం చుచు "సత్యవంతుఁ"డని "సమవర్తి" యని పేర్కొనెను. ఈ శబ్ద

ముల ప్రయోగము కథను చమత్కారముగా సూచించు చున్నది. ప్రథమాశ్వాసమున 27-వ పద్యము సీసము. 2, 3, 4 పాదము 3, 4 పాదములలోనికిని యెత్తుగీత మొదటి పాదములోనికిని సంబ ప్లుతైకాక్షరముతోఁ దరుముకొని పోయి పద్యరచనయందు క్రొ విచ్ఛిత్తిని కలిగించు చున్నవి.

ఈ కవి కథా నిర్మాణ చాతుర్యము చేతనే మహావిషయ వ్యాఖ్యాన బుద్ధియని తెలియుచున్నది. దానికి దోహదముగా నీ వి యమును జూడుఁడు. కామప్రవృత్తికిని, పుత్త్రవాంఛకును భేదము పుత్త్రవాంఛ స్త్రీ కామ విషయాతీత మనియును గవి చక్కగా ని పించినాఁడు. సుదేవుఁడు "ప్రణయలతా ప్రభావమునఁ బ్రాణ నిల్పితి నింతదాక— పుత్త్రుఁ గాంచమిఁ, బ్రణయ సుఖం లీ ధరణి వ్యర్థము" ఈ నిష్కర్షచేత కవియొక్క భావనాశీల గోచరించును.

ఇదియుఁ గాక, ఈయన రాక్షస ప్రకృతిని చిత్రముగ జూపించెను. బలిచక్రవర్తి రణభేరి వ్రేయించగా నా ధ్వని "మ హ్యాత్పం కేరుఁ డంతర్జ్వల ద్ఘన బోధామృత చిత్స్వరూప విమన ప్రజ్ఞ భగ్నంబుగా" పర్వెనని వ్రాయుట పూర్వకవులు వ్రాయని అద్భుతమైనది. దేవతలను "కత్తులఁ జర్మంబుల నొలిచి చంపఁజ దగు" అనుట లోకోక్తిని యెంత చక్కగా సంగ్రహించుట మూడుఁడు. ఈ సంగ్రహణ శక్తినిఁ దరువాతఁ జెప్పెదను. "త పాన వశత వక్త్రము లుబ్బ తుప్పర క్షోణీస్థలిని జడివానముంప" రా సత్వము సామాన్య విషయముల యందెట్లు విజృంభించునో చి ముగా వ్యంగ్య భూతమగుచున్నది. ఈ రక్కసులకు "ఆహవ దీ సుపర్వ దేహ సంజనిత కవోష్ణరక్త మధుసార విలేహనవాంఛ లూరె నఁట. ఏమి సొగసైన రచన!

ఈయన కథఁ జెప్పుటలోఁ జిత్రచిత్రము లైన చమత్కా ములు చేయును. ప్రథమాశ్వాసమున 125 వ పద్యము ఏడు పా ములు గల గీతము. 133వ పద్యము ద్విపద. ఈ రెండును కథ నడుపు

కెంత సొగసుగా నుపయోగించెనో రసజ్ఞులు విచారింతురు. అశ్వపతి దేవీవరమును గ్రహించివచ్చెను. ఆయన భార్య గర్భముతో నుండెను. ఈ రెండు విషయములకు మధ్య కవి యొక సీసపద్యము వ్రాసెను. ఆరాజు నడుగనివాఁడు పాపాత్ముఁడు, అడిగినచోఁ గుబేరుఁడు. యాచింపనివాఁడు వ్యర్థుఁడు; యాచించినచోఁ గల్పవృక్షము. ఈ మొదలైన భావములతోఁ బద్యమల్లెను. ఇచ్చట నీపద్యము వ్రాయుట మహాశిల్పి గాని చేయలే డందును. సావిత్రి జన్మించినపుడు దాసి వచ్చి రాజుతోఁ జెప్పెను. ఆ దాసిని సీసపద్యములో వర్ణించి చెప్పుట సామాన్యకవి చేయలేడు. సావిత్రి బాల్యమును వర్ణించుచు చేసిన వర్ణనము కవియొక్క లోకజ్ఞత్వమేకాక సావిత్రీదేవి గొప్ప దనమును గూడ చెప్పుచున్నది. భావికథా సూచనానుగుణము లైన శబ్దములును, భావములును, పూర్వకవుల ననుసరించి యీయనయుఁ జేసెను. ద్వితీయాశ్వాసమున 42వ పద్యము మొదలగునవి పాఠకులు చూడవచ్చును. చిలుకకథనుకల్పించి ఆకల్పించుటలో హంసపంచకము నిముడ్చిన వైఖరి యీయన చాటుకవిత్వ వైశారద్యమునకు నుదాహరణము.

వధూవరులమధ్య తెరయడ్డము పట్టుదురు. దానికివ్యాఖ్యాన ప్రాయముగా సావిత్రీ సత్యవంతు లదివఱకే యెఱింగియుండుట, యశ్వపతి మొదట నొప్పుకొనక తరువాత నొప్పుకొనుటయుగా ధ్వని పుట్టునట్లు తృతీయాశ్వాసమున 10వ పద్యము మిక్కిలి రమ్యముగా నున్నది. సావిత్రీ సత్యవంతులు కాపురము చేయుచుండఁగా వారిని ఋషులందఱు దీవించిరి. ఈ దీవనలు సావిత్రి భర్తను బ్రదికించక పూర్వము. ఈదీవనము ఐదు పద్యములలో నున్నది. ఇందు రెండు సీసపద్యములు. ఈ యాశీర్వాదము నింత విస్తరించి వ్రాయుటయే కవియొక్క మేధాశక్తినిఁ దెలియజేయుచున్నది. సావిత్రి తనభర్తను బ్రదికించుకొనుటకు ఒక్క యుపాసనాబలమే కాదు, ఒక్క పాతివ్రత్య బలమే కాదు. ఆ బలమునకు కవి యీ యాశీర్వాద బలమును గూడ తోడిచ్చుచున్నాఁడు.

సత్యవంతుఁడు మరణించు ననఁగా నారదుఁడు పోఁ
యమునితోఁ బందెముఁ జఱచినాఁడు.యమునకుఁ గోపమువచ్చి దున్న
పోతుమీఁద దిగినాఁడు. ఇచ్చటి యమ వర్ణనము ఎఱ్ఱాప్రెగ్గడ చేసి
వర్ణనమువలెనే యున్నది. ఇచ్చటనుండి కవి చూపించిన శిల్పము భా
తముకంటె భిన్నముగా నౌచిత్యము చెడకుండ నెట్లు చిత్రింపఁ బడి
దో రసజ్ఞులు రెండుగ్రంథములను దగ్గఱ నుంచుకొని చూడవలసి
విషయము. మొదట యముఁడు సావిత్రి మీఁద కోపించి కని పిం
కుండఁ బోయెను. సావిత్రి పరాశక్తి దయచేత మఱల యము
కడకుఁ బోయెను. ఆమెను జూచిన తోడనే యమునిలో నెం
మార్పు వచ్చెనో మూఁడవ యాశ్వాసము 117, 118, 119, 1
పద్యములు చదివినచోఁ దెలియును. చిట్టచివరకు యమునకుఁ గోప
వచ్చి యిట్లనెను. "యముఁడన్న నల్పుఁడని నీవు మదిలోఁ దలఁచితి
యేమొ పొలతీ తగునే యముఁడన్న పేరునందే యిమిడెను నిర్దయ
డటంచు నెఱుఁగఁ దగు నీకర్" అనిచెప్పెను. ఎఱ్ఱనగారి పద్య
"యముఁడండ్రు నన్ను నార్యులు,యమింతు భూతముల దాన నట్లను
తగుర్" అనియున్నది. అదివట్టి యభిధావృత్తి. ఇచ్చట లక్ష
వృత్తి. తత్తత్కర్మానురూపముగ నిర్మించుటయందు దయా ప్రస్తా
లేదన్నమాట. భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడన్న వాదము వే
మతముకాదు. కర్మ, విధి వీనిముందు ప్రేమ నిలువదు. ప్రేమ ప్రధా
మైనచో విధి కర్మలు మూలవడును. ప్రపంచవృత్తము చెడిపోవును

ఈ కవి రచనా వైదగ్ధ్య మంతయు నొక యెత్తు. ఈ చెప్ప
బోవునది యొక యెత్తు. యముఁడు తన పతి ప్రాణము లెట్టులు నీయ
డని సావిత్రికిఁ దెలిసిపోయినది. ఆమెకు నెంతయో కోపము వచ్చి
నది. యముఁడు కూడ చచ్చిపోవలయు నని యామె యూహలో
దోఁచినది. మూఁడవ యాశ్వాసము 135వ పద్యము "నేనే సృష్టి
లయాది............. వ్యాపార నేనిక ద్వదీయానంత ప్రభ తో
నీ వాడలు బాయం గల్గు దిప్పట్టునర్" అని శాపం బిడ బో
నంతలోఁ జతుర్దశ భువనములు కంపించెను. దేవతలుపరాశక్తి వద్ద

పోయి రక్షింపు మని గోలకెత్తిరి. ఆమె వారితో సావిత్రీ యమ ధర్మరాజుల మధ్య సాక్షాత్కరించి "ఓం శ్శాన్తి శ్శాన్తి శ్శాన్తిః" అన్నది. అని శాపం బిడ బోయినది. ఈయ లేదు. ఈయని శాపముయొక్క స్వరూపము పద్యముగా రచింపఁ బడినది. ఈయని శాపముఁ బద్యముగా వ్రాయుట యెట్లు? ఆమెకు శాపోహ కలిగెను. ఊహను పద్యముగాఁ గవి వ్రాసెను. ఈ యూహ ఆమె యొక్క కోపమే. ఆ కోపతీవ్రతయే. ఇది యెంతో స్వభావము, ఆయూహ మాటద్వారా వచ్చెనేని సర్వము భగ్నమైనది. అంతలోనే పరాశక్తి యావిర్భావము. ఈరచన భూలోక సంబంధమైన రచనకాదు. అంతర్లోక సంబంధమయిన రచన. ఇంతకన్న యీ కవి రచనా కౌశల్యము నేమని చెప్పవచ్చును. ఇంక, చిన్న చిన్న అందములు కావ్యమునందెన్నియో కలవు. అన్నిటిని బేర్కొనుట గ్రంథవిస్తరము.

ఈయన తెలుఁగుపదముల నెట్లు స్వీకరించునో సంస్కృత సమాసము లెంత చక్కఁగా నతుకునో ఉదాహరణ యిచ్చినచో మరల నింత గ్రంథమగును. ఈ కవి కొన్ని శబ్దములను, లాక్షణిక ముగాఁ బ్రయోగించును. సామాన్యముగా "న్యాయ" శబ్దము నకు "న్యాయ్య" మని వ్రాయరు. "న్యాయ్య" మే సరియైన రూపము. ఈయన దానిని వాఁడెను. "ప్రమ, విమనస్క" శబ్దములు వేదాంతులకు మాత్రమే తెలియును. వానిని యీయన గ్రహించెను. ఇట్టి పరిశీలన యొకవైపున "దరిద్రము, వ్యాకులము" ఇట్టి శబ్ద ములు నామవాచకములుగా వాడరానివి వాడుట యొకవైపున జూడఁగా కవికి కొంత వాడుకభాషయందు లోలత్వమున్నట్లు కని పించును. కొన్నిశబ్దములు అచ్చముగా దేశమున వాడుకలో నున్నట్లే రమ్యముగా వాడెను. "భాగస్వాములు, చర్మ మొలిపించుట, మథన పడుచు, అని ఖండితముగా నాడిన" మొదలైన ప్రయోగములచేత నీయనకు వాడుక భాషయందుగల పట్టు సూచితమగుచున్నది.

యముఁడు తనవెంట వచ్చుచున్న సావిత్రినిఁజూచి "వనితా దుర్మార్గమనక వచ్చుట తగునే" అని చెప్పెను. యముని యుద్దే

శ్యము దార్మార్గ్య మసికాదు. దారిచెడ్డదని. ఈ శబ్దమిట్లు ప్రయో
గించుట చమత్కారమే.

పరాశక్తి తనకును సావిత్రికిని భేదములేదని చెప్పుచు'' కల
వెలితి యామెకునార్కు'' అనెను. ఈ వెలితిశబ్దము చాలచమత్కా
ముగ నున్నది. ఆమెయు సంపూర్ణురాలు, నేనును సంపూర్ణురాల
రొక యర్థము. నాకున్నశక్తిలో ఆమెకు వెలితిలేదు. అనియర్థ
ఎట్లైనను ఈ 'వెలితి' యన్నశబ్దమున ట్లుపయోగించుట రమ్యము.

''నూర్వురనేకంబుగఁ గల్గఁ జేసితి'' ఏకమ్ముగ న
ఒక్క సారిగ. ఇది వాడుక భాష. ఇట్టి వెన్నియో కలవు.

ఇవి కాక పూర్వకవుల ఛాయలు గల పద్యము లనేక
లున్నవి. పూర్వకవులలో నెంత మందిని పట్టినను పద్యరచన
నాచన సోమన్నను ప్రభావతిలోని పింగళి సూరన్నను పట్టుట కష్ట
ప్రథమా శ్వాసములోని 95వపద్యము పింగళి సూరన్నను పట్టి చ
నట్లున్నది. ఇంక నిటువంటివి చాల చూపింపవచ్చును. తక్కిన సౌ
దర్యముల కన్నిటికి రసజ్ఞులైన పాఠకులే ప్రమాణము. ఈ
భవిష్యత్తున నింకను నుత్తమములైన గ్రంథములను వ్రాసి కీ
సంపాదించి దానితో ధనము గూడఁ జేపట్టి రాఁ దగినంత నః
దశకు రావలె నని యాశీర్వదించుచున్నాను.

విశ్వనాథ సత్యనారాయణ



# నమోవాకములు

కవిత్వరచన మెందులకు? అయ్యదియు నియమబద్ధముగ నుండ నేల? పనిలేనిపాట; అంసును ప్రబంధము;— పూర్వులు త్రొక్కి విడిచిన త్రోవ— పాడినదేపాట — వట్టిచేదస్తము— అను నేటి తలంపులు సాహిత్యవారాశికిఁ బ్రచండ వాతాగమన మయ్యెను. భయంకర జల జంతు సంతానముతోఁ దరంగములు చదలంటఁ జొచ్చెను. క్వాచిత్కముగా జీవమణి సందర్శనము లభించుచుండెను.

సృష్టిలో నేదేనొక పదార్థము క్రమాగతంబై యనుభవైక వేద్యముగ నొప్పారుచుండ దానియం దనిష్టము జనింపవలయునన్నఁ గుత్తుకబంటి నారాత్రింబవళులు భుజించుటచేతనో, నూతన పదార్థ రసాస్వాదనా ప్రవీణత మెందుగనుండుటచేతనో, తత్పదార్థాంతస్థరుచి గ్రహణవివేకశూన్యత చేతనో, కాని పుట్టదు. పుట్టినను నూతన పదార్థ సంపర్కమే ముఖ్యమగు. కాలగతిలభించిన పదార్థమును రుచిగలదియే యగునేని వివేకి వేర్వేఱుగ రెండింటి ననుభవమునకుఁ దెచ్చును; కాని, యందొకటి విసర్జించుటయు, రెండు నొక్కటిగాఁ గలిపి మ్రింగుటయు జరిగింపడు. అట్లే సాహిత్యమును.

ఈశ్వరుఁడు వస్తురూపమునఁ దన్నెఱింగించును. కవి పదార్థాధారంబున భావంబు బంధించి తద్వస్తువును వస్తుగత గుణంబును, దన్నిర్మాణ కారకునిఁ గూడ నెఱింగించును. అందువలననే కవికి 'ఈశ్వర' పదంబుఁ జేర్చియుందు రని నా తలంపు. అట్టి కవీశ్వరుని సృష్టి యీశ్వర సృష్టివలె ప్రయోజనకారిగ మెలంగవలయును. నేటికిని గొంగ్రొత్త రుచుల నందించుచు దినాదినాభివృద్ధి నందుచున్న భారతాది యుత్కృష్ట గ్రంథములె నా యీ భావమును బలపఱచఁ గలవు. అట్లాగ్రంథము లాదర్శక మగుటకుఁ దత్కర్తలు నియమబద్ధు లగుటయే కారణము. తత్సాంప్రదాయ విరుద్ధముగఁ

దన్నిర్ణయ పరిపూర్ణమైన భాషను వాడుట స్తన్యపానానంతరము ...మ్మం జఱచుటయ యగునేమొ• .....................

ప్రబంధమునకు లాక్షణికులు నిర్ణయించిన కట్టుబాటుల సక్రమముగా ననుసరించఁ గలిగినచోఁ బ్రబంధనిర్మాణ మెంత యావశ్యకమో చెప్పకయ చెప్పును. చూడుడు• నాటకమునందు నాయకుఁ మఱియొక పాత్రి దూషించుట గాని, హింసించుటగాని కాంచి ప్రేక్షకుఁడు మొదటివానియం దభిమానము ద్వితీయుని యెడ దుర మానము వెనువెంటనే పొందును. అట్లు పొందుటకు నాయకుని యం దలి గుణములు, తన్నాయకుని నడవడిక సంఘు దూరము కాలేదు కనుక. ఆ నాయకుఁడే సంఘాతిరిక్త పథాను సారియైనచో సేవకుఁడు దూషించుచున్నను సుంతైన మనః పరివర్తనముఁ జెందఁడు.

కాఁబట్టి శ్రవ్యమాత్రానందప్రదాయిని యగు ప్రబంధము సర్వలక్షణ సమన్విత యనియు, సద్గుణనాయికా నాయక సంశోభి యనియు, సమస్తవేదపురాణ శాస్త్రార్థ పవిత్రియనియు వేఱ చెప్ప నక్కఱలేదు.

దృష్టిగోచరమగు నేవస్తువును నియమ బద్ధముగాక యనుభవ మునకు రానివిషయ మందఱకుఁ దెల్లమే. అట్టిచో నియమవిరహితమై సాహిత్య మనుభవమునకు వచ్చుటెటులు? ఒకానొక జాతి బీజమున నిక్షిప్త మొనరించిన వేఱొక జాతి వృక్షమై వేఱొండుజాతి ఫలంబు జనించునా? ఎన్నడట్లు పొసగదు. ఒకదానియందు వేఱొకటి యు ఱుంపక యదియె జనించుట సహజము. అదియే నియమము. కా వశమున నాటిన బీజములు వృద్ధికి రాఁదగును. రాఁదగక యుండును ఆరీతిగనే రాజకీయపరివర్తన మొకొక్కప్పుడు భాషకు విలక్షణత్వము ప్రసాదింపవచ్చును. అట్టివికృతి సమయమే యుభయమునకు దోహద మావశ్యకమని బోధించును. దోహదమునకు సంకల్పించిన కృషికు కభిప్రాయభేదములు మెండుగ జనించును. జనించిన వెనువెంటనే కార్యరూపమునకుఁ గాల్ద్రివ్వను. ప్రస్తుతము మన సారస్వత మా

దోహదాచరణ సంచలన సమయమం దుర్యోల బూగుచున్నది. అను శ్రుతంబై, యాచరణయోగ్యంబైన భాష యొకవంక, ననను శ్రుతంబై యనాచరణ యోగ్యంబైన భాష యొకవంక. ఇట్టి యెడ నూతన పరివర్తన మెంతవఱకు?

జాతీయత కొఱవడక రసము నీరవముగాక భావము వైరుధ్యము సెందక ధార కుంటువడక యాచితి యనాదరణము నొందక యర్థము వ్యర్థము నందక ధ్వని కాఠిన్యతఁ బూనక విషయము సాంఘిక మర్యాద నతిక్రమించక యుండునంతవఱకు.

ఈ యుద్దేశ్యమే నన్నీ గ్రంథరచనకుఁ బురికొల్పినది. నా నేర్చి నంత వట్టు శారదా సేవ సల్పితిని. నూతనావేశముతో నూతనా దర్శముతో నుద్విగ్న చిత్తముతో నుష్ణరక్తముతో ముందునకు బరువు లిడుచున్న సారస్వతోపాసకులు సదయులై యీ నా చిఱు పొత్తమునవలోకింప సన్నుతి సల్పుచున్నవాఁడ. స్వల్ప పరిచయమునసె యీ గ్రంథముఁ గృతినంది ముద్రణకు వలయు ధనము నర్పించి భాషాసేవకునిగ నొనర్చిన మ. రా. శ్రీ తటవర్తి సత్యనారాయణ మూర్తి గారికిని వారి కుటుంబమునకును వారి పరిచయభాగ్యముఁ గలుగఁ జేసి నాకీ యమూల్యావకాశముఁ గల్పించిన హితమణులు ధూపం బసవనాగయ్య చుక్కా బసవ నాగయ్య గార్లకును నాయు రారోగ్యైశ్వర్యములు ప్రసాదింప సర్వేశ్వరుని స్తవించుచున్నవాఁడ. నా యీకబ్బము సగౌరవముగఁ దిలకించి కృతిస్వీకరణ సమయమున నధ్యక్షత వహించినట్టియు శ్రమయనక పీఠిక వ్రాసియిచ్చి నట్టియు బ్రహ్మశ్రీ కవిరాజ విశ్వనాథ సత్యనారాయణ యం. యే., గారికిని ముద్రణసమయంబున మిక్కిలి చేయూతనొసంగి నెఱసుల సవరించి కొంగ్రొత్త సౌందర్య మాపాదించిన కవిరాజ సోదరులు బ్రహ్మశ్రీ విశ్వనాథ వేంకటేశ్వర శాస్త్రిగారికిని మనఃపూర్వక వందనములు. నా యీకబ్బము శ్రద్ధమెయిఁ బఠించి యభిప్రాయములఁ గృపతో నొసంగిన విద్వల్లోకమునకు సర్వథాకృతజ్ఞుఁడను.

ఇం దేమేని దోసగులున్న రసజ్ఞులు తెలియఁజేసిన రెండవ ముద్రణమునందు సవరించుకొందును.

ఇట్లు
విద్వల్లోకవిధేయుఁడు
గ్రంథకర్త

---

# సవరణసూచిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| xi | 13 | భాగినికీ | భాగినికిఁ |
| 13 | 11 | లేకఁ | లేక |
| 14 | 11 | నేత్రాంచలములఁ | నేత్రాంచలముల |
| 90 | 9 | శుభశ్చశీఘ్రు | శుభస్యశీఘ్రు |
| 93 | 16 | తీగెల్ సాగఁగ | తీగల్ సాగఁగ |
| 104 | 22 | దర్భల్ | దర్భల్ |

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పీఠిక

—•—

## ఇష్టదేవతా ప్రార్థనము

శా. శ్రీ తారుణ్య విలాస సంపదల మించెన్ గల్కి నీ రూప మా
పాతంబుల్ మధురంబు నీ యధర బింబం బన్న లేనవ్వుతోఁ
బ్రీతిన్ గాఁగిటఁ జేర్చి ముద్దుఁగొను దేవిన్ గూడి క్రీడించు శ్రీ
సీతాకాంతుఁడు రాముఁ డేలు శుభదృష్టిన్ సత్యనారాయణున్ 1

## ఈశ్వరస్తుతి

ఉ. అనవరతంబు రామ చరణామృత సారముఁ గ్రోలుచుండ నా
మనమునఁ గద్దు కోరిక యుమాపతి దానినిఁ దీర్పు మన్న గౌ
రిని జనకాత్మజాధవు చరిత్రలఁ దన్పిన యీశ్వరుండు ప్రో
చును తటవర్తి వంశజు విశుద్ధ యశస్కునిఁ జేసి నిచ్చలున్ 2

## బ్రహ్మస్తుతి

ఉ. శ్రీయుతమూర్తియై విబుధ జీవన జీవన వార్ధరంబయై
వేయును నూరు కాలములు విశ్వము నందున వెల్గునట్లుగాఁ
బాయని వేడ్కతో మనుచు బ్రహ్మము మా తటవర్తి సత్యనా
రాయణమూర్తినిన్ శుభ పరంపరలన్ వెదజల్లు దృష్టులన్ 3

## లక్ష్మీస్తుతి

సీ. ఏ రామ జన్మచే క్షీరవారాన్నిధి
శ్రీపతి మామయై చెన్ను మిగిలె
నే బాల వాసంబుచేఁ బంకజాతముల్
కమలాకరము లన్న ఘనత మీఱె
నే చెలి గృహిణిగా నేలుటచే హరి
భువనపోషకుఁ డన్న పొలుపుఁ గాంచె

నే యింతి సోదరుండై యుంటచే శశి
సురజీవనుం డన్న సూక్తివడసె

తే. నే కలికి బావగా జనియించి వజ్రి
యతులితైశ్వర్య ధుర్యవిఖ్యాతిఁ దనరె
నట్టి కలుముల చెలియ నిరంతరంబుఁ
గృతిపతి గృహంబునందు వర్తించుగాత

విఘ్నేశ్వర స్తుతి

తే. విఘ్నములు వొందకుండఁగ వివిధరస స
మావృతంబయి నాదు కావ్యంబు మించఁ
బ్రమథనాథాయ తే నమోనమ యటంచు
హృదయ మందున భక్తి నర్థింతు సతము

సరస్వతీ స్తుతి

చ. అలికులవేణి పద్మజ హృదబ్జ విహారిణి లోకమోహ సం
కలిత సురూపధారిణి జగత్త్రియపూజితవాణి యిందిరా
లలనకు దీటు వచ్చెడి సులక్షణ లక్షిత నూనపాణి కే
వల నిజపుత్త్రికాంతఁ ఘనవాణి నొసంగుతఁ బూజ్యలౌ గనఁ

చ. కరములఁ జేర్చి మ్రొక్కెద నఖండకృపామతికిన్ విరించిసుం
దరముఖవాసకున్ లలితదామసువాసిత దేహకున్ మనో
హర తనువల్లికిన్ దురితహారిణికిన్ మృదుపుష్పపాణికిన్
వర కమలాక్షికిన్ మధురవాణికి మోహన నీలవేణికిన్

మ. కమలానాథపదారవింద జనితాఖండ ప్రభాయుక్త స
ద్విమలాసంత తరంగపూరిత ధరిత్రీ పాపవిధ్వంస ది
వ్యమనోహాస విశేష లక్షణ కళా ప్రావీణ్య మందాకినీ
విమలాంబుప్లుత కోమలాంగి యగు దేవిన్ వాణిఁ బూజించెదన్

మారుతి స్తుతి

చ. దినకరు దివ్యతేజమును ధిక్కరణం బొనరించి యిద్ది నా
తన ఫల మిష్టు నాకొసఁగెథాత భుజింపఁగ నంచు మ్రింగఁ బో

యిన ఘనదర్ప మా ద్యుమణినే గురువర్యునిఁ జేసికొన్న స
ద్వినయము వాని సత్కృప జపించిన విద్దెల నిమ్ము నారుతీ! 9

మ. తొలిజన్మంబున సల్పినట్టి వ్రతసందోహంబు లెట్టెట్టివో
పలుకం జాలను నీ మనోహర పదబ్జచ్ఛాయలన్ నిల్చి వే.
లలితానంత పదప్రయుక్త విబుధశ్లాఘ్యంబుగా గ్రంథముల్
సలుపన్ జాలితి నట్టి నిన్నుఁ బొగడన్ శక్యంబె వాతాత్మజా! 10

గు రు స్తు తి

క. పుణ్యుని శాస్త్రకలా ప్రా
వీణ్యుని బహుజన్మఫలవివేక ప్రతిభా
గణ్యుని వదాన్యు సుబ్ర
హ్మణ్యగురుని పదములను మదాత్మఁ దలంతున్. 11

సు క వి పు ర స్కృ తి

ఉ. పున్నమనాటి వెన్నెలను బోని యశంబును సూర్యచంద్రు లీ
మిన్నున వెల్గుదాకఁ దమ మేనుల వాసియుఁ గాంచినట్టి యా
నన్నయ తిక్కనాది కవినాయక వాగ్లహరీ మహత్త్వ సం
పన్నత నెంతు నిచ్చలు నపార వచస్సిత గద్యపద్యతన్ 12

కు క వి తి ర స్కృ తి

ఉ. పూర్వుల వోలె శాస్త్రముల బుద్ధిని నిల్పి గ్రహించి దానిచే
నిర్వహణం బొనర్చి ధరణీస్థలి పేరును గాంచఁ జాలమిన్
సర్వము మా ముఖస్థము విశాల జగంబున నంచు నెంచుచున్
గర్వముతోడఁ బొత్తముల ఖండన సేయకుఁ డంచుఁ దెల్పెదన్ 13

వ. అని యిష్టదేవతా స్తుతియు గురునుతియు సుకవి పురస్కృతియుఁ
గుకవితిరస్కృతియుం గావించి మనంబున 14

సీ. తెలుఁగుబాసను కబ్బములు రచించిరి పెక్కు-
గతులను ప్రాచీన కవులు మున్ను
సమకాలికులు వారి చనిన మార్గంబునే
చనిరి కొంచెము మార్పుల నొనరించి
యటుపైని మఱికొంద అద్దారి నిసుమంత
విపులం బొనర్చిరి విద్దె కలిమిఁ
దదుపరి వారలు తారతమ్య మెఱింగి
వెనుకటివారినే యనుసరించి
తే. రింక నిప్పటి కవు లెల్ల నిరుతెగ లయి
కవులటంచును మఱి భావకవు లటంచు
నొప్పు చుండఁగ నెయ్యది యుక్తమంచు
నెంచి మొదటిదారిని నిర్ణయించి యుండ

గ్రంథనిర్మాణావశ్యకత

సీ. గ్రామాధికారి యగస్త్యరాజకులుండు
ప్రజ్ఞాననిధి సుబ్బరావుగారు
పంచాయతీబోర్డు బాలించు ప్రెసిడెంటు
నిజమిత్రతముఁ డాంజనేయశర్మ
ఫారెస్టు పంచాయతీ రిజర్వుకు నేత
మనుజోత్తముఁడు హనుమయ్యగారు
మునిసిపు పదవిచేఁ బొలుపుఁగాంచెడి మేటి
కమ్మ శేషయనామ కలితఘనుఁడు
తే. నుబుసుపోకకు నొకనాటి యుదయమందు
రచ్చటఁబుగులఁ గూర్చుండి ముచ్చటించు
చుండ ననుఁగాంచి మాకు హితుండవును గ
వీశ్వరుఁడ వొక కృతి రచియింపరాదా

ప్రశంసా ప్రసూన మంజరి

క. తెలుఁగునుడి పూవుఁదోటలవెలయింపవసంతమఁటులవిచ్చేసిః
కలకండపల్కు ప్రోవుల తలఁపులు దెసలెల్ల నిండి తనరెడు దీః

చ. పరువము దప్పి గాడ్పులకు వాడి వివర్ణతఁ జెంది ధూళిఁనూ
సర మయి యాకు రాలిచిన శాఖలు కల్గు తెలుంగు తోఁటలోఁ
సరసుల కింపు సొంపొలయఁ జక్కని జాను తెనుంగు క్రొంజడుల్
గురియఁగ నేర్తు వీవు నవకోమల వాక్య రసాత్మకంబుగా 18

మ. మకరందం బొలికించు పూగముల సంభావించునే యింకఁ దా
వకభాషాసుమవాటి వెల్వడిన దీవ్యద్ జ్ఞానబోధామృత
ప్రకటానర్గళ కావ్య మంజరుల నాఘ్రాణించు తద్ జ్ఞాళి యి
ట్లు కదా యుండవలెఁ భవమ్ము కనుచో లోకంబునం దేరికిఁ 19

వ. అని బహుప్రకారంబుల నుత్సాహకరవాక్యంబులఁ బలికిన నట్ల
యగుగాత మని నేనును 20

శా. భావం బందున నొక్క కబ్బమును సల్పంగాఁ దలంపూని యే
తేవఁ బద్దెము లల్లి పండితుల చూడ్కిఁ బెట్టి మెప్పింతు నా
శావార్థిఁ దరియింతు నే ననుచుఁ జర్చఁ సల్పి ధైర్యంబుతో
సావిత్రీచరితంబు వ్రాయుటకునై సంకల్పముఁ జేసితిఁ 21

వ. ఇది యిటులుండెఁ గార్యాంతరాసక్తుండనై పర్యటనము సేయుచు
దైవప్రేరితంబుగఁ గనగాల యను గ్రామంబుఁ జేరి యచట
నొక మిత్రుని ప్రోత్సాహంబున నొకటి రెం డుపన్యాసములతో
నవధానంబుఁ గావించిన నాతండు. 22

సీ. ఒకపరి మినువాకసిక తాల్పు మూడవ
కంటి మంటను మించఁ గలుగు మంట
లొకపరి జాబిల్లి యొప్పును లెక్కింపఁ
దెలిము త్తియములతోఁ జెలఁగు నలలు
నొక పరి పెన్నిటిమొకపు గుంపులతోడ
నెల్లజీవులు తల్లడిల్లు హోరు
నొకపరి నేనకా యుర్వర పెద్దని
తలఁచి నశ్లేనుఁగు ధాటి పోటు

తే. నొక్క పరి యాకసము నుండి చుక్క లూడి
పడిన చందానఁ జల్లనై పైకిఁ బైకి
లేచి విరిసిన కెరటాల లేత గావ్పు
వెలువరించు నీ పలుకు కూర్పుల పయోధి

చ. తెలతెల వారు వేళఁ జనుదెంచిన చల్లని పిల్ల గాడ్పు తా
కుల వికసించి తేనియను గొల్లగ నిండిన జాతి మల్లె పూ
వుల సముదాయమై వెలయుఁబో సతతంబును నీ ముఖంబునన్
వెలువడు పల్కు మొత్తమని వేఁడుగ నే వచియింప నేటికిన్

వ. అని వినుతించి స్రక్చందన తాంబూల వస్త్రాదుల నర్చించి
'కిల్లటంపు టల్లుండ'గా నెంచితి నని సవినయంబుగఁ బల్కి
నాలకించి మిత్రార్థంబు తోడి మ జ్జన్మ సార్థకం బగు నని
మద్విరచిత చిత్రాశ్వీయనామక కావ్యకన్యాకరగ్రహ
హియా నాతని నభినందించి యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి
మంగళాశాస్యంబుఁ గావించుచు నేతత్కృతిభర్తృ వంశ
తారం బభివర్ణించెద

కృతిభర్తృ వంశావతారవర్ణనము

క. చండతరమైన తపమున
మెండుగ దీపించి ఋషుల మిన్న యగుచు నా
ఖండలుని యట్ల సురలను
కౌండిన్యుఁడు జగతి వెల్గె కరుణాళుండై

క. ఆ ఋషి యాచారంబులు
మీఱకఁ దటవర్తివారు మెలఁగుచు ధరలో
నా రవి తారార్కంబా
పేరును గడియించినారు పృథుగుణమణులై

క. వారల లోపలఁ బ్రథముఁడు
సాగోదారాంతరంగ సంకలితుండై

మీ తెలుగురుని సెట్టి యనఁగా
బారము లేనట్టి ధర్మపరుఁడై సతమున్ 28

క. ఆయన కాంచెను వల్లభ
రాయుఁడు రాముండు ననెడి రత్నంబుల నా
ధీయుతులు పుణ్యమతులై
చేయించిరి సత్రికానూవి శేషము లెన్నో 29

వ. అందగ్రజన్ముఁడైన వల్లభరాయుఁడు త్రిగుణంబులట్లు చల మయ్య నరసింహ రామయనామ పుత్త్రికుల నందె నేతద్వంశ సంభవుండై 30

ఉ. శ్రీయును రూపసంపదయు శేముషి సజ్జన సాధు సేవయున్
బాయని దైవభక్తియు నపారవదాన్యత సూనృతవ్రతం
బేమెడ వెన్కఁ జూడని యహీనపరాక్రమమున్ వహించుచున్
రాయలు కృష్ణరాయ లయి రాజిలె ధారుణి సాటివారిలో 31

క. వారికి మునిమనుమఁడు సు
బ్బారాయుఁడు వన్నెఁగాంచెఁ బ్రవిమల మగు సీ
తారాముల పదముల నెం
తో రహి సేవించుచు నఘ దూరస్థుండై 32

ఉ. ఆతఁడు పెండ్లియాడెను మహావిభవంబుఁ దలిర్ప సద్గుణో
పేతను జ్ఞానసీతను వివేక వినమ్ర విశాలసత్య వి
ఖ్యాతను పిచ్చమాంబిక నకల్మషచిత్తను నామె యందునన్
నీతిపథానువర్తనుల నిశ్చలచిత్తుల మూగురన్ గనెన్ 33

వ. ఆ మూవురు ముమ్మూర్తుల క్రియ నాగభూషణంబు వెంకటప్పయ్య రామయ్య యనెడి యభిధానంబులన్ గలిగి త్యాగమూర్తులై విల సిల్లి రంత 34

ఆ. వె. నయవిదుండు ఘనుఁడు నాగభూషణగుప్త
పిచ్చమాంబ యనెడి పెలఁదిమిన్నఁ

పెండ్లియాడి తమ్మ వేనోళ్ళఁ బొగడంగ
జనులు ముగురు సుతులఁ గనిరి వారు ౩౫

తే. అభిధ లందిరి పిచ్చయ్య యనఁగ రామ
మూర్తి సత్యనారాయణమూర్తి యనఁగ
నలరఁ జొచ్చిరి కాలత్రయంబు నాఁగఁ
బరువు మర్యాదలకు సుంత కొఱత లేక ౩

తే. వారి లోపలఁ గడగొట్టు వాఁడు ధన్యుఁ
డార్యవినుతాభిరామ సత్కార్య ధుర్యుఁ
డర్థిమానసవారిజాహస్కరుండు
రాజితగుణుండు సత్యనారాయణుండు ౩

సీ. అననే యనం డెంత యాచించినను మాట
యనినచో నద్ది కాంచనపు మూట
పల్కనే పల్కఁ డెవ్వరితోడ నొకపల్కుఁ
బల్కెనా యద్ది రాచిల్క పల్కు
చేయనే చేయఁ డే స్థితియందునఁ జెలిమిఁ
జేసెనా యద్ది సుస్థిరపుఁ గలిమి
నమ్మనే నమ్మఁడు నరసమూహ గుణము
నమ్మెనా యద్ది చాపమ్ము గుణము

తే. అనుచు లోకము వినుతింప నాతఁ డొప్పె
బలి శుక మహర్షి రామ పావనుల మించి
దానసంయమ సత్యవ్రత ప్రభావ
పూరితోదార భారత పుణ్యభూమి ౩

చ. ఎవని చరిత్రమున్ వినుతి నింపు దలిర్పఁగఁ జేయఁగల్గుచోఁ
గవనము సెప్ప నేర్పునకు ఖ్యాతియు రీతియు మిన్నుముట్టు మా
నవతను బొందినందులకు నాడె మెసంగును లచ్చితోడ వై
భవము రహించువాఁడు తటవర్తికళాంబుధిచంద్రుఁ డౌను పో ౪

సీ. ఇచ్చి మున్గినవాఁడు నీయక మునుఁగని
వాఁడు లేఁ డాతనితోడఁ గూడి
నమ్మి చెడినవాఁడు నమ్మక చెడనట్టి
వాఁడు లే డాతనితోడఁ గూడి
నిల్చి యోడినవాఁడు నిలువక గెలిచిన
వాఁడు లే డాతని తోడఁ గూడి
పల్కి బొంకినవాఁడు పల్కక బొంకాడు
వాఁడు లే డాతని తోడఁగూడి

తే. యతఁడు మానవమాత్రుఁడే యమల హృదయ
మంజులాలాప సంస్తుత్య మహిత కుసుమ
విసర విరచిత సన్మార్గ విహారణచణ
రాజితగుణుండు సత్యనారాయణుండు 40

తే. సత్యపదపూర్వకంబుగా సంతతంబు
ధ్యేయుఁ డయ్యెను భువిని నారాయణుండు
సత్యపద పూర్వకంబుగా సంతతంబు
ధ్యేయుఁ డయ్యెడు భువిని నారాయణుండు 41

క. ఆ యనఘుఁడు వైవాహిక
మాయెను నీలికుల వనవిహారశ్రీ సం
ధాయినియైన సరస్వతి
నా యమ పుత్రికలఁ గాంచె నానందముతో 42

వ. వారును శుక్లపక్ష సుధాకిరణుని క్రమంబునఁ గ్రమప్రవర్ధమానలై పిచ్చమాంబ కమలావతి పద్మావతి యనసూయలునా నామంబు లంది గృహాలంకారంబు లయి ముద్దు మురిపెములు గూర్చుచుండిరి. మఱియు 43

2

సీ. ఇతఁడు విద్యావంతుఁడే యన బడి గ్రంథ
నిలయమ్ముగా నడిపెడు తెలివి సాక్షి
యితఁడు సత్ప్రాలకుండే యన కో-ఆప
రేటివు వెలయించు రీతి సాక్షి
యితఁడు సద్వర్తనుండే యన నోజ్జ్వల
సంఘంబు నేలిన శక్తిసాక్షి
యితఁడు దీక్షాదక్షుఁడే యన శ్రీయార్య
వైశ్యసంఘాధ్యక్ష పదవి సాక్షి

తే. యితఁడు మిత్రులఁ గాచు వాఁడే యనంగ
నయ్యవారైన బసవ నాగయ్య సాక్షి
యితఁడు శారదోపాసకుఁడే యనంగ
నితరమును జెప్ప నేల నా కృతియె సాక్షి.

వ. ఇంక మదీయం బైన వంశంబు నభివర్ణించెద,

సీ. ఘనుఁడ భారద్వాజ మునిగోత్ర సంయుత
కోటాన్వయంబున గుణవిశేష
ములయిన గురువయ్యను హనుమమ్మను గన్న
వారిగా నెంచెడి వాడ సుబ్బ
మాంబకు రామయ్య కతిమోద మిచ్చు ద
త్తుఁడ సుబ్బరాయశిష్యుఁడ విశుద్ధ
హృదయుల పదముల సదమలమతి తోడ
బూజించువాడ నమోఘమైన

తే. బ్రహ్మచర్యంబుఁ దీర్చుచుఁ బ్రవిమల మగు
దశరథాత్మజు పాదపద్మములఁ గొల్చు
గంధవాహన తనయు నఖండ భక్తి
చే నుపాసించువాఁడ నిశ్చింతతోడ

తే. ఇట్టి నను మెచ్చి కృతినందు నెలమి దాల్చి
శారదోపాసకుల కెల్ల సంతసంబు
లలర మా కిల్లటపు టల్లుడైన వాని,
సుగుణ రాశిని జెప్పెద సూనృతముగ 47

షష్ఠ్యంతములు.

క. ఏవం విధ గుణమణికిఁ
భావజ్ఞున కఖిలసుగుణ పరిపూర్ణునకుఁ
దైన ధ్యానామృత లహ
రీ వీచీ విహరణమునకుఁ బ్రియభావునకుఁ. 48

క. భోగికిని బంధుమిత్ర స
రాగికినిఁ దీనలోక రక్షణ నిష్క
త్యాగికి సదసత్కృతి సువి
భాగికినిఁ గుటిలతరవిభవ విరాగికినిఁ. 49

శ్రీరస్తు

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# చిత్రాశ్వీయము

## ప్రథమాశ్వాసము

వ. అభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లుగ నా యొనర్పం బూనిన చిత్రాశ్వీయం బను మహాప్రబంధమునకు స్థాన భూతం బైన 1

### మద్రదేశవర్ణనము.

వ. నగముల మేరు వట్లు సుగుణంబుల శాంతము రీతి విద్దెలన్ నిగమము మాడ్కి మానవుల నిర్మలు పోలిక సూనపంక్తి సం పెంగ గతి వాద్యవస్తువుల వీణక్రియన్ పథు లందు ముక్తి భా తిగఁ బొలుపొందు మద్ర మను దేశము దేశము లందు మిన్నయై 2

వ. ఏతద్దేశంబునకు రాజధాని యగు పట్టణంబు 3

సీ. అంబరంబును దాకు నట్టి సౌధంబుల
సుందరం బగునట్టి స్యందనముల
నెద జల్లు మనిపించు మదకరీంద్రంబుల
నందమైనట్టి యుద్యాన వనుల
సకల శస్త్రాస్త్ర ప్రశస్తులౌ యోధుల
నానందమౌ జలయంత్రతతుల
నుచ్చైశ్శ్రవప్రభ నోడించు హయముల
శ్రీకరంబైన పద్మాకరముల

తే. వర శుక మరాల శారికా హరిణతతుల
మృదుమధుర రమ్య సత్ఫలవృక్షతతుల
లలిత కర్పూర వేదికా స్థలుల గలిగి
వఱలుచుండెను నాకంబు ప్రతిభ నొఱసి 4

క. అన్నగరమునకుఁ బోల్పఁగ
మున్నెన్నఁడు గనఁగ లేదు పురముల నెందుఁ
గన్నుల వైకుంఠంబై
మిన్నందుచు జగతి మించు మించు విధమునన్ వ.

సీ. వైకుంఠ పురమును బ్రభువు పాలింపక
పాలమున్నీటి లోపలనె యుండుఁ
గైలాసమును భూతగణములు పాములు
మంచును గలిగి వర్తించు చుండు
సత్యలోకంబును జడదారి మూకల
గొడ నగు నుపనిషద్ఘోష నుండు
స్వర్గలోకంబును సంతత మధుపాన
మగ్న దేవాళిరై మలయుచుండు

తే. ఘనత మీఱిన యట్టి లంకాపురంబు
ఘోర రాక్షస వారంబుఁ గొలిచియుండు
ననెడి దోషంబుఁ బోఁగొట్టుకొనఁ దలంచి
మించి సృజియించె దీని విరించి తెలివి

ఉ. అందముఁ జెప్పనేల ధర యందున నెందును ముందు వెన్క లే
దందును మంచులైనను యథార్థముగాఁ బురిఁ జూచి రేని సం
క్రందనవాటికా సుమ మరంద పరీమళవాత వీచికా
స్పందితచిత్తులై నిలిచి పందెము వెట్టుచు సాటి వారితో

సౌ ధ వ ర్ణ న ము

ఉ. అందలి సౌధరాజము లహర్నిశలుఁ మణిసూర్య కాంతిచే
తం దనుకాంతిచేతఁ బ్రమదా జన నిర్మితమైన మల్లెపూఁ
బందిరులఁ దదంతర నివాస భుజంగమ మాళిభాసితా
మంద మణి ప్రదీప్త శశిమండితమై వెలుఁగొందు నెంతయున్

ఉ. ఆగక దేవ దానవు లహర్నిశలుఁ మథియించు వేడికిఁ
గ్రాగిన పాల మీఁగడలు గట్టి పయిం దిగజాఱి గాఁబులై

యూఁగెను భూమిపైఁ బడక నంతట సౌధము లయ్యె నింటికిన్
సాగిన మేడ మొత్తములు చంద్రుని బొమ్మ నగల్పనో యనన్ 9

### బ్రాహ్మణాదివర్ణనము

వ. మఱియు నా పట్టణంబునం దనవరత క్రియమాణ జప తపః
ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ
యోగ నిరంతర పవిత్ర ధరణీసురవరులును సురవరసందోహభుజా
శ్లేష ప్రణయైకచిత్త రంభోర్వశీ మేనకా మంజుఘోషా ద్యప్సరః
కాంతాసంభోగాసక్త రణనిహతవైరిగణ సంపూర్ణ ధరాభారవహు
లును భారవహధురీణ మృదులాంగులీమధ్యస్థ కమలాలయా
కరుణాకటాక్ష ప్రభాపరిపూర్ణ తులా సంపాదిత ధనబల తిరస్కృత
గుహ్యకేశ్వరవణిఙ్మణి నికరమును మణినికర గో వృషభ మహిష
నికర నిరంతర త్రైవర్ణిక సేవాఫల సంపాదిత విజ్ఞానకిరణసముదయ
విదళనాజ్ఞానాంధకార పాద సంజాతులును సంజాత కామోద్రేక
పరవశోద్భూతాపాంగ చంద్రికా ప్రసారాకర్షణ భుజంగ
చాతక సమావృత వారవనితలును వనితా జనతా ఘనతాప
హార సంతత మధుభార మంద మందగమన సమీర కుమారంబు
లును కుమారమయూర కలహంస కారండవ బక చక్రవాక
మృదుపద సంచార పవిత్రీభూత కాసారంబులును సారతర ఫల
ప్రసాద పనస బదరీ నారికేళ చూత ఖర్జూర నారంగ దాడిమీ
కదళికావృక్ష మండిత సఫలోద్యానంబులును సఫలీకృత మనో
రథ ముదిత రాజాంతఃపుర కామినీమణీ వేణీ రంగస్థల చిత్ర
విచిత్ర నర్తన బహువిధ కుంద మందార కురవక పున్నాగ నాగ
మదన లతా పరివేష్టిత లీలోద్యానంబులును లీలోద్యాన లతా
గృహమధ్యస్థ పత్రవర్ణ ధిక్కార తృణకదంబ రత్నకంబళ శయన
సుఖ మిళిత సారంగంబులును రంగదుత్తుంగాభంగ తరంగ సంగత
గంగామంగళతర తనూసాంగత్య భూధరంబులును ధరణీ వరణీయ
శిరస్సుల కేయూర మణీభ్రమప్రసాదిత భగవన్నిర్మిత చంద్ర
కాంత శిలాతల శోభిత ధరణీ వరణీయ ధరాధర శృంగంబులును

గలిగి, కవి బుధ గురు పరీవృతం బగుటఁ జేసి నాకంబు
నిరంతర లక్ష్మీ పరిపూర్ణం బగుట కతన వైకుంఠంబు రీతి
సాహిత్య వేద వేదాంగ పఠన పాఠక జన సంయుతం
సత్యలోకంబు మించి సర్వమంగళాలంకృతం బగుట కైలా
పోల్కి శత్రు దుర్భేద్యమై హేమకుట్టిమ ప్రాకారగోపురభ
యచలత్వంబు నందుట మహామేరు నగంబు వైఖరిని విబు
సమ్మాన విధాన కలితమై పాతాళ పర్యంత వ్యాప్త
వృత్తిం బొల్చుట వింధ్యాద్రికై వడిఁ బలువిధ దివ్యౌషధీ
క్తమై హిమాచలంబు లేవ బొలుపొందుచుండు-మఱియు,

సీ. ఆత్మలాభమునకై యతి మృదు వాక్కులఁ
బలికి మోసము సేయఁ దలఁచువారు
నీ తోనె స్వర్గంబు నిజము నమ్ముమటంచు
మాయాప్రమాణముల్ సేయువారు
మధుపాన వశతనుమై మఱచి తిరిగి
పిచ్చిమాటల నెల్లఁ బ్రేలువారు
స్వపరపక్షంబుల సామర్థ్య మెఱుగకఁ
బ్రతిదానికిని దలపడెడువారు

తే. స్త్రీ శిశు పశువులఁ గని హింసించువారు
నర్థులను గాంచి దూషించునట్టివారు
ధనము మఱగి బిడ్డలగొంతుఁ దఱుగువారు
కలికమున కేని వెదకినఁ గానరారు

వ. ఇంకను

సీ. ప్రభువుల కరుణ సంపాదింప మది నెంచి
నైచ్య వర్తనమున నడచువారు
పరుల కల్మికిఁ దమ ప్రాణముల్ పోయిన
గతి గృహంబుల వహ్నిఁ గాల్చువారు

రొక్క మాసించి మఱొక్కని చావునఁ
గూలి యేడ్పుల నేడ్వఁజాలువారు
న్యాయ్యరంగమున నన్యాయ్యంబుగాఁ దీర్పుఁ
జెప్పి లంచంబు లాసించువారు
తే. కడుపు గడిచినఁ జాలని పడపుఁజెలుల
పంచఁ గావలిఁ గాయ సహించువారు
మచ్చు కేని యధర్మమం దిచ్చ గలుగు
వారు నెంతగాఁ గనిననా వాడ లేరు 13

వ. అట్లు సర్వలక్షణలక్షితం బైన యప్పట్టణం బేలు ప్రభుం డెట్టిఁడన

ప్ర భు వ ర్ణ న ము

ఉ. ఆ నగరాధినాథుఁడు దయాగుణసాంద్రుఁడు సత్యవంతుఁ డ
జ్ఞానలతాలవిత్రుఁడు విచారణదక్షుఁడు శిష్టరక్షణుం
డానతవైరి పండితుఁ డయాచిత దాన పరుండు సాధు స
న్మానుఁడు శూరుఁ డశ్వపతి నాముఁడు కీర్తివహుండు భాసిలుఁ 15

క. అతఁడు బలాధిపుఁ డనుటకుఁ
జతురంగ బలంబె సాక్షి సమవర్తి యనన్
హితులను నహితులఁ గన్నిడి
జతురతతోఁ జూచు కలిమి సాక్ష్యం బిచ్చున్ 16

అ శ్వ ప తి యు ద్యా న వ న ము ం బ్ర వే శిం చు ట

వ. ఆతం డొక్కనాఁ డుదయమునఁ బయనంబై శుక పిక శారికా మయూర కూజితంబులు వందిమాగధ స్తవంబులుగ వల్లరులచే నల్లిబిల్లిగ నల్లబడి చల్లని పిల్లవాయువులఁ గొల్లగ వెల్లి విరియించి యుల్లములఁ బల్లవింపఁ జేయు పూఁబొదరిండ్లు విలాస హర్మ్యంబులుగ రాజహంస చకోర చాతకాది విహంగకులము స్వజనంబుగ వియన్నదీ తరంగంబులన్ జనించి విమల సుమరజఃపటలిన్ బెరసి మంద మంద గమనంబుల నరుదెంచుచున్న సమీరంబులు వ్యజనంబులుగ సరోవర ప్రతిబింబిత నిజకోమలారుణచ్ఛాయా

విలసిత కిసలయంబులు హేమచ్ఛత్రంబులుగ నపరిమిత ష
మిళిత మగు కపురంపుఁ దిన్నెలు వివాహమంటపములుగఁ
చాతుర్య నిర్మిత విచిత్ర స్తంభనిర్గత బహుళవారిధారా ప్రవ
నిస్వనంబులు మంగళవాద్యంబులుగఁ బ్రవిమల కమలషండ
రందామృతపాన సంజనిత మధుకర ఝుంకారంబులు
వేడుక పాటలుగ మధుమాసవేళా విధికల్పిత శుభ ము
ర్తంబున వనలక్ష్మీ వసంతుల పరిణయంబుఁ గని యానంది
గురంగచారులచే నాహూయమానుండై యే తెంచిన
నారామంబు సొచ్చి

సీ. లలిత రసాలపల్లవముల గ్రహియించి
తృప్తిగాఁ బిక సంతతికి నొసంగి
జలజమూలంబులఁ జక్రవాకములకుఁ
గుత్తుక బంటిగాఁ గుడువఁ బెట్టి
సుమసమూహంబును శోధించి మధువును
భ్రమరసంతతికిఁ ద్రావంగ నిచ్చి
మధురంబు లైనట్టి మాలూరఫలములఁ
బిలిచి రాచిల్కల కొలమున కిడి

తే. హరిణ మిథునంబులకుఁ జేమ లంది యిచ్చి
మృదుల పవమానహతిఁ జలియించుచున్న
సరసు లందున రాజహంసలను డించి
విహరణ మొనర్చె నందందు వివిధగతుల

శా. కాసారంబుల పొంత కేఁగు లతి శృంగారంబుగా నాడఁగఁ
డా సంతోషము పెల్లుగా నుబుకఁ జెంతన్ జేరి వీక్షించి యో
రా సంసార సముద్రమున్ గడువఁ బుత్రప్రాప్తి సౌవర్ణసో
కాసంపత్తియె యన్న పండితుల వాక్యంబుల్ స్తుతించున్ మదిన్

తే. గలగల మటంచుఁ గొండవాగులు ధ్వనింపఁ
గిలకిల మటంచుఁబులుగులు పలుకరింపఁ

గలకల మటంచుఁ బూలు వెన్నెలలు గురియ
సృష్టివైచిత్ర్యమునకు నచ్చెరువు నొందె. 20

తే. భూధరాగ్రంబు లందుండి భూమిఁ బడుచు
రాలతాకుడుచేఁ దుషారములఁ జిమ్ము
ఝరుల పొంతన విహరించె శ్రమలు వాయ
దళిత శత్రుసమూహుండు ధర్మరతుఁడు 21

సీ. పచ్చవిల్తుని శాస్త్రప్రపఠనంబు నందేరు
ఘను లని పెనఁగు జింకలను గాంచి
పాషాణము ద్రవింపఁ బాడఁగా నేరు పె
ద్ద లనుచుఁ గూయు కోకిలలఁ గాంచి
నృత్యంబు సలిపెడి నేర్పులోఁ బ్రభు లేరు
తెలుపుమం చాడు కేకులను గాంచి
పలుకుఁ బల్కిన ముద్దు లొలుకఁ బల్కుట కేరు
బలు లని పల్కు చిల్కలను గాంచి

తే. యూరక యిటు లెంచఁగా నెన్ని యర్థములకుఁ
జాల దీ సృష్టి యని సంతసంబు నంది
గుబురుగా నున్న లే మావి గున్న నీడ
విశ్రమించెను నొక కొంత వేళ వఱకు 22

నారదుం డశ్వపతి జూడ వచ్చుట

వ. అంతట 23

సీ. తన మనోహర దేహ ధవళిమ దశదిశాం
చలముల లేత వెన్నెలలు గాయ
దన దక్షిణ కరాబ్జమున నొప్పు మహతీ ర
వంబు పీయూష వర్షంబు గురియఁ

దన వదనాంభోజమున నుండి వెల్వడు
గానంబు ఖండ శర్కరలు నింపఁ
దన దివ్య మానసంబున నిండియుండిన
ప్రేమ బోధ మలయానిలంబు వీవఁ

తే. దన పదాంభోజ యుగ్మ పావనత యఖిల
ధారుణిన్ నిండి గొప్ప క్షేత్రములఁ జేయ
నలినసంభవు బిడ్డయా నారదుండు
వత్సలత యొప్ప వచ్చె నశ్వపతిఁ జూడ

వ. అట్లు యతికులచంద్రుం డనంతుని యనంత లీలామాహాత్మ్య
దన యసమాన కంఠ మాధుర్యంబునకు మహతీ నినాదంబు
దంబుగా గాన సమీరంబు నుత్పత్తిం జేసి శ్రోతల సహస్ర
సంచితంబులై పశుపత్నీ మిత్ర పుత్ర రూపంబుల భూలోక
యమ యాతనలం జిక్కించి స్రుక్కించునట్టి పాపమ్ము లను
కమ్మలం దొర్లించుచు రా వీక్షించి యెదుర్కొని సాష్టాంగ
ప్రణామ ప్రదక్షిణంబు లొనరించి నిర్మల కాసార వారి
ప్రక్షాళిత పాదాబ్జ యుగళుం గావించి పుణ్యపురుషుల యం
బోని కర్పూర వేదిక పయి నాసీనుం గావించి కుశల మ
బద్ధాంజలియై యున్న భూపాలునిం గూరుచుండ సన్న యొ
యతి రత్నంబు,

మ. ధరణీనాథ కులాబ్ధిపూర్ణశశి నిత్యంబుల్ ద్వదీయాజ్ఞలన్
శిరముల్ దాల్తురె భూమిపాలురు సదా శ్రేయోఽనుకూలా
గరుణాలేశము లేని మానవులు గల్గంబోరుగా రాజ్యమం
దరి సంఘానల మారిపోయెనె కృపాణాంభః ప్రపాతాహతిన్

సీ. శరణాగతత్రాణ పరుఁడవై రాజ్యంబుఁ
బాలింపుచుంటివె భద్రముగను
ధర్మంబు నాల్గుపాదములను నడిపించి
యరిజన హరుఁడవై యలరు చుంటి

వే! మహాత్ముల పాద విమలాబ్జముల యందు
. . నిరతంబు భక్తిచే నెగడుచుంటి
వే! కల్మషార్ణవ బీభత్స దావాన
లంబవై యెపుడు చెలంగుచుండు

తే. దే! యటంచును బ్రశ్నింప దృఢతర కర
వాల మాత్ర దూరీకృత పాపజన స
మూహుఁ డిట్లనె సంయమి ముఖ్యుతోడ
మందహాసంపుఁ జంద్రికల్ మలయుచుండ 27

క. కరుణాకర మీ కృపచే
నరవరు లెల్లరును బాప నాశంకరులై
ధరణినిఁ బాలనఁ జేతురు
నిరతము నా యాజ్ఞ దాల్చి నిశ్చల మతితోన్ 28

వ. వెండియు 29

మ. జననాథాగ్రణి పల్కె మానిఁ గని రాజ్యంబూర్జితం బయ్యెఁ బా
వనతన్ గాంచె మదీయ జన్మము శుభప్రాప్తుండనైతిన్ ఫలం
బును హృద్వాంఛిత పాదపమ్ము వడసెన్ బుణ్యంబు సేకూరె ధీ
జనులన్ గౌరవ మెంతయో కలిగె మీ సందర్శనం బబ్బుటన్ 30

క. ఊరక రారు మహాత్ములు
కారణ మెఱిఁగింపు డనుచుఁ గరములఁ జేర్పన్
సారం బగు పల్కులతో
జారుకటాక్షమ్ముల వెదఁ జల్లుచుఁ బ్రేమన్. 31

శా. దేవారాధన భక్తియుక్తులను స్వాధీనాత్ములన్ భక్తిత
త్త్వావేశాఖిల లోక వర్జితుల ధర్మాసక్తులన్ బూజ్యులన్
నే వీక్షించుచు వచ్చి నిన్నుఁ గనుఁగొంటిన్ దీరె నా కోరికల్
పోవంగా సెలవిమ్ము భూప యనినన్ భూమీధవుం డిట్లనెన్ 32

వ. పూజ్యులు విచ్చేసి భూపాలురను బుద్ధిమంతులుగ నొనర్చుటయు
రాజులు వారి నాతిథ్యంబులన్ దన్పి యాశీర్వాదంబుల వడయుటయు

నాచారం బందు మీాకర్తవ్యంబు దీర్పఁగొంటి రిఁక నాకర్తవ్యం
నిర్వర్తింప కుంట ధర్మంబే భవదీయ పాదపల్లవ కాంతిరస ప్ర
హంబును మదీయ చంద్రకాంత శిలా నిర్మిత సౌధాంతరంబు
ప్రవహింపం జేసి యనుగ్రహింపుఁడని భటుల వీక్షించిన వా
చతురంతయానమునం దధివసింపం జేసి మానివర్యుని భవ
మధ్యంబున రతనంపు గద్దియపై నునిచి స్వధర్మముల నెఱవేర్చు
కమ్మెయెడల కరిగిరి రాజును నారదునకుఁ గైదండ యిచ్చి స్వ
మందిరము సొచ్చె ననుచు శుకయోగీంద్రు నీక్షించి జనమేజ
జనకుం డిట్లనియె

క. సందియము కలిగె నొక్కటి
డెందంబున దానిఁ దీర్పుడీ మునివర్యా!
కంద ఫలాదులఁ దినువా
రెందులకు జనపతులఁ గన నెంతురు మదిలో

మ. అనినన్ మానివరేణ్యుఁ డిట్లనియె రాజా! ధర్మచింతాభిలా
షణు లార్తావను లాశ్రితామరతరుల్ సర్వేశ పాదాబ్జ చిం
తను లైనట్టి మునీంద్రు లీ జగము నానాభ్రష్టతన్ జెంద దా
నిని వారింతురు మిమ్ముఁ గాంచి తమదా నేర్పున్ బ్రతిష్ఠించుచు

క. వారట్లు సేయకుండిన
భూరమణు లధర్మ మార్గమునఁ బోదురు భూ
భారమ్ము దానఁ గల్గు ను
దార చరిత్రా ముకుంద దర్శన పాత్రా!

వ. అనుటయు విని సంతసించి యవ్వలి కథ నానుపూర్వికంబుగ
నెఱింగింపవే యనుడు ఋషి చంద్రుఁ డిట్లని చెప్పం దొడంగె.

సీ. పన్నీరునం దోఁగి పరిశుభ్రవసనముల్
సవరించి భోజన శాల కరిగి
హేమపాదంబుల నింపు నింపెడు నట్టి
చిఱు గద్దెలందు నాసీనులైన

తదనంతరంబున తళతళకాంతుల
వఱలెడు బంగరు పళ్లెరములఁ
గూరలుఁ బచ్చళ్ళు గోఘృతంబును బిండి
వంటలుఁ బప్పును బాయసమును

తే. బులుసుఁ బెరుగును జిత్రాన్నములును వంట
క్షత్రియులు వడ్డనము సేయ నుత్తమ వచ
నముల వల్కికొనుచు భోజనములఁ జేసి
యినకులేంద్రుఁడు యతికులోపేంద్రు తోడ 38

వ. నిజ శిఖరాగ్ర చుంబిత నభోభాగంబును నిజ కిరణాక్రాంత విశాల ప్రదేశంబును నిజకుడ్యభాగస్థగితబహువిధామూల్యశృంగార రత్న బంధురంబును నగు సౌధారోహణం బొనర్చి కనక స్తంభసంభృతంబును కమనీయమణిగణ సంకలితంబును, హంసస్వరూప చిత్రిత శిరఃప్రదేశ సమన్వితంబును నగు శయ్యాతలంబున నుపవిష్టులై యుచిత భాషణంబులఁ గాలంబుఁ గొంత ద్రోసి మునివల్లభుని లక్షించి జనవల్లభుం డిట్లనియె. దేవా! సర్వకాల సర్వావస్థల యందు నిరవధిక సంతాపంబు తాపంబు నొందించు హృదయంబు న్బదిలంబుగ నుండ నీక పలు భావంబుల న్బడఁద్రొబ్బుచు నన్న పానంబుల యం దనిష్టంబు సూచించుచు దేహంబు నేనుంగు తిన్న వెలగపండు గతి యొనర్చు వాఙ్మనసాతీత మయి యొప్పు నావుడు

ఉ. 'ఏమి కొఱంత కల్గదు మునీశ్వర నా దగు పట్టణంబునఁ
క్షేమము సర్వ' మంచును వచించిన వాఁడవు కాద తొల్లి యి
ప్డేమి ఘటిల్లె నంచు నిటు హీనవుఁ బల్కులఁ బల్కుచుంటివో
నా మది యందు నుంత స్ఫురణమ్మున లేదు వచింపు దానినిఁ 40

వ. అంత ఋషితిలకా! యే దేవతారాధనంబునఁ బురాకృత కర్మ భంజనంబై పుత్రకుని యవ్యక్తమధురాలాపంబుల శ్రవణంబు లక్ష్మీణాహ్లాదపరవశమై సౌఖ్య, నే దుర్భర దురంత దుస్సహ దుర్నిరీక్ష్య దురవగాహవ్రతసముదయంబున భవ నౌకా కర్ణ

ధారకుండగు చిన్ని బుడుతఁడు కన్నులపండువౌనరించునే పుణ్య
క్షేత్ర సందర్శనంబు కొమరుని చిఱుకరంబులఁ గరమ్ము న్ద
మ్ముల ధరింపఁ జేయునే పవిత్ర జలావగాహనంబు పున్నా
నరకంబుఁ బోఁ ద్రోవం గల్గు పుత్రుని జన్మమునకాధారం బ
నని ఖిన్నవదనుండై ప్రత్యుత్తరంబు వీక్షించు రాజాగ్రగణ్యు
ఋష్యగ్రగణ్యుఁ డిట్లనియెఁ బూర్వజన్మ సంచిత తపః ఫలవి
షమ్మున నాక సుపుత్రావాప్తి కలుగ నేర్చునే మైన నిందుల
వ్యతిరిక్తముగ ఫలంబుల వడసిన యితిహాసం బొండు కల ద
వినుపింతు వినుము ధరణీకాంత ఫాలభాగంబు నందలి మృగమ
తిలకంబు చాడ్పునఁ గళింగదేశంబు ప్రకాశించు నద్దాని

నారదుం డశ్వపతికి సుదేవోపాఖ్యానంబు చెప్పుట

సీ. స్వకులోచితంబైన సామ్రాజ్యపదవినిఁ
బాలించు దార్ఢ్యపరుడు గాక
కలిగినంతకె మనఃకమలంబు వికసింపఁ
జేయు నీచాపేక్షఁ జెందఁ బోక
సంసృతివారాశిఁ జరియించుచుండుఁ దు
చ్ఛ విషయసమితి నెంచఁగఁ బోక
మిత్ర ధర్మంబు సమృద్ధిగ నుండఁగఁ
గప్పించు దుష్టసంగతుఁడు గాక

తే. ప్రీతి నభ్యాగత స్స్వయం విష్ణు వనెడు
ధర్మవున మున్గుఁ గలుషపథమునఁ బోక
నహహ యిట్టి మహాత్ము నెందైనఁ గాంచఁ
గలమె యనుచును ప్రజయెల్లఁ బలుకుచుండ

తే. రాజ్య మేలుచు నుండె శ్రీరాము పగిది
సద్గుణంబుల కాతని సాటి యొండు
కల డటంచును బలుకంగ నలవి కాని
దివ్య తేజః ప్రభుండు సుదేవవిభుఁడు

సీ. ఎవని కీర్త్యున్నతు లిందుని కళలను
బదునేను దినములు పాయఁ జేసె
నెవని ధీ పాటవం బింద్రగజంబును
పాండు వర్ణంబునఁ బ్రబలఁ జేసె
నెవని బాహుబలంబు మృగరాజు నజ్ఞాత
వాసంబుఁ జేయించె వనుల యందు
నెవని దానమహత్త్వ మీ యజాండము నిండి
బలిని పాతాళంబువఱకుఁ ద్రొక్కె

తే. సట్టిసత్ప్రతిభాశాలి యమలయశుఁడు
ఘన జన స్తోత్ర సద్భాగ్య కలితుఁ డధిపుఁ
డైన వాఁడయ్యు గర్వ మింతైన లేకఁ
జనులఁ గన్న సుతు లటు పాలనము సేయు 44

తే. ఘోరశత్రువు నైనను గూర్మిఁ జూచుఁ
గాని సమయింప నెంచడు ఘనుఁ డగుటను
భాగ్య భోగ్యము లెన్నైనఁ బ్రబలియున్న
జనుల సొమ్మని యెంచును సముఁ డగుటను 45

తే. ఇదియు నది యని వర్ణింప నేల నెన్ని
సద్గుణంబులు కలవొ కంజాతగర్భుఁ
డన్ని యొక్కటిగాఁ జేర్చి యతి చతురత
నుద్భవింపఁ జేసె నతిశయోక్తి కాదు 46

వ. అట్లా చరాచర పరీవృతాఖండ భూమండలమండనాయమానుండు వయసునఁ జిన్న యయ్యు వ్యవహారంబులఁ బెద్దయై సుకుమార గాత్రుం డయ్యు సంగ్రామంబున వజ్రసన్నిభుండై లతాంతాయుధు నారాచంబుల ధాటికి గురియైన వాఁడయ్యుఁ దుచ్ఛ కామలతాలవిత్రుండై బహుకాంతా సేవితుం డయ్యు నేకపత్నీ వ్రతస్థుండై 47

ఉ. కాలముఁ బుచ్చుచుండెను సుఖంబుల ప్రోవు సుదేవుఁ డెంతయుః
లీలల యందు బొంకులును లేని వినిర్మల సత్యసంధుఁడై
యేలుచునుండి పుత్ర సుఖ మెన్నటికిన్ లభియింపఁ బోక భూ
పాలుఁడు దుఃఖవార్నిధికిఁ బాలయి యొక్క దినంబు నందునన్,

వ. అమాత్యుల రావించి

తే. శీతకరుఁడు లేనట్టి నిశీథము వలె
వనము నందునఁ గాయు పుష్పంబు లటులఁ
బద్మహీన మయిన సరోవరము పగిది
జన్మ మంతయు నాకు నిస్సార మయ్యె

తే. ఏమి చేయఁ గలాడ నే నింక నంచు
నశ్రువులు జాఱుచుండ నేత్రాంచలములఁ
గద్గదిక కంఠతలమునఁ గ్రమ్ము కొనఁగఁ
బలుక విని మంత్రి వరులు భూపాల చంద్ర

తే. ఎందులకు దుఃఖ మొందెదో యెఱుక వడదు
తెలియఁ జేసిన నోపిక కలిగినంత
త ద్ప్రయత్నంబు నందునఁ దవిలి మేము
శుభము చేకూర్తు మనిన భూవిభుఁడు వలికె

క. రథగజతురగ పదాతులు
పృథివిన్ గంపింపఁ జేయు వీరులె యున్నన్
వ్యథ పాయ దొక్కనాఁడును
వృథ యగు సంతాన సుఖము వేడుక లేమిన్

చ. అన విని మంత్రివర్యులు సమాదరణంబునఁ బల్కి రిట్లు ధీ
జననుత పాపభంజన యసత్య చరిత్ర వనీ కుఠారమా
మనవినిఁ జిత్తగించి కలి మాయ నడంపఁగఁజాలుఁ బుణ్య వ
హీనుల మునింగి దైవముల నెంతయుఁ గొల్చిన వాంఛ తీరెడిన్

వ. ఈ ప్రకారంబుగ భవిష్యత్కార్యప్రబోధం బొనరించి డెందంబున
సందడిఁ గొను నానందంబు పొంగుపఱచిన ప్రధానుల లక్షించి
సుధామధురంబులైన వాక్కుల జనవల్లభుండు 55

శా: సంతోషం బొనగూడె రాజ్యమును మీ స్వాధీనమం దుండ నా
వంతైనన్ బరిపాలనంబునను దుర్వ్యాపారముల్ కల్గ న
ట్లెంతో శ్రద్ధ మెయిన్ జరింపవలె నేనిష్టార్థముల్ పొంది మీ
స్వాంతంబుల్ ముద మంద వచ్చెదను పోవంగాఁ గటాక్షింపరే. 56

వ. అనుఁడు 57

చ. జలజల నశ్రువుల్ కనుల జాఱఁగ మంత్రులు పోయి రందు మ
మ్ముల మఱువంగఁ బోవకుఁడు మోహముఁ ద్రెంచుడుభక్తియుక్తి భూ
వలయముఁ జుట్టిరండనుచుఁ బల్కిన భూ రమణుండు కాంతతోఁ
దెలతెలవారు వేళ వర తీర్థములన్ గనఁబోయె వేడ్కతోన్ 58

వ. ఏతత్ప్రకారంబుగఁ గళింగరాజ్య రమా కరగ్రహణానం దాతిరేక
సంజనిత ఘనప్రభావ వినిర్మల వియద్గంగా విహార చేతస్కుం డగు
సుదేవభూనాయక చూడామణి చతుర్దశ భువన పరితాపకారణ
చటుల భయద పాపానల జ్వాలికా మాలికా సందోహ శమన
వ్యాపార వాఃపాతనిభ మందహాస ప్రపూర్ణ వదనుం డగు మదన
గోపాలుని హృద్వీణాభక్తితంత్రులన్ బాడి, కోటిసూర్య సమప్రభా
కలితమై కోమలప్రసూన సంస్పర్శనాతిమృదులమై యజ్ఞాన
తమఃపటల విచ్ఛేదక ఖద్యోతోదయమై జానకీ మనశ్చకోర సుధా
దీధితియై నీలకంఠ నృత్య హేతుభూత నీల నీరద గాత్రమై వందారు
సురసందోహ జేగీయమానోపనిషదర్థ ప్రకారానుకారి మౌనీంద్ర
మానస మధుకరాకాంక్షిత పాదపంకేరుహమై యమందానంద
కందళిత హృదయారవింద వైదేహీ వక్షోజ కుంకుమాంకిత వక్షః
కవాటమై త్రిపురహరణ సమయ పశ్యత్ఫాల కరకమల కీలిత
మహామేరు నామక ధనుః ప్రభానిరసన కోదండచాప ప్రయుక్త
హస్తమై విజితనీల నీరద కోమల శ్యామల మనోమోహకరమైన

భద్రాచల శీర్షాగ్ర నటన్మనోహర పద సీతాజాని రూ
మానస సాకేత నగర సింహాసనంబునఁ బ్రతిష్ఠించి, త్రయ
త్కోటి దేవానీక సంస్తూయమాన సత్ప్రతిభా సమన్విత
నంద నిధి యగు మహానంద నిధిం జేరి యాలయ గోపుర ప్రా
మండపాద్యలంకారవిశేషంబులు విశేషించి గ్రహించి
నందీశ్వర జిహ్వాంతర్గత జనిత సలలిత సలిల కలిత సరోవరం
భక్తి పురస్సరంబుగ మజ్జనంబాడి గర్భద్వారంబు గడచి
సంరక్షకుండైన యీశ్వరు భవబంధంబులం ద్రెంప నర్చించి
శ్రితదుస్సంగం బగు శ్రీశైల మహాలింగంబు నారాధించి దురిత
పవిత్రాంతరంగ యగు పాతాళ గంగఁ బవిత్రులయి య
కులం గూడి కోటి గుణిత మహేశ్వర స్వరూప ప్రతిశిలా
బగు కోటిలింగ క్షేత్రంబు సందర్శించి యపగత దురహంకా
బగు నోంకారంబుఁ జేరి యానంద తరంగం బగు శ్రీరంగ
వీక్షించి రాత్రించర ఘటాపటల మదాపహరణ సింహం
నహోబిల నృసింహంబును లక్షించి యాతాయాతయా
సామంత జన సమర్పిత నానావిధ ధన కనకవస్తువాహన
పరిహసిత నరపతి యగు తిరుపతి సొత్తెంచి పాప విమోచన గో
కాశగంగా గోవిందరాయాలి వేలుమంగాపుర సందర్శనంబు
దూరీకృతపాపుండై భక్తలోక పూజా సమయ విరచిత బహు
ప్రసూన సంతాన గర్భమధుర మకరందధారా ప్రక్షాళిత పద
విలాస భాసుం డగు కాళహస్తి నివాసుం గొలిచి రంగత్కృపా
తాపాంగ పతంగ భంజితరుజా శోకభయ తమఃపటలం బగు మ
గిరి నృసింహ నిటలతటంబున దృష్టిసారించి విరించి ప్రసాదిత
శరీరధారణంబునకుఁ బారంబుఁ గల్పించుటకుఁ గారణంబు
యణ చరణసేవా పరాయణత్వంబె యని తలంచి యేలకీ ల
లుంగాది పరిమళద్రవ్య చూర్ణవాసనా విలసిత గుడశకల వారి
శతకోటి శతకోటి ఘటాభిషేక శీతలకాయుం డగు పాన
రాయనిం గని దక్షవాటికా శృంగాటక పార్శ్వ

విలసిత లలిత విద్రుమ లతాకుడుంగ మనోహరానేకపుష్పమంజరీ కింజల్క రంజిత మంజుల మద మధుకరపుంజ ముఖ సంజాత రవ ముఖరిత దిశావకాశుం డగు ద్రాక్షారామభీమేశు భజించి సకల సుకవి నికర విరచిత మృదు మధుర పద కుసుమ విసర జనిత మధురసహరణవిజితగుణధాముఁ డగు కాంచీపురలలామునిం గాంచి కాంచన గో భూ గృహ వస్త్ర జల దానంబులన్ దైర్థిక జనుల నర్చించి మార్గమధ్యస్థాయాచిత లబ్ధ గోదావరీ కావేరీ కృష్ణవేణ్యాది పవిత్ర పుణ్యనదీతోయస్నాతుండై సుభద్రా వద నారవింద నిష్యంద మరంద బిందు సందోహ పాన నయనాంజలి సనాథుం డగు జగన్నాథునిన్ బ్రణుతించి స్మరణమాత్ర సర్వ సర్వంసహా మర్త్య సముదయ పాప లతా విధ్వంసక ఘోరతర ఖరఖరాసి యగు వారణాసిం గనఁ బోవుచుఁ గట్టెదుర 59

ఉ. కాంచిరి రాజదంపతులు కల్మషభంగను దేవ యక్ష ద్ర
క్సంచిత పుణ్యసంగను బ్రశాంత కృపా విమలాంతరంగనున్
జంచల పద్మ రంజిత విశాలతరంగను జక్రవాక స
త్క్రౌంచ బకాది మోహన పతంగను రంగదభంగ గంగనున్ 60

వ. కాంచి తన్నదిన్ గ్రుంకు లిడి తత్సమయోచిత క్రియల నాచరించి తన్నగరీ ప్రసిద్ధ దైవంబులన్ గొలిచి కొలిచిన వారికి న్గొంగు బంగారం బగు నన్నపూర్ణపదకంజాతంబుల కడ వ్రాలి యచటనుండి దర్శనమాత్రప్రసాదిత సకలైశ్వర్యుం డగు గాశీవిశ్వేశ్వరు వినుతించి యచటు వాసి కాలభైరవునకు గరములు మోడ్చి తదనంతరంబు కొంత కాలం బందు నివసించి నిజపుర సందర్శనా యత్తచిత్తంబున సహచారిణిని వీక్షించి 61

చ. ప్రణయలతా ప్రభావమునఁ బ్రాణము నిల్పితి నింతదాక నీ
ప్రణయ సుఖంబు లీ ధరణి వ్యర్థము తీర్థములన్ మునింగినన్
మణి గణవాహన ప్రకర మంజుల భోగము లెన్ని కల్గినన్
గుణముల కిక్కయైన నవ కోమలగాత్రుని పుత్త్రుఁ గాంచమిన్ 62

చ. తిరిగితి మెల్ల దేశముల దివ్య తరంగిణులన్ మునింగి భీ
కర మగు కామ మోహముల ఖండనఁ జేసితి మెల్ల వారికిన్
గరములు మోడ్చి మ్రొక్కితిమి కాయము సన్నగిలంగఁ బెక్కు
సరముల నొక్క ప్రొద్దులను సల్పితి మన్నియు రిత్త యయ్యెడిన్

క. తొలి బామునఁ బాపంబుల
సలిపితి మెన్నని వాని శక్తిని పుత్త్రిల్
కలుగ రిఁకం బ్రాణముతో
నిలపైఁ బ్రదుకంగఁ జాల నింతీ! యిటుపై

వ. అనుడు!

క. నాథా యశ్లీలంబుల
బాధింపఁగ నెంచి యిటులఁ బలికెద రకటా
యే ధర్మ మందుఁ జూచిన
నాథుఁడె దిక్కని వచింత్రు నారుల కెపుడున్

ఉ. మీ రిది గుర్తెఱింగియును మేనును బాసెద నంచుఁ బల్క నేఁ
జూఱఁగొనంగఁ జూచెద నె శోకతమః పరిపూర్ణ సంసృతిన్
దూఱబె బంధుసంతతి యధోగతి కాశ వహించి భూమి నీ
తీరున జీవముల్ నిలిపి దిట్టతనంబున నుండె నంచు నన్

ఉ. కావున నాదు ప్రాణములఁ గానుకగా భవదీయ పాదరా
జీవము లందు నుంచెద విశేషసుఖంబున కాలవాలమై
పావనమై పరార్థమయి భాసురమై జగదేకలాలితం
బై వెలుఁ గొందు ముక్తిపథ మందెద నొందెద సంతసం బెదన్

వ. అని యివ్విధంబున వాఃపాతసదృశాశ్రుజల మనంతముగవర్షించి
వక్షోరుహామేదినీతలం బెల్లన్ జల్లన చేయుచు దీనవదనయై భ.
పాదంబుల న్బడి వేడ నా రాజాన్వయ చాతకంబు లెట్టిం
తమకంబున

శా. ఓ ప్రాణేశ్వరి యో చకోరనయనా యోచంద్రరేఖాసఖీ
నా ప్రారబ్ధ మదిట్టు లుండ విలపింపన్ జెల్లునే నీకు భ

ర్తృ ప్రజ్ఞా పరికల్పితం బయిన యుర్వీశ్ జేరి సానందవై
నీ ప్రాణంబులఁ గాచి కొమ్ము భయసందేహంబులన్ వీడుచున్ 70

వ. అంత 71

చ. ఇహపరసాధనం బయి విహీన దురంత విచార వహ్నినై
యహరహ మా రమాధిప దృగంచల రక్షిత దివ్యభూతివై
సహజ పతివ్రతాత్వ విలసద్రమణీ చిరకాంక్షితంబునౌ
సహగమనంబు మానుడునె చానలు పూరుషు లెల్లఁ దిట్టఁగన్ 72

శా. అగ్నిం బోసిన యాజ్య మట్ల మది యత్యంతోష్ణతన్ బ్రేగగా
భగ్నానందను జేయఁగాఁ దలఁప భావ్యంబె త్వదీయార్చనా
లగ్నంబైన మదీయ మానసము నిద్రన్ జూచినన్ వేఱుగా
మగ్నం బౌనె పరీక్షసేయఁ దగునా మా నాథ పాదార్చనా 73

తే. అనుచుఁ బల్కిన గృహిణి వాక్యములను విని
యంతు లేనట్టి యానంద మనుభవించి
ప్రియసతిని నక్కునం జేర్చి ప్రేమ మీఱ
నలకలను దువ్వి చెక్కు ముద్దాడి యంత 74

వ. కతిపయ దినంబులకు గృహాభిముఖు లయి చనుదెంచుచు మార్గ
మధ్యంబున 75

ఉ. వంతలఁ ద్రెంచి మాని సురవంద్యు త్రివిక్రము పాదపద్మముల్
స్వాంతము నందు నుంచి నిరపాయ సుఖోన్నతి కాకరంబుగా
నెంతయు ఘోరమౌ తప మహీనముగా నొనరించి మించి ధీ
మంతులు నెంచ నైన యొక మౌనిమహేంద్రునిఁ గాంచి రంతటన్

చ. కనుఁగొని భక్తి నంజలిని గానుకగా ముని పాదయుగ్మమం
దునిచిన నా తపస్వియును యోగబలంబున జ్ఞానచక్షులన్
జనపతి వాంఛ లోనెఱిఁగి చల్లని చూపుల వారిఁ జూచి ప్రే
మను ఘన మంత్రరాజముఁ గ్రమం బెఱిగింపుచు నిచ్చె నిచ్చినన్

వ. అ మ్మహర్షి తమ యెడం బ్రసరించిన యవ్యాజకరుణా కటాక్షం
బులకు న్పునః పునః ప్రణామసహస్రంబు లాచరించి సిద్ధనాయకుని

సెలవుం గైకొని యొక్క కాంతారంబుఁ జేరి జాయాసమేత
యమ్మహామంత్ర మతి నిష్ఠ మెయి జపించి చింతిత కార్య
వడసె నీవును నా యిచ్చు సావిత్రీ మహామంత్రంబును స
ననుష్ఠించి త్వదీప్సితం బీడేర్చుకొ మ్మిద్ది పురాతన మైనది
బుణ్యమునకు మూలమైనదియును నిష్టార్థసిద్ధికర మైనదియును
నని యుపదేశించి సుఖం బుండు మింక నే నేగి వచ్చెద నని
బ్రహ్మలోకోన్ముఖుం డగుడు మద్రపతి

మ. మునినాథా! యిది వెన్క నేరి కడ నే పుణ్యప్రభావుండు నే
ర్చెను దానఁ దనువొందె నెట్టి వగు కోర్కెల్ దాని నే యే
బున సల్పందగు సల్పకున్న యెడ సంపూర్ణంబుగా నే యఘ
బునకుఁ దారి ఘటించునో తెలుపవే మోదుర్తుఁ గరద్వంద్వము

క. ఈ విధమునఁ బ్రార్థించిన
భూవిభునిఁ గాంచి కరుణ మొలకెత్తంగా
నీ విపు డడిగిన ప్రశ్నము
నే వినుపించెదను వినుము నిర్మల మతితో

నారదుండు బలిచక్రవర్తి నిర్జరలోకంబు నిర్జించిన తెఱంగెఱింగించుట

మ. లలితామేయ విలాస సాధగణమై లావణ్యపూర్ణంబునై
ఫలపుష్పాన్విత వృక్షమంజుల లతాపాత్రంబునై నిత్యమం
గళమై యాచక కల్పవాటి యయి సత్కర్మాలవాలంబునై
బలి రాష్ట్రంబు వెలుంగు హారమణినా బ్రహ్మాండ సల్లక్ష్మికిన్

సీ. తమ తపోమహిమకు ధారుణీతల మెల్ల
విలిచికొనం దగు విప్రవరులు
తమ భుజా బలమున కమృతాంధసుల నైనఁ
జాలమం చనిపించు క్షత్రియులును
తమ ధన గరిమ చేతను గుబేరుని నైనఁ
బరిహసింపఁగఁ జాలు వైశ్యవితతి
తమ సత్య నిష్ఠ చేతను హరిశ్చంద్రుని
శోభఁ దగ్గించెడు శూద్ర జనులు

తే. గాక వ్యతిరేక మార్గముఁ గలుగు వారు
కంచు కాగడ న్వెదకినఁ గానరారు
బాపురే యిట్టి పుర మన వశము కలదె
దాని కిది సాటి యనఁగ జగానఁ గాన 82

తే. పుష్పముల జంటఁ జూచినఁ బున్నె మేమి
మనము సంతృప్తిఁ బడ వానిఁ గొనినఁ గాదె
యనుచు సుమ దామములఁ దాల్చి జనులఁ బిల్చి
పుష్ప లావిక లా పురిఁ బొల్చు చుంద్రు 83

సీ. నృత్యంబు సలిపెడి నేర్పులో నునుగాను
కలదొ లేదో యను కలతఁ గూర్ప
నభినయం బొనరించు నప్పుడు కరకంక
ణధ్వని జంత్ర స్వనమునఁ గలియఁ
గనులఁ ద్రిప్పు హొయలు కాంచు వారల మనః
కమల పాళికి నర్క కాంతి గాఁగఁ
బ్రవిమల గానంబుఁ బ్రవహింపఁ జేయుచో
జడములు చైతన్య జలధిఁ దోఁగఁ

తే. జేయుచుండుదు రప్పురి శీత కిరణ
నిభముఖాబ్జలు నంభోజ నిర్మలాక్షు
లఖిల విద్యా సనాథ లత్యంతభోగ
వర్తనలు జారసుముఖలు వారసఖులు 84

వ. అట్టి పురంబేలు నేలిక యెట్టిఁ డనఁ 85

సీ. కనువిచ్చిచూచిన ఘన భుజంగమ్ములు
ఫణము లెత్తక వంచి చనఁగవలయు
బొమముడి పాటున భువనముల్ పదునాల్గు
కడలి నీటను దెట్టె గట్టవలయు

దంత ఘటన మాత్ర దశదిశల్ కంపించి
పగులుచు బీటలు వాఱవలయుఁ
దీక్ష్ణ శాసనముచే దినమణి చంద్రులు
తేజో విహీనులై తిరుగ వలయు

తే. నతఁడు దానవ మాత్రుఁడే యఖిలలోక
దీన సంతాన దారిద్ర్య తిమిర పటల
భంజనానంత దాన ప్రభావ రుచిర
జలజ హితవర్తి యా బలి చక్రవర్తి.

చ. అతఁ డొకనాఁడు పద్మజ కృపాత్త సమస్త దిగీశ దేవతా
తతి హృదయాంత రుజ్వల ప్రతాప ధనంజయ శోషణోగ్రతా
స్తుత లయకాలవారిద విధూత శిలాయుత వర్షపాత వ
ద్ధృత హరదత్త సద్వర విధేయ మనో జలరాశి గర్వుఁడై

తే. అక్క సెల్లెంద్ర బిడ్డల మయ్యు నిట్టు
లొకఁడు సౌఖ్యంబు నంద వేఱొకఁడు వాని
పాదముల నొత్తు చుండు దుర్భర దరిద్ర
మునను గుందఁగఁ జేసెఁ గాఁబోలు బ్రహ్మ

ఉ. చారు తర ప్రభావ ఘన సంస్ఫురణంబున శత్రుకోటినిర్
బోరున నేర్చి తీరని ప్రమోదము తోడుత స్వర్గలోక మెం
తో రహి నేలఁ బోక యిటు దుఃఖపయః పరిపూర్ణ వీచికా
వార నిరంత తాడన విభగ్న హృదంతరు లౌట యొప్పునే

శా. దారిద్ర్యానల కీలికాప్రభలచే దగ్ధంబుఁ గాకుండఁగా
నే రక్షఃకుల నిత్యవృద్ధికర హృన్నీరంధ్ర సంభూత దు
ర్వార ప్రస్ఫుటవైరినాశ జలదావార్యాతి వర్షోరుగం
భీరాసారము చేత నార్పెద మహాభీల క్రమోల్లాసినై

శా. మోదంబుల్ దిగఁద్రావి రేఁబవలు నే మాహాత్మ్య చందంబుల్
ఖేదం బందఁ బనేమి శాత్రవుల లక్ష్మిన్ గాంచి చింతామణి

వేదిక భాగముఁ బంచి యీయుము మని దోర్వీర్య ప్రతాపంబుచే
వాదంబుక బచరించి కాదనిన నాపైఁ బొంగుఁ బోకార్చెదక 91

వ. అని యాత్మగతంబున జ్జింతించి కనుఁగొనల నగ్నిస్ఫులింగంబు
లెగయక ద్రయత్రింశత్కోటి దేవానీక భ్రాతృభావనా విహీన
మానస సంభూత ప్రాచీన దుర్భరావమాన ప్రతీకార వాంఛా
ధనంజయ గర్భ నీల వర్ణ పాషాణ క్రోధప్రతాపాయః ఖండ సంఘ
ర్షణానల కీలాపరిపూర్ణ హృదయారణియై భుజాదండంబు సారించి
జగద్భారభరణ వేదండతండ ప్రచండకుంభస్థల సమ్మర్దారత్నౌఘ
సంకీర్ణ ధరామండలం బగు గదాదండంబు డంబుమీఱ భుజంబున
మెఱయించి క్షీరవారాన్నిధి మథన సమయ పూర్వ దేవదేవతా
నికర ప్రకల్పితానల్ప మందర నామక మంథాన పరివృత ముహు
ర్ముహు స్సవ్యాపసవ్య ప్రపీడ్యమాన వాసుకి ఫణాధరముఖోద్గత
నిశ్వాస వాయు నిభ జగదవసానవేళా విజృంభిత నిటలనయన
నయన ప్రచండానల జ్వాలాభీల ప్రతిమాన హాలాహలవీచీవిలం
ఘన నిశ్వాస పరంపరా ప్రయుక్త నాసికా వివరుండై దక్షయజ్ఞ
విధ్వంస హేతుభూత రుద్రప్రోత్సాహిత నిర్నిద్ర రౌద్ర వీరభద్ర పరి
హసన క్రోధోద్రేక సంచలిత సర్వాంగుండై గమన సమయ
క్రమాఘట్టన కంపితాఖిల పశుపక్షి మృగవ్యాళ వానర నర సుర
కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర గరుడ గంధర్వ యక్షఖేచర
శిలోచ్చయ గహన కల్లోలినీత్యాది చరాచర భరణ దిగ్దంతి పన్నగ
జరఠ కచ్ఛప కుంభస్థల ఫణాకర్పరుండై చిత్రాతిచిత్ర విచిత్ర
నిర్మిత వజ్రవైదూర్య నీల గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య
ముక్తాప్రవాళాది నానావిధ రత్నచ్ఛటా కాంతిచ్ఛటా దేదీప్యమాన
విరాజిత పారిజాత సింహాసనము నం దాసీనుండై సకల సామంత
దనుజ కవి నట నటీగాయక వందిమాగధ స్తవంబు లొక
వంక బోరుకలంగ నరాంతక త్రిపురాంతక కాలాంత కాఖ్యామాత్య
చూడామణులు మూర్తీభవించిన త్రేతాగ్నులువోలె వేఱొక
వంక నాసనంబులందుండి రాజ్యతంత్రంబు లెఱుకపఱుప శకుని శం

బరకాలనాభ ద్విజిహ్వ వక్రనాస లంబోదర లంబకర్ణాది
నాయకతతి కులగిరిసప్తకం బట్లు యింకొకవంక రాణింప న్గొల్వ
ఝుంఝూ మారుతాహ త్యఖండావర్త చ్ఛటా సంక్షుభితా
గంభీరధ్వన్యనుకరణంబున సభికుల నీక్షించి

ఉ. కంటిరె కాదె దేవత లకారణవైరముఁ బూని ధీరులై
కొంటె తనంబునన్ సిరులఁ గొల్లఁడఁ జేసి వనీతటంబునన్
గెంట సపుత్త్ర బాంధవ సఖీజన మిత్ర కళత్రభ్రాతృలై
యుంట స్వశక్తి వీడి మన ముండిన మండిన నొక్కటే గదా

సీ. మనవార లేకద యని యుపేక్షించుట
ఫణికిఁ బాలోసిన పగిది యయ్యె
ముందైన దయసూప కుందురా యని యుంట
వేపఁ దీపినిఁ బెంచు విధమె యయ్యె
మా గతి యే మంచు నుఱి మఱీ వేడుట
మూగతో సల్పిన ముచ్చటయ్యె
భాగ మిం డనుచును బాధింప కుండుట
వారి దే యని దృఢపఱచుటయ్యె

తే. నిప్పుడైనను గన్నులు విప్పి వారు
మనకుఁ జేసిన తీవ్రావమానమునకుఁ
బ్రతిఫలంబుగ ఘోరసంగ్రామ రంగ
మందు నాశన మొనరింపు డందు మిమ్ము

సీ. మన మెత్తఁదనము చేతను హరియించిరి
రమణీయ రాజ్య సర్వస్వ మెల్ల
మన దిక్కు లేమి చేతను నాక్రమించిరి
చింతామణీ వేది స్థిరము గాను
మన పేదరికము చేతను బారఁద్రోలిరి
దారుణాభీల కాంతారములకు
మన యింటి తగవు చేతను వృద్ధిఁ గాంచిరి
చక్షువుల్ దట్టి శీర్షముల పైకి

తే. నేటికైనను త్వన్నిరాఘాట చటుల
శాత్రవానీక భుజ బల శ్మాజ దళన
సారతర శౌర్య ఘోరకుఠారధార
సాన వెట్టుడు సురల శీర్షంబు లందు 95

గీ. సర్వజన దుర్లభంబైన స్వర్గ సౌఖ్య
ముల ననుభవించి వెలలేని ముదముఁ గాంచి
శాత్రవులఁ జించి దివ్య యశంబుఁ బెంచి
మించు సమయంబు నేఁడు లభించె మనకు 96

ఉ. కావున బుత్త్రమిత్ర సముకార లత ల్దెగఁగోసి శూరులై
పావనమైన కీర్తిరమ ప్రాపునఁ బూర్వుల నుండఁద్రోసి సాం
పావహిలంగ శాత్రవుల నాహవ రంగమునందు డాసి దై
త్యావళి యుక్కుముక్క లని ధారుణి నిండఁగ జేసి వెల్గుడీ. 97

శా. దంభోళిప్రతిభా ప్రభావ దితి సంతానంబ మీరెల్ల రా
రంభా ద్యుజ్జ్వల కామినీ సురత సంప్రాప్తంబునర్ జేసి యా
యంభోజాసను విష్ణునిర్ త్రిపురసంహారుర్ జగన్మాతలర్
సంభావించుట మాని క్రూరమతులై సాధింపఁగాఁ బోకుడీ 98

చ. కదనము లోపలర్ జయముఁ గాంచుటో లేకటఁ జచ్చుటో యొన
ర్పఁ దలఁపుఁ డంతెకాని యరివారము ధాటికి నోడి పందలై
సదనమునందుఁ దూఱకుడు చచ్చిన స్వర్గమె యున్న స్వర్గమే
యిది యదిగాక లోక మవహేళనఁ జేయఁగఁ జేయఁబోకుడీ. 99

క. నేటికి మన వారలలో
నూటికి నొక్కండు సుఖము నోచఁగ లేదీ
పాటియగు బ్రదుకు లేటికి
యేటికి మన బుద్ధి బల మదేటికిఁ దలఁపర్ 100

శా. భాగస్వాములు న్యాయమార్గ చరులై భాగంబు నర్ధంబుగా
నీఁగల్గంగఁ దలంపు వెట్ట రకటా యే నుందు న్యాయాని కెం

దేఁ గూడుండ దటన్న పల్కు నిజమయ్యెఁ వారి యైశ్వర్య
లా గంగానది యందు వైచు నెడ తప్పొ చెప్పు డిప్పట్టునన్

క. ధర్మముఁ దప్పక మన మా
దుర్మతులను యుద్ధ మందు దోర్బల మొప్పన్
మర్మములఁ గలఁచి కత్తులఁ
జర్మంబుల నొలిచి చంపఁ జనఁ దగు నిపుడే

చ. అని వచియింప నంత దనుజావళి జైబలిరాజ యన్న ని
స్వనములు మిన్నుముట్టఁగ స్తవం బొనరించుచు శత్రుసంతతిన్
దునుమఁగఁ బట్టి కొట్టఁగ విధుంతుదుఁ డెక్కడ కేతు వేడ
యనుచును వేగమే పఱచి రాహవదీర్ణ సుపర్వ దేహ సం
జనిత కవోష్ణరక్త మధుసార విలేహన వాంఛ లూరఁగన్

చ. చని చని కొన్ని నాళ్లకు నిశాచర సంతతి కాంచె స్వస్తివా
చన జప వేదమంత్ర రవసాంద్ర దిగంతర పుణ్యపాకమున్
ముని సుర కిన్నరీ ఖచర భూచర సాధ్య ఫణీంద్ర సిద్ధ పా
వన చరణారుణాబ్జతతి భాసుర లోకము నాక మాదటన్

సీ. తమ చేతి హేతుల తళతళల్ రోదోంత
రమున విద్యుత్సమూహమును నింపఁ
దమ ఘోరసింహనాదము లోని కఠినత
జగముల మేఘ ఘోషణముఁ బెంపఁ
దమ శరాహతిఁ ద్రెళ్లి ధరణిపైఁ బడు విమా
నములు పిడుగుల మొత్తముల వంప
దమ పాన వశత వక్త్రములుబ్బు తుప్పర
క్షోణీస్థలిని జడివాన ముంప

తే. రేగి నలుదిక్కులకు మూగి సాగి ద్రోగు
గా నరుగుదెంచి సుమ వాటికా ప్రశస్త
నందన వనంబు నందు నానంద మొప్ప
విడిసి కాంచిరి స్వర్లోక విభవ మెల్ల

వ. కనుఁగొని మనమున వనజోదరు ఘనచరణ వనజముల నినుమడిం చిన భక్తిని వినుతింపుచు నెనలేని వినయమునఁ జనుచుండిన ముని గణమును గని కనులను బెనఁగొనిన యానందాశ్రు కణముల నుచితగతి పదముల యందు నుపహారముగ నునిచి దీవనలను గొను సుమనస్సంతతి సుమనస్సంతతి యుప్పొంగునటు లొం డొంటి నొరయుచు వితండవాదమునకుఁ గడంగిన పండితప్రకాం డులఁ బెండుపఱచి కొండొక కోర్కెచే గుండె గూడువట్టక మండి పడు చుండు బ్రహ్మచారి తండంబువలె త్రుళ్లింతలాడుచు భండన మున రిపు తండంబుల నొత్తి గదాదండంబుల మొత్తి తుదకు నిండు ప్రాణంబుల డిందువడం జేసికొని చండకిరణ మండలంబును జెండుకొని వచ్చు నెఱజోదు దండునకు దండలు వైవం బోవునప్పుడు వారి కెదురు పౌజులు దీర్చు బెడంగుతో నొప్పుచుండిన చను గుండులఁ గన్నులపండు వొనర్చు భోగ వేదండగమనలకు సొమ్ములు చూపి కమ్మని ముద్దిమ్మని సమ్మర్దమ్ముఁ జేసి సొమ్మ సిల్లి తనువెల్ల జెమ్మగిల్ల పదమ్ములే శరణమ్మని కపోలమ్ములం జపేటమ్ములే యుత్తరమ్ముగ గ్రహించి దిమ్మదిరిగి దొమ్మర గంతులు వైచుచు గమ్మనివాసనల ఘుమ్మని చిమ్ముచున్న వనమ్ముల నగ్రిమ్మరుచుం గమ్మ విలుకాడు కొమ్మల నయనమ్ము లకు నదమ్ములనగు తమ్ములపై కుందమ్ముల నూరి చెఱకుదం డమ్మున మధుకరమ్ముల నల్లె త్రాడు బిగించి దుమ్ములు కన న్బడ జిమ్మి కామమ్మను వృక్షమ్మునకు నగ్గొమ్మలు ఫలమ్ములు పుట్టింప దేహమ్ములు తెలియక దాహమ్ములు దీఱక హృదయము లదరి పదములు చెదరి కదలి బెదరి పదరుచు, మిన్నేరు దరి నున్న యున్నత భూజంబులపై సన్నని యురుల న్బన్ని బ్రదుకు ప్రొద్దులు సన్నగిల్లుట న్బన్నిన యురుల నన్ని తన్నుకొనుచున్న ఖగముల మన్ను పాల్జేయుచు కఱకు టెఱుకులకు నన్నలుగ నెన్నం బడి పోతరించి, క్రిందుమీఁదు లెఱుంగక దందడించిన డెందమ్ముల సందడి నందమ్ముల గను విందు సేయు తెఱగంటిలోకపు టిక్క

లెల్ల నరసి తెఱువాట్లు గొట్టి యుక్కెక్కిన మక్కువల నొ
క్కరు పెక్కురై దక్కిన చక్కని రొక్కమ్ము లెల్ల వసము
గొని కసిదీఱ రుసరుసలు వోవుచున్న మానిసి దిండి తండంబు
నదల్చి పడవాల్గు చండ కోదండ కళా ప్రావీణ్య ప్రదర్శన కౌ
తూహలాధీన మానసులై దైవత వీరుల సమరరంగమున కవతెం
డని హెచ్చరించు తెఱంగున రణభేరి వ్రేయించిన

మ. రణభేరీ నినదంబు పర్వెను దిశాభ్ర క్ష్మా సముద్రాంతర
ప్రణతాశేష పురాణ పూరుష పద ద్వంద్వార్చనా లగ్న స
త్పృణి వానంద మయ స్వరూప మునిహృ త్పంకేరు డంతర్జ్వల
ద్ఘన బోధామృత చిత్స్వరూప విమనస్క ప్రజ్ఞ భగ్నంబుగా

మ. జనితం బైన నినాద మంతట సరోజాతాండ భాండంబు నా
శనమౌ కాలము దాపురించి నపు డుచ్చై ర్నాదముల్ బొందు
రి నిఘుల్ చందముగన్ బిడౌజు మదిఁ గాఱింపంగ హో దైవ
యనుచుల్ దేశికుఁ జేరి పల్కె నతఁ డత్యంతోగ్ర భీతాత్ముఁడై

మ. అకటా! దేవగురూత్తమా! దనుజు లత్యంతోగ్ర రౌద్రాకృతిఁ
గకుబంతమ్ములు బీటువాఱు నటు ఢంకా నాదముల్ బుట్టఁ
సి కలంపన్ హృదయాంబురాశిని దయాసింధూ! భవిష్యత్తుఁ
ల్పి కటాక్షింపఁగదయ్య శిష్యుని పయిన్ ప్రేమామృతం బొల్క

వ. తత్సమాధానంబుగ

శా. శక్రా యేమని తెల్పువాఁడ శని సంచారంబుఁ దర్కింపఁగా
వక్రత్వంబును జెంది యష్టమములో వాసంబుఁ గావించె నా
శుక్రాచార్యుఁడు జన్మరాశిఁ గనె నీ క్షోభంబుఁ దప్పింప ని
ర్వక్రాఖండ భుజప్రతాపుఁ డగు నా ఫాలాక్షుఁడున్ వ్యర్థుఁడే

గీ. అకట తప్పదు మీకు రాజ్యాపహరణ
మును వనంబుల వాసంబు ముందు ముందె
దాచ నగు వస్తు జాలంబు దాచి వైచి
కదలుటయ మేలు ఘోరసంగ్రామమునకు

వ. అని యాదేశించిన గురువర్యుని పాదముల కెఱఁగి 113

శా. స్వామీ యోటమి గుర్తెఱింగియును బీభత్సంబుగా యుద్ధ మే
లా మా కింక స్వరాజ్య సంపద లవేలా సర్వముఁ బీడి యెం
దో మాఱ్మ్రాలల జీవయాత్రఁ బొడుగింతుఁ బంధువర్గంబుతోఁ
గామాసక్తిఁ దగు ల్వడంగ నవునా కారాని కాలంబునన్ 114

మ. అనుచున్ జింతిలు వాసవుం గని తదీయాస్యంబుఁ బైకెత్తి నం
దన! చింతించిన సుంతయైన ఫలమే దర్పంబు తో వైరులన్
దునుమంగా వలె లేకయున్న మరణంబున్ గాంచు సేయఁ వలెన్
వినరానట్టి యమంగళంపుఁ బలుకుల్ వేమాఱు వాకుప్వ దే 115

ఉ. నీవును నేను లోకము జనింపఁగ వృద్ధినిఁ గాంచ నాశమై
పోవఁగ నే మహామహుని మోహన లీలలు కారణంబులో
యా విమలాత్ముఁడైన హరి యాపదఁ బాపి త్వదీయ రాజ్యమున్
బ్రోవును గాత శిష్యవర పొమ్మిక నీకశుభంబ చేకుఱున్ 116

వ. అని యాశీర్వదించి నిర్జరలోక శాసనుం డగు పాకశాసను ననిపిన
గురుదేవుని పదాంబుజంబుల వ్రాలి సెల వడిగి సకలసైన్య సమే
తంబుగ శత్రుసంతతి నెదుర్కొనుటయు జీవేచ్ఛ మాని యిరు
కక్షులు పోరాడు నప్పుడు తుండంబులు దెగిన వేదండంబులును
తేజంబులు దప్పిన యాజానేయంబులును యథాయథలైన రథంబు
లును దుత్తునియలైన కత్తులును బిగువు తప్పిన నొగళులును నుగ్గు
నూచంబైన పగ్గంబులును బడిపోయిన సిడెంబులును మద ముడిగిన
పదాతివర్గంబును బటువు దప్పిన భటులును దొరఁగెడు రక్తంపు
టేరులును దిరిగెడు భూతజాలంబును గలిగి కదనరంగం బొకవంక
విచలిత మస్తకావర్తంబులతో విఖండిత కేశశైవాలంబులతో
విస్ఫోటిత రక్తాంబువుతో విదళిత మాంసబుద్బుదంబులతో విగళిత
భూషణ రత్న సంతతితో విచ్ఛిన్న పదాతి జలజంతుసమితితో
విదారిత చిత్రవసన సితారుణ నీలోత్పలంబులతో విభగ్నలాంఛన
ధ్వజదీపికా గృహంబుతో విభిన్న రథ నౌకా చయంబుతోఁ

శారావారంబు పగిది మఱొండెడ నిశితబాణ పరంపరా కంటక
నిఖిల భట గళావిర్భూత క్రూరమృగారావంబై నిరవధి
శోణిత పూరితారుణజల వేళంతంబై నిస్తంద్రసైన్య స
తరుషండంబై మహాగహనం బనఁగఁ బొడకట్టె నట్టియెడ

ఉ. ఒండొరుఁ బిల్చికొంచును మహోగ్రత రూపము లంది నట్లు
దండ తురంగ సైనికవితానముఁ ద్రుంచుచుఁ బోరు ఘోరసై
పండు వొనర్పఁ గన్నులకుఁ బ్రాణములందలి తీపి వీడుచు
భండన మాచరించి రిరువాగుల వారు జయాభిలాషులై

గీ. అంత బలిచక్రవర్తి జయంబు తనకుఁ
దక్క దని యెంచి గురుని పాదములఁ జేరి
కదన పరిణామ మెల్లఁ బల్కంగ నప్పు
డీ మహామంత్ర మిచ్చె జయింపు మనుచు

క. ఏతన్మంత్ర బలంబున
భూతల పతితులను జేసి పోరున సురలన్
ఖ్యాతి యెసంగఁగ నాకము
నాతారార్కముగ నేలె నని చెప్పుటయున్

వ. దాని నాచరించు విధానం బెట్లని యుత్తరాకాంక్ష నిరీక్షించు
తిలకునకు ధాత్రీ నందనుం డిట్లనియె నెద్ది యేని వర్ణాశ్రమ ధ
బుల నిర్వర్తింపవలయు దేశ కాల పాత్రంబు లెఱుంగవ
నవసరానవసరంబుల గుఱుతింప వలయు నాతఁ డెటు లాచ
నను నీవు మాత్ర మీ మహామంత్ర మతినిష్ఠమై యొక్క
ప్రదేశంబున నిల్చి నిశ్చితాత్ముండవై యింద్రియనిగ్రహం
రించి యాచరించి కామ్యసిద్ధిం బడయు మని వీడ్కొని చనియె

అశ్వపతి మాళవిం జేరి నారదోపదేశము దెల్పుట

ఉ. అంతట రాజ చంద్రుఁడు హృదంతర మందున మోదమంది
యంతిపురంబుఁ జేరి సతి నాదరణంబున బిల్చి పల్కె నో

యింతులమేలు బంతి విను మెంతయుఁ గర్ణరసాయనంబుగా
వంత యడంగు కాల మది వచ్చెను యోగి కృపాంబువృష్టిచే 122

సీ. చిగురుటాకుల లోని జిలుగును విలిచెడు
బుడుతని చెక్కుముద్దిడఁగ వలదొ
యవ్యక్త మధురంబులై యలరించెడు
ప్రియసుతు పల్కు లాలింప వలదొ
యుంగుంగ యని యేడ్వ నో తండ్రి యూరుకొ
మ్మంచుఁ గొమరుని నోదార్పవలదొ
వెలలేని కోర్కెల వేమారు బిడ్డకో
రఁగ వాని నెల్లఁ దీర్పంగ వలదొ

తే. యనుచు దినములఁ బుచ్చెడి మనకు దైవ
మొక్క మార్గంబుఁ జూపెను నిక్కవముగఁ
జింతిలఁగఁ నేల మన మింక శీఘ్రముగను
ఋషివరుని వాక్యమట్ల చరింత మనిన 123

వ. హృదయేశ్వర! యట్టి భాగ్య మీ యభాగ్యుల కెట్టు లొదవు నే పూర్వదత్తంబు లిప్పట్టున సంసారార్ణవోత్తారకం బగు సంతానోత్పత్తికిఁ గారణభూతంబు లగు నీ జన్మలో మాత్ర మింకఁ గని విని చేయని సత్కథాశ్రవణ తీర్థాటన వ్రత సముదయంబు లేమేని మిగిలియున్నవే యనుడు 124

తే. ధాత వ్రాతయు విష్ణు సుదర్శనంబుఁ
గాలుదండము ముక్కంటి కంటి మంట
పండితుని వాక్కు మౌని శాపంబు ధర్మ
రాజు కోపము వజ్రి వజ్రంబు రామ
విభుని కరమున వెలిగెడు వింటితూపు
మసకవు భుజంగి కాటు కుమారుశక్తి
ప్రేయసీ విన్నవారమె రిత్త యనుచు 125

వ. ఇంకఁ జింత దక్కి యుంకు మెల్లి దేవతారాధనంబున ఫలంబులు
వచ్చెద నని యా రాత్రి గడపి వేకువఁ బయనంబై కఠిన పా
వృతంబై కాక ఘూక సృగాలాది భయంకరారావసమ్మిశ్రిత
పాంథజన హృదయకవాటవిపాటన ప్రభాపరిపూర్ణ ఘు
సంకలితంబైన మహా గహనంబు గడచి నిజశృంగాగ్ర ప
విచ్ఛిన్న నభస్స్థల లుఠ దాకాశగంగా ఝరీ సమూహంబును
ప్రాణి సంరక్షణ క్షమ దివ్యమూలికాలంకృతంబును నగు న
ధరణీధరంబుఁ జేరి యందుఁ బర్ణకుటీరంబు నిర్మించి శుభదిన
నుపవసించి యోగదీక్షఁ గైకొని యీషణత్రయంబు శో
జేసి కామాద్యరిషడ్వర్గంబు ఖండించి బద్ధాత్ముండై య
రాత్రంబు లా పరమేశ్వరీ పాదపద్మంబుల హృత్పుటంబున
లంబుచేసి నూరు దివ్యవర్షములు సమాధి నుండిన మృడాని
సించి నిజస్వరూపంబున సాక్షాత్కరించిన క్షత్రియ కులా
రుండు కరములం జోడించి

దేవి సాక్షాత్కరించి వరంబు లొసంగుట

శా. శ్రీరామామణి వాణి యెల్లపుడు తేఁ సేవింపబ్రహ్మాదులో
గౌరీ! రక్షణ సేయుమా యనఁగ దుష్కర్మాటవిం గాల్చి స
సారంబుఁ దరియింపఁ జేయు మని నిచ్చల్ మౌను లర్థింప
నే రాజీవదళాక్షి కొల్వగునో యా యింతిఁ స్తుతింతుఁ మదిఁ

శా. బాలా! సంస్తవనీయ శీల! విమలా! భక్త ప్రపంచావనా
లోలా! రామకథాసుధామర నదీలోల త్తరంగావగా
హాలంకార శరీర సత్కిరణ జాలా! సర్వ సౌఖ్యాలవా
లా! లావణ్య గుణప్రపూరిత విశాలా! పాహి మాం పాహి మా

సీ. నీ పాదరాజీవ నిర్మల మకరంద
రసవార్థి నెపుడు తేలంగఁ గలనో
నీ నామ భజనంబు నే నెల్ల వేళల
సలిపి మోక్షంబుఁ గాంచంగఁ గలనో

నీ దర్శనానంద నిరుపమసౌఖ్యంబుఁ
దమిఁ దీర నెపుడు పొందఁగఁ గలనో
నీ ప్రసన్నపుఁ జూడ్కు లే ప్రొద్దు నా పైనిఁ
బ్రసరించు భాగ్యంబుఁ బడయఁగలనో
తే. యనుచుఁ దపియించు చున్న నా యాత్మ నేఁడు
తావకకృపారసంబును ద్రావుకతనఁ
బావనం బయ్యె జన్మంబు భద్ర మయ్యె
భగ్నదుర్వార పాపాళి భద్రకాళి 129

—• దండకము •—

శ్రీమన్మహాదేవి శ్రీ శాంకరీ కాళి గౌరీ మృడానీ దయా వార్ధి మౌనీంద్ర హృత్పద్మ సంచారిణీ మత్త సింహేంద్రయానా! పరా భక్తరక్షామణీ సర్వ గీర్వాణ లోకార్పితానేక సాహస్ర భాను ప్రభా దూర హేమారవింద ప్రకాశాన్వితాజాండ సమ్మోహ నాంఘ్రి ద్వయా, భంజితాశేష పాపౌఘ పుణ్యప్రదాత్రీ యశశ్చంద్రికాప్లావితాశాతతీ నిశ్చలానంద లీలాలస ద్ధీమతీ బాలచంద్రాంకిత ప్రస్ఫుట జ్ఞాన పూర్ణామలాత్మాబ్జ సంవాసితానంత శృంగార భృంగీశ్వరీ యీశ్వరీ వాసవాద్యష్ట దిక్పాల సంతాప ఘోరాటవీ వీతిహోత్రానువర్తీ సుధామూర్తి నా యార్తి నాలించి నా వార్త మన్నించి సద్వర్తనం బిచ్చి నన్నుఁ గృపం జూడు మమ్మా మదీయాఘ జాలంబు మాయింపుమమ్మా భవాబ్ధిన్ దరింపంగ నీవే కదమ్మా కరన్ బట్టుకొమ్మిట్టి నిన్నెన్న నా కున్నదే శక్తి యో పన్నగానీక సన్మౌట్టులాకోటిభృ ద్గేహినీ లోక సమ్మోహినీ శాశ్వతానంత లక్ష్మీకరీ శాంకరీ పాపనాశంకరీ ముక్త దుర్గా శరత్కాల రాకేందు బింబ ప్రభాభాసమానాసమానాతిశుభ్రోరు కీర్తీ విదూరామ రానీకఘోరార్తి యార్యా శివా నేక శీర్షుండు నైనన్ ద్విశీర్షుండు నైనన్ జతుశ్శీర్షుఁడైనన్ మఱిన్ బంచ శీర్షుండు సాహస్ర శీర్షుండు నైనన్ ద్వదీయామలాకారము న్గాంచగా నేరఁడో తల్లి! నే నెంత నా యందు నీ కున్న ప్రేమ ప్రవాహంబు వర్ణింపఁగా నౌనె దేవీ

పవిత్రంబు చిత్రంబునా నీదు చారిత్ర మెన్నంగ గీర్వాణ
నేరరంచన్న నీ స్వల్ప జీవుల్ స్తుతింపంగ నే మాత్ర మమ్మా కృప
వమ్మా మనోవాంఛితం బీయవమ్మా నమస్తే నమస్తే నమస్తే నమః

చ. అని స్తుతియింప సంతసము నంది భవాని ధరాధిపుం గనుం
గొని వచియించెఁ బ్రేమమునఁ గోరుము కోరిక లెట్టివైన నే
దనక యొసంగు దాన హృదయంబునఁ జింతను వీడి యన్న ని
జనపతి నీ కటాక్షమున సర్వము భద్రము నా పురంబునన్

ఉ. ఐనను బాయ దెప్పుడు హృదంతర మందునఁ బుత్త్రివాంఛ
ద్రానన దానిఁ దీర్చుటకుఁ బ్రార్థన సల్పెదు వాఁడు వీఁడనీ
మానిని నొక్క దాని నసమాన విలాసముఁ గల్గుదాని సు
జ్ఞానముఁ గల్గుదానిని నొసంగితి పొమ్ము యథేచ్ఛ మట్లుగన్

ద్విపద. అని వచియించి యా యబ్జాక్షి మాయ
మును జెంది సంతసే ముదముతో రాజు
కనుల సంతోషాశ్రుకణములు రాల
మనమున దేవిని మఱిమఱి వేడి
తనపురి కరుదెంచి తన రాక దెలుప
వినయ సంభ్రమములు వెన్నంటిరాగ
ఘనవాద్యములతోడఁ గదలి పల్లకిని
జననాథవరు సమక్షంబున మంత్రు
లునిచిన సంతోష ముప్పతిలంగ
జనులను గని రాజచంద్రుఁ డిట్లనియె

క. పురమెల్లఁ జాటఁ బంచుడు
ధరణీ విభవుండు దేవిఁ దపమున గొలువన్
గరుణ నొసంగెను బుత్త్రినిఁ
బరమాహ్లాదంబు నేఁడు పండువు ననుచున్.

వ. అంత మంగళ వాద్యంబులు బోరుకలంగఁ జతురంతయా
నారోహించి నిజమందిర ప్రవేశం బొనర్చి పరివారంబును నీ

లుపు నంతలో మాళవీదేవి సహస్ర భానుబింబ సదృశ మగు కనక కలశంబుఁ గేల నందుకొని దాసీజనంబు పరివేష్టింప నాథు నెదు ర్కొని పాదప్రక్షాళనంబును గర్పూరంపు నివాళియుఁ గావించి లోనికిఁ గొని చనియె ననంతరంబ 135

ఆశ్వాసాంతము

శా. దక్షధ్వంసి పితృప్రసాద విభవా! దాతృత్వ హృద్భాసితా
ధ్యక్షా! యక్షియుగావలోకన నిమిత్తైశ్వర్యవద్యాచకా!
దాక్షిణ్యాకర! నైక వంశ శిశు విద్యా దాన వాః పూరసం
రక్షా! శిక్షిత వైరి పుంజ ధిషణా! ప్రజ్ఞాన పాథోనిధీ 136

క. విద్వన్నుత వరగుణ సం
పద్విభవా! రూప విజిత పంచశరా! రా
జద్వనజ సమ వదన! త్రిజ
గద్వల్లభ చరణ వినుత కరుణా! వార్థీ 137

గద్య

ఇది శ్రీ ప్రసన్నాంజనేయ మహామంత్రోపాసనా జనిత మృదుమధుర మధురపదభరిత చతుర్విధానవద్య కవిత్వధారా సుధాపూరసుహృ జ్జనచరణసేవా నిరంతరాపస్తంబ సూత్ర భారద్వాజసగోత్రపవిత్ర కోటాన్వయ క్షీరపారావార రాకాసుధాకర రామశాస్త్రి దత్తసుత కళాకోవి దాష్టావధాని బాలకవిశేఖర బాల సరస్వతీత్యాది బిరుదాంకిత వీరాంజనేయ శర్మాభిధాన విరచిత చిత్రాశ్వీయం బను మహా ప్రబంధంబు నందుఁ ప్రథమాశ్వాసము సంపూర్ణము

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# చిత్రాశ్వీయము

## ద్వితీయాశ్వాసము

క. సీతా నాయక పదకం
జాత ప్రవిమల మరంద సంగత చేతా!
యాతాయాతాశ్రిత సం
ఘాతామోదవిభవ! భవకల్మషహరణా!

గీ. అవధరింపుము జనమేజయావనీశ
జనకునకుఁ బ్రీతి శుకయోగి చంద్రుఁడు వచి
యించె నద్దాని నీ కెఱింగించువాఁడ
నట్ల యంతిపురంబున కరుగుదెంచి

అశ్వపతి మాళవీదేవికిఁ దపోవనవృత్తాంతము వివరించుట

ఉ. ఆ సురమౌనిచంద్రముని యానతి చొప్పునఁ గాననాద్రులన్
గాసినిఁ జెందుచున్ గడచి కష్టము నెంచక యన్నపానముల్
రోసి ఘనారిషట్కవినిరోధముఁ జేసి యనంగ తాపమున్
బాసి సుపుత్త్ర వాంఛను దపం బొనరింపఁగఁ బోవుచుండఁగ

మ. కననయ్యెన్ గమనీయ హంస బక చక్రాంగాది నానాఖగ
స్వన గంభీరముఁ బుష్పిత ప్రసవ భాస్వత్పత్త్ర మధ్యస్థ పా
వన మాధుర్య మరంద పాన మదరేఫద్వంద్వఝుంకారమున్
ఘన నీలాంబుద వారిపూరము శుభాకారంబుఁ గాసారమున్

వ. ఏతత్కాసార విహరణానేక పతంగ సంఘ చరణ సంచలన
కారణ సిక్ఛన్నుదంచిత కుముదకల్హార పంకజాది సుమ సంతాన
వాసిత పరాగరాగ భాసిత లలిత తరంగపరంపరాప్లుత శీతలవాత
పోత సంస్పర్శ నానంద రసానుభవ పరవశుండనై సన్నిహితమై
యున్న భూధరంబుఁ దరిసి యందు 5

క. ఉరు నిష్ఠతోడ నే వ
త్సర శతము తపము ముదమున సలుపంగా, నీ
శ్వరి దయ దర్శన మిచ్చుచుఁ
గరుణా లోకముల నన్నుఁ గనుఁగొని యనియెన్ 6

క. మెచ్చితి నీ దగు తపమును
వచ్చితి నీ వంత మాన్ప వసుధాధీశా
యిచ్చితిఁ గోరిన యటువలెఁ
జెచ్చెర ననువంటి బిడ్డఁ జేకొని పొమ్మా 7

వ. అని 8

మ. తన భార్యామణితోడఁ బ్రేమ మెయిఁ గాంతారంబునన్ దా నొన
ర్చిన కార్యంబును బడ్డ కష్టములఁ బుత్త్రీదానమున్ జేసి చూ
పిన దేవీ విమలాంతరంగమయ సత్ప్రేమం బెఱుంగంగఁ దె
ల్పిన సంతోషము నంది పుత్త్రి తన కష్టే కల్గినట్లెంచె లోన్ 9

వ. అట్లమ్మహీనాథకుల రత్నాకర గర్భస్థ రత్నంబు లతిశయంబైన
మోదంబునఁ గాలంబు బుచ్చుచుండ 10

సీ. అడుగని వాఁడు పాపాత్ముఁడా రాజేంద్రు
నడిగిన ధనదుని కన్న ఘనుఁడు
యాచింపకుండిన వ్యర్థు డెవ్వం డైన
యాచింపఁ దొలిచెట్టు కన్న మిన్న
ప్రార్థింప కుండినఁ బనికి మాలిన వాఁడె
ప్రార్థింప నింద్రుని కైన గొప్ప
సన్నుతింపనివాడు చవటలలోఁ బెద్ద
సన్నుతించిన హరి కన్నఁ బెద్ద

తే. యనుచు జనులెల్లఁ గొనియాడ నర్థికోటిఁ
దనుపుచుండెను సంతాన వనము నాకుఁ
గలిగె నా జన్మ ధన్యతఁ గాంచె నింక
నారకాగ్నియు నజ్జేరునా యటంచు

చ. అనవరతమ్ము రాజవిభుఁ డర్థులఁ దన్పుటఁ జూచి మేఘముల్
మనమున సిగ్గువొంది యవమానముఁ జేసెను మమ్మటంచు
చిన వయి మూడువర్షములచే నెల నింపుద మెంత తామ పై
నను సరె యంచుఁ గట్టడి నొనర్చియు నోడెను రెండు మాసముల్

తే. ఈ విధంబున భూమీశుఁ డెలమి దాన
ధర్మముల్ మున్నుగాఁ గల ధర్మ కార్య
ముల నొనర్చిన పుణ్యము ఫలితమునకు
వచ్చెనో యన దేవి గర్భంబుఁ దాల్చె

సీ. కలదొ లేదో యని కలతఁ గూర్చెడి కౌను
విరివిగా నేఁడు కన్పింపఁ జొచ్చె
మదను తూపుల మించి మసలు కుచాగ్రంబు
లింతంతగా నలుపెక్కుచుండె
వరమరాళంబుతో వాదులాడెడు యాన
మిభరాజు తోడ స్నేహింప నెంచె
షడ్రసోపేత భోజనము మెచ్చని జిహ్వ
మంటి బెడ్డల పైని మనముఁ ద్రిప్పె

తే. మెఱుపు నైనను మెచ్చని మేనికాంతి
తగు నిది యటంచును దెలుపుఁ దనము దాల్చె
ననవరతమును సుఖముల నందు దేహ
మాస వహియించె నార యాయాసమునకు

వ. ఇట్లు దిన దిన ప్రవర్థ మానంబై మాళవీ దేవి గర్భం బలరారు చుండ

తే. మురిసి సీమంత మాదిగా ముఖ్య కార్య
ములను నెఱ వేర్చి జననాథ ముఖ్యుఁ డంతఁ
గుముద బాంధవు రాకఁ జకోర మట్లు
పుత్త్రికోదయ వాంఛతోఁ బొలుపు మీఱె 16

వ. తదనంతరంబ గర్భస్థపిండంబు వోలె గ్రహతారకాసముదాయం
బనుకూలంబై యొప్పు నొక్క శుభముహూర్తంబున 17

సావిత్రీదేవి జననము

తే. దేవ దానవు లబ్ధి మథించు వేళ
నిండి తనురుచి జగతి సిరెండ గాయ
జననమొందిన కలుముల సకియ మించఁ
గనియె మాళవి యొక బాలికను ముదమున 18

క. మొరసెను దుందుభు లొక్కట
విరిసెను నక్షత్ర సమితి వినువీధి పయిన్
మెఱసెను దిక్కులు తెలివినిఁ
గురిసెను సుమవృష్టి తావి ఘుమ్మని యొలయన్ 19

సీ. జలరాసు లేడును జదలంట నుప్పొంగి
తరగల విలువ రత్నాలఁ జిమ్మెఁ
పాదపంబులు ఘనామోద పాత్రంబులై
కొమ్మల సుమరాజిఁ గ్రుమ్మరించె
వీతిహోత్రుఁడు కాంతి విభవాభిరాముఁడై
ప్రవిమల జ్వాలలఁ బ్రజ్వలించె
ధేనువుల్ తృణఖాద నానందమున నొప్పి
పొదుగుల సద్దుగ్ధములను బిదికె

తే. గంధవాహుఁడు కస్తూరికా సుగంధ
గంధసంయుక్త నవ మల్లికా మతల్లి
కా కమలినీ పరాగ వికాసియగుచు
జగములందున నొక్క మారుగను బ్రబలె 20

సీ. జననీజనకులకు నెనలేని ముదమబ్బె
నాప్తజనుల హృదయంబు లుబ్బె
నత్తమామల నయనాబ్జముల్ వికసించెఁ
మగని కాయుష్యంపు బిగువు మించె
మర్త్యలోకము గొప్ప మహిమచేఁ బెంపొందె
దేవలోకంబులు తెలివి నొందె
నర్థిసంతానంపు టాక్రందనము తగ్గె
ధర్మంబె మెట్టి వాదనల నెగ్గె

తే. జలజ గర్భాత్మజుని సంతసంబు పెరిగెఁ
బాశపాణి పాశ ప్రభావమ్ము తఱిగె
సుజన గణము లలరిరి దుష్టులు కలఁగిరి
పున్నెముల బాల సావిత్రిఁ గన్న వేళ

వ. అట్టి సకలజనశ్రవణా నంద కరంబైన సావిత్రీ జనన శుభ
మానంబుఁ గొని

సీ. ఇంద్రనీలంబుల నెక సక్కెమాడెడు
ముంగురుల్ మోముపై మూగుచుండఁ
బద్మసంతతి నైనఁ బరిహసింపఁగఁజాలు
కనుల సంతోషంబు గంతు లిడగ
నెలమావి చిగురుల జిలుగును విలిచెడు
కరముల రత్నకంకణము లొరయఁ
గాంచనలతికా వికాసంబు నిరసించు
తనువుపై హారముల్ తళుకు లీన

తే. నధరమున మందహాసంపు సుధ చెలంగ
గొనబుగుబ్బలు కంచుకమునను గునియఁ
గాలియందెలు ఘలు ఘల్లు ఘల్లుమనఁగ
సరభసంబునఁ జనుదెంచి చాన యొకతె

తే. రాజవంశాబ్ధిచంద్ర! స్వరాజ్యకంధి
నిరత సంచార వాంఛా ప్రణీతభావ
సాంద్ర! జోహారు మారాణి చందమామ
నెన్నికలు వెట్టు బిడ్డను గన్నదనిన 24

మ. లలితా! నీయుపకార మే విధినిఁ దీర్పంజాలు దే యంచు సొ
మ్ములు వస్త్రంబులు హేమనిష్కములు సమ్మోదంబుతో నిచ్చి లో
పల నింతంతన రాని సంతసము పైఁ బైఁ బాఱుచుండంగ గో
వుల రత్నంబుల నగ్రహారములచే బూజించి భూదేవులన్ 25

సీ. వందిమాగధులు కైవారంబులన్ జేయఁ
బ్రమదాజనంబు హారతుల నీయ
విప్రు లుచ్చైర్ధ్వని వేదముల్ పఠియింప
స్వస్తివాచకతతి స్వస్తి ముంప
రమణీయగాత్రలు లాజాక్షతలు గూర్ప
భటు లిరుగడ బరాబరు లొనర్ప
వెలయాండ్రు నాట్యంబు వింత వింతగ నాడ
నానందముగను గాయకులు వాడ

తే. జనులు జేజే యనంగ యాచకులు పొంగఁ
గాల్బలము వెంట రాగ ఢంకాలు మ్రోగ
వివిధ వాద్య ధ్వనుల్ నభోవీధి రేగఁ
గదలి వచ్చెను బుత్త్రిని గాంచు వేడ్క 26

వ. వచ్చి మందిరంబు సొచ్చి యనర్ఘరత్న ప్రభాదీప్తులఁ దిరస్కరించి
వెలుంగు నిజపుత్రిని 27

క. కనుఁగొని మనమున భూపతి
మొనలేని ముదంబు నంది మెంతయు వేడ్కన్
దన జన్మతోడఁ దరములఁ
దనిపెను బదునాల్గటంచుఁ దలఁచుచు, సఖితో 28

క. ఈ వనిత దేవి కృపచే
నీ విప్పుడు వడసినావు నెలతా మదిలో
నావంత సంశయింపక
సావిత్రీ నామ మిపుడు సరగునఁ జేర్తుఁ

మ. అని సంతోషము తోడఁ జేరిడిన నా యజ్ఞాక్షి ప్రాణేశ
తనుమానింతునె యింతకన్న కలదే యా దేవి పేర్వెట్టి పి
ల్చిన దోసంబులు పీసముఁ దనువు నాశింపంగ నూహించు
మన జన్మంబులు ధాత్రిపై జనులు సంభావింపరే నిత్యముఁ

వ. అనిన జాయావాక్యంబు లాలకించి యమందానంద కందలిత
యారవిందుఁడై యశ్వపతి జాతకర్మ నామకరణాన్నప్రా
తత్తత్కాలోచితకృత్యంబుల నిర్వర్తించి కానక కానక
ముల కోర్చి కన్న సంతానంబైన కతమ్మున గారాబు
బెంచుచుండ

సావిత్రీ శైశవ క్రీడావర్ణనము

సీ. పెద్దయింటను బుట్టి పెరుగుట జేసిన
గర్వంబు వెదకినఁ గానరాదు
బధిర పంగ్వాదుల భైక్షుకజనముల
వెక్కిరింపఁగఁ జూచు విధము లేదు
హస్తంబు నందున్న యల్పాధికంబులఁ
దిరిపెంబు వెట్టకఁ దినఁగబోదు
తనవారి పెఱవారి ననుహూపముగఁ జూచు
టే గాని హెచ్చుతగ్గనయఁగాదు

తే. బ్రహ్మకేని లోపలిమాటఁ బట్టి యీాదు
పాశపాణికేనియు భయపడఁగ బోదు
తద్జ్ఞులను మీాఱి పలుకుట తలఁపరాదు
వినిన వినక యున్న నని కాదనుట లేదు

శా. ఆనందాతిశయంబునన్ మనమునం దర్థంబు లేకుండ సుం
తేనిన్ పల్కు తలంపుఁ జేర్పదు సదా హీనాతిహీన ప్రసం
గానీకాత్ములు పెద్దలైన విహితం భాసింపగాఁ గూర్ప ద
జ్ఞానంపుం బని నేర్ప దల్పతర కాంతుల్ దీర్ప దెప్పట్టునన్ 33

క. పిలిచినఁ బలుకుట కష్టము
పిలువక పలుకంగఁ బోని విషయం బేలా
కలిగియు గర్వము లేదనఁ
గలుగక గర్వంబు లేదుగా యనవలెనా? 34

వ. ఈ విధంబున సుగుణంబులకు నెలవై చక్కఁదనంబున కిక్కయై సరసత్వంబున కిరవై నీతికి నిలయమై పట్టుదలకు జీవగఱ్ఱయై యౌచిత్యంబున కాలవాలంబై తోడి బాలికలలోఁ దలమానికంబై వెలయుచున్న నిజ సుత నాలోకించి సంతసించి యశ్వపతి కూతును గురుకులవాసంబుఁ జేయించినన్ గాని జ్ఞానోదయంబు గాదని తలంచి యొజ్జను రావించి కస్తూరికా చందనాది పరిమళద్రవ్యంబులఁ బూజించి వెలలేని తెలనాకు మడుపుల విలువకు మించిన రతనాల నుంచి పట్టు దుకూలంబులఁ గట్టఁ బెట్టి యాత్మీయ తనూజావిలసిత నిజాంక ప్రదేశుండై యక్షరాభ్యాసంబుఁ గావించి నాఁడాదిగాఁ బాఠశాల కంపుచున్న యవసరంబున 35

సీ. తోడి బాలికలతో నాడుకోవఁగ రాక
జదువుపై నాసక్తి వదలఁ బోక
యొజ్జ చెప్పిన రీతి నుక్తులు పఠియించి
తల్లిదండ్రుల మాటఁ దల ధరించి
షట్శాస్త్రములలోని సార మెల్లను గ్రోలి
ప్రజ్ఞాన జలధి లోపలను దేలి
సంగీతసాహిత్యసామరస్యము నేర్చి
జనుల దృక్కులఁ జల్లదనముఁ గూర్చి

తే. శుక్లపక్షక్షపాకరు శోభ మించి
వనితలను మేటి యన్న పేరును గడించి

యనుదినంబును విద్దెల నభ్యసించి
మించె సావిత్రి తొలకరి మించు మించి

తే. సెలవు దినముల నాటల మెలఁగ కుండ
నుదయ మారంభముగను బరుండు వఱకు
వెనుక నేర్చిన విద్దెను విసువు లేక
వ్రాయుచుండును మఱి మఱి వల్లెవేయు

తే. జిలుఁగు ముత్తెపు సరులొ పూవుల కొటారు
లో పలుకు మొత్తముల కూర్పులో యనంగ
నప్పు డప్పుడు పద్దెము లల్లి యొజ్జ
వద్ద సవరించుకొనును గర్వంబు వడక

తే. కమ్మ పుష్పాళ్ళు గల వసంతమ్ము నందు
వీనులకు విందుగాఁ బాడు పికమువోలె
వ్రేలి కొనగోట నీటుగా వీణ మీటి
లలిత కంఠాన స్వర గేయములను పాడు

తే. సూర్య భగవానుని శపించు సుమతి కతను
అల త్రిమూర్తులఁ బొత్తి బిడ్డలను జేసి
ధ్యేయమై వెలసిన యనసూయ గాథఁ
దళుకు బెళ్కులు గుల్కఁ జిత్రముల వ్రాయు

తే. కవులకును బండితులకును గాయకులకు
నాటవిడు పట్ల నుండిన యతని నెలవు
పుత్త్రి సావిత్రి చదువంగ మొదలుపెట్ట
క్షణము మాటాడఁ దీరిక కలుగదయ్యె

సీ. తను నిట్లు ప్రజలు మన్నన జేతు రతిభక్తి
నని నట్లు దేవిని నర్థిఁగొల్చుఁ
దన కీర్తిలతలు ప్రాకును నిట్లు జగముల
నని నట్లు సుమమాలలను రచించుఁ

దనభ_ర్త జీవంబులను నిట్లు పడయుదు
నవినట్లుగఁ బ్రసాదమును గ్రహించుఁ
దన యత్తమామల కను లిట్లు వెలసెడు
నని నట్లుగా హారతిని నొసంగు
తే. దనకు సంతాన మిటు గల్గు ననిన యట్లు
లలిత ఫలముల ముత్తైదువులకు నిచ్చుఁ
దనకు గష్టాలు విడు నిట్టు లనిన యట్లు
హిమగిరి తనూజ కుద్వాసనమును జెప్పు 42
క. ఈ విధమున నిరతంబును
సేవల మగు భక్తి గురుని కృపచే విద్దల్
సావిత్రి చదువుచుండఁగ
భూవిభుఁ డొక భటునిఁ బంచె పుత్త్రిక కొఱకై 43
ఉ. పంచిన సేవకుండు గురువర్యుని ప్రాంగణ సీమఁ జేరి తా
వంచి శిరంబు భూసురుని పాదయుగంబును దాక మ్రొక్కి యో
యంచిత పుణ్యమూర్తి తనయాసహితంబుగ ఱేడు మిమ్ముల్
గొంచును రమ్మటంచు నవె గొబ్బున రండని విన్నవింపగన్ 44
క. రాజాజ్ఞ మీఱవచ్చునె
యేఁ జనుదెంచెద పొదన్న యిప్పుడె నీతో
వాజులఁ బూన్చిన రథమును
వే జతఁ గూర్పు మని యనిన వెంటనె వాఁడున్ 45
క. హయములఁ గూఱిచి రథమును
రయమున నచ్చటికిఁ దెచ్చి రండని వారిన్
బయనంబుఁ జేసి యాపైఁ
బయనము సాగించెఁ బట్టభద్రుని కడకున్ 46
శా. రా వీక్షించి యరాతిభంజనుఁడు శీర్షం బంటఁగా మ్రొక్కుచున్
మీ విద్యార్థముచే మదీయసుత లేమిం బాపి సుజ్ఞాన పా
రావారంబునఁ దేల్చి రంచుఁ దలఁతున్ బ్రజ్ఞానులన్ దన్పఁగా
నేవీ వస్తువు లైనఁ గొండనుచుఁ దా నిచ్చెన్ మణుల్ కొల్లఁగాన్ 47

తే. అయ్య మా బిడ్డ యిక మీద నయ్యవారి
చరణ సేవను విడనాడి సఖులఁగూడి
యంతిపురమున నుండఁగా నగును గాన
ముదల దయసేయవలయు సమ్మదము మీఱ

మ. అనుచున్ బల్కిన భూసురుండు మన మం దానందమున్ జెంది
జననాథాగ్రణి యిట్టు లొజ్జ కడ నాజ్ఞన్ గైకొనన్ జూచు
మనమున్ వర్ణన సేయ నేరి కగునే మా మీది ప్రేమంబు గ
కను గన్నయ్యవు నీవు మాట యనిన్ గాదందురే పుత్త్రికల్

తే. పోవుచున్నాను సెలవిమ్ము భూప యనఁగ
నా పురంబున మీరెప్డు గాపురంబుఁ
జేయు చుండఁగ మనమునఁ జింతకలదు
దాని నెఱవేర్చుమయ్య సుజ్ఞాన నిలయ

వ. అని యుపాధ్యాయుని జాంబూనదాభరణంబుల ధనధాన్య
వాహన నికరంబుల నొసంగి పుత్తెంచె నిక్కడ సావిత్రి రా
గ్రహవదన గహ్వరంబు వెలువడిన రోహిణీ పతి వెలు
చాడ్పున నజ్ఞానంబు తోడి శైశవంబు నుత్తరించి పు
బొమ్మలో యను నూడిగంపుఁ గత్తెలచేఁ బనిగొనుచు నొక్క
సాయంసమయమున

సావిత్రి సఖులతో నుద్యాన వనముఁ బ్రవేశించుట

సీ. చక్కఁగా విరిసిన జాజిపూఁ బొదరిండు
లనుకూల దాంపత్య మట్లు దోప
మృదుపత్త్ర కలితమై మింటిని జుంబించు
తరులు గృహస్థుల వరుసఁ దోప
హరిణ షట్పద రాజహంస మయూర సం
తతి సుపుత్త్రికుల చందాన దోప
నమల జలంబుచే నలరు నదీ ఝరీ
కులము పాలిచ్చు నావులుగఁ దోప

తే. నొప్పుచున్నట్టి మృదుల పుష్పపవనము
సొచ్చి వివిధ వినోదముల్ జూఱఁ గొనుచుఁ
బ్రియము తోడుతఁ బుష్పాపచయముఁ జేసి
హారములఁ గ్రుచ్చుకొనుచు నబ్జాస్య లనిరి 52

సీ. మగువ! నీ కురుల సోయగమును గనుఁగొని
యళులు సిగ్గున మింట నరుగుచుండె
భామ! నీ శృంగార వదనంబుఁ బొడఁ గని
కమల విరోధి తాఁ గళలు దొఱఁగె
వనిత! నీ యధరోష్ఠమును గని బింబంబు
ఘోర కంటకములఁ జేర నరిగె
చెలి! నీదు లేఁగౌను దిలకించి మృగరాజు
వనసీమ లందున వాసముండె

తే. జలజనేత్ర! నీ కన్నుల చెలువుఁ గాంచి
పద్మసంతతి ముకుళ భావంబు నెందె
ననుచు నొండొరు పరిహాస మాడుకొనుచు
నుండ నొక లేమ యంచల పిండుఁ జూచి 53

ఉ. చూచితి వే లతాంగి నిజసుందరినిన్ బ్రియమార కంఠమున్
జాచి సుమాస్త్రసంగరము సల్పఁగ రమ్మని పిల్చుచుండె నౌ
రా చతురాస్య సృష్టి ప్రణయంబున కెంతయు నాటపట్టుగాఁ
దోచెడి హేమపక్షిపతి తుండుకు కొప్పఁగ సేయు సేతలన్ 54

శా. సాహంకారత మీఱ నీ దెసను శ్రావ్యంబులన్ మనోజ్ఞంబులై
దేహంబుల్ మఱపింపఁ జేయుచును బ్రీతిం గొల్పఁగాఁ గోకిలల్
కూహూకూహని యంచు గానమును నొంకల్ మానిసేయంగ రా
లాహాహా ద్రవ రూపమొందుచుఁ బ్రవాహంబై వడిన్ బాఱెడిన్ 55

చ. సుమముల నున్న పుష్పొడిని శోధనఁ జేసి గ్రహించి దానినిన్
విమల వియన్నదీ హృదయవీథి తరంగ గృహంబులన్ నివా
సము నొనరించు పద్మముల చారు పరాగము నందుఁ గల్పి తీ
వ్రముగ సమాహరించి భువిపై వెదఁ జల్లె సమీరుఁ డా దెసన్ 56

చ. కనుఁగొను మంబుజానన యఖండ తరంగ పరిస్ఫుటారవం
బును గమనీయ పుష్పగణ పూరిత గర్భమునర్ధ స్వవీచిని
స్వనిత సువర్ణపక్ష బక చంద్రకళాశన పక్షిబంధురం
బును నయి గంగ నీళ్ గొలువనోయనఁ బంచెను గంధవాహుని

వ. ఇవ్విధంబున సఖులు చిత్ర విచిత్రంబుగా ముచ్చటించు చు
నందొక్క చక్కరబొమ్మ ప్రక్క నున్న కమలంబుఁగని

చ. దినమణి కాంతి సంపదను దీనతఁ బాసి మనోహరంబుగా
ఘనదళపంక్తి విప్పటయె కాని సరోజము సౌరభంబుచే
తను మకరంద సంపద ముదంబును గూర్చు నె నాథుఁ డన్న యసీ
దినమణికిర్ద ద్విరేఫముగ దే సుఖయించును దాని కూటమిర్

చ. అని విపరీత భావమున కాస్పద మీయఁగ రాకుమారి చా
లును డెలి వెక్క వయ్యె నొకో లోప మెఱుంగక పల్కఁజెల్లి
ధన మొక దాత చేతులను దత్తము గాఁబడు నట్టి వేళ నా
ధనమున కేరు కర్త మది తాల్చవుగా యని మందలింపఁగా

ఆ. అర్థ మయ్యె భావ మని సిగ్గుతోడుత
మోమువంచె రాజపుత్త్రిఁగాంచి
తమపరి మతి యొక్క తరుణి యీ యెడఁ జూచుఁ
డా లతాంబుజాస్య యలరు సరణి

మ. అనురాగంబునఁ బూలచూపుగమితో నాధారమౌ చూలి
ధుని వీక్షింపుచుఁ కేలు రెమ్మ మెడయందుర్ జుట్టి పర్ణచ్ఛటాసీ
నన మందుర్ బ్రణయామృతం బొలుక నానాపట్పదధ్వానసా
హన గీతారస పానమత్తునిగఁ జేయం జొచ్చెఁ దాఁ బల్లియై

వ. అంత నింకొక బింబాధర

సీ. పిక శారికాకీర నికర మంజులనాద
ఘనత రామోద జీవనము వనము
హరిణ కేకీ రాజహంస చాతకమృదు
పాద సంచార పావనము వనము

పాంథ జనాయాస వల్లికా ఖండన
పరిమళ నిశితలావనము వనము
మధుకర ఝుంకార మంత్ర సందోహ సం
భావనా ప్రకృతి సేవనము వనము

తే. కుముదకల్హార పంకజ సుమవితాన
బహుళ వర్ణ ప్రభావ భా భాసమాన
ఘనతర తరంగ యుత మహావనము వనము
ఎంత కనుఁగొన్న మదికి సంతృప్తి యిడునె? 64

సీ. ఇందుముఖి ప్రశాంత మిందుఁ గాలిడఁ బోకు
మెట్టతామర గుంపు పుట్టు నేమొ
కన్నియ నెలరాల తిన్నె కానకు మందు
నల్లకల్వల కాంతి వెల్లి విరియు
చెలియ తుమ్మెద పిండు చేరకు మాకడ
సంపంగి తావుల నింపు నాస
తరుణి మల్లెల బారు కురుల విప్పకు మాడఁ
గటిక చీకటి యందుఁ గ్రమ్ము కొనును

ఆ. పొలతి చక్రవాకములు మొగ మెత్తకా
పొంత చందురుండు పొడువఁ గలఁడు
చామ తృణము జఘనసీమ చేర్పకు మఁదు
బండ కల్లు లగును వన్నె తఱిగి 65

సీ. ఈ జక్కవల గాథ నెపుడైన నెదఁ జేర్చి
యున్నట్టి దానవె కన్నెమిన్న
యీ చంపక సుమంబు నెపుడైన ఘ్రాతంబు
జేసితే వగలాడి నాసఁ జేర్చి
యీ లేడి పొంకంబు నెపుడైన నీక్షించి
నావె కన్నుల జంటఁ బూవుబోడి
యీ బింబఫలమును నెపుడైన నధరంబు
కడ నుంచితివ యేమె కమలనయన

తే. యీ తమాలపల్లవముల నెప్పుడైనఁ
దల ధరించితివా యేమె జలజవదన
యీ జలజముల తూడుల నెప్పుడైన
హస్తముల యందు నుంచితివా లతాంగి ?

సీ. అటు పోకు భయమందు నట చిల్క దానిమ్మ
పండు ముక్కున నొక్కుచుండెఁ గల్కి
యిటు మధ్యగాఁ బోకు మిట చూతమును లత
పెనఁగొనె విడిపోవు వనజగంధి
యటుపోకు రొదసేయు నట చంచరీకంబు
పూదేనెఁ గ్రోలెడి పువ్వుబోణి
యిటురాకు దుఃఖించు నిట నంచ సరసిలో
విహరించు చుండెను బిసరుహాక్షి

ఆ. యటుల చనకు కలఁగు నట జింక మృగి తోడ
సుఖసుషుప్తి నందె సుందరాంగి
యిటులఁ గనకు తొలగు నిట నాడు శారిక
మరల మగనిఁ గూడె మందయాన

మ. అనుచున్ నర్మ సఖీ జనం బిటు విహారాస క్తతన్ దెల్పినన్
వినుచున్ జూచితిఁ జూచి తంచుఁ బలుకున్ వే మాఱు చిత్ర
తి నెఱుంగం దగు వార లెవ్వ గచటన్ దెల్పంగ నప్పట్టునన్
వనమున్ వర్ణన సేయుచుండిరి కదా బాలామణుల్ ప్రీతితో

తే. అట్టి సందేహ వాక్యము లాలకించి
యెంత మోసము సావిత్రి యింతవఱకు
మన విహారంబు నందు బాల్గొనఁగ లేదు
కారణం బేమొ యని యొక్క కలికి పలుక

శా. ఔనౌనే కుసుమాంగి నీ వనిన యట్లా బాల తా గోలకై
శానన్ గానఁగ రాదు కారణము గల్గన్ బోక యట్లుండునే
యైనన్ బోయి విచారమున్ సలుపఁ దప్పా? రండు రండంచు నా
చానల్ గుంపుగ గూడి వచ్చి రటకున్ సావిత్రినిం గాంచగన్

ఉ. అంచున నొక్క-చేడియ రయంబున రాసుత చెంతఁ జేరి యీ
చందము నీకు భావ్య మటె చాలును జాలును లేచి రమ్మి కర్
గందుక కేళి సల్పుదము కాంతరొ యన్నను బల్క-కున్న నా
సుందరి వింత భావమును జూచెను జూపులవింత లేర్పడర్ 71

గీ. చూచి తలయూచి సఖులను జూచి చేయిఁ
జాచి రా రమ్మ సఖులార సరభసముగ
వింతపై వింత పన్నె నీ జంత మనలఁ
జెంతఁ జేర్పంగ మదిలోనఁ బంతమూని 72

వ. అంత భూపాలక పుత్త్రీ హృదయగత భావనా పరంపరా గ్రహణ శూన్య వివేకజనిత డోలాయమాన మానసలై డగ్గఱి చుబుకంబు ముద్దిడి కేలుఁదోయిఁ గేలుఁదోయిఁ జేర్చి గడ్డంబు వట్టి సఖీ యేమిటి కిట్లైతి వేమి ఘటిల్లె మా యందు లోపంబు లున్న మన్నింపు మింపుసొంపులు గులుకఁ బలుకుచు సహచారిణులతో విహరింపక చీటికి మాటికిఁ జేటికలపైఁ గోపించు చేపాటి సూటి మాతోడ నాడక దాచ నగు యోచన గలు తెలుఁగుటకుఁ జిన్న దానవు కదమ్మా 73

క. అనుచుఁ బలుకఁగఁ జొచ్చిన
మనసిజ బాణంబుఁబోని మానిని వారిన్
గనుఁగొని మనమున ఘనముగఁ
గనలిన సావిత్త్రిఁ గాంచి కళవళ పడుచున్ 74

వ. ఎట్టకేలకు ధైర్యంబుఁ దెచ్చుకొని 75

సీ. తెలి ముత్తెముల లోని జిలుగును విలిచెడు
కనుదోయి బాష్పముల్ గ్రమ్మ నేలఁ
దప్తసువర్ణంబు భాగధగ్యము మించు
కాయంబు నేడింత గ్రాగ నేల
నవనవోన్మేషమౌ నాసికా పుటముల
వేడి నిట్టూర్పులు వెడల నేలఁ
బండు పండిన దొండ పండుగా కెమ్మోవి
పగులుచు బీటలు వాఱ నేల

తే. గంధ లిప్తంబు గద చన్నుగవ యయారె
చిత్రగతులను నింతగాఁ జిట్ల నేలఁ
జెప్పఁ గదవమ్మ మా తల్లి సిగ్గు విడిచి
శక్తి గల్గిన లోపంబు సలుప మెపుడు

క. అనుచుఁ బల్కిన విని యా
మనసిజ బాణంబుఁబోని మానిని వారిఁ
గనుఁగొని కనలుచుఁ బల్కెను
వనితామణులార! యింత పగ యెందులకే

శా. చాలుం జాలును నమ్మ గాఁ దగునె మీ సామర్థ్యముల్ గాం
లోలత్వంబున నిట్లు వల్కితిరి నన్నుఁ మిమ్ముగా నెంచి మీ
కేలా? నా చరితంబు సెప్పుటలు పొండీ యన్న నా బాలికల్
బాలా కోపము పూన నేల మము నీ ప్రాణంబుగా నెంచుచుఁ

ఉ. చెప్పగదమ్మ యింతలుకఁ జెంపుట నీకగు నమ్మ తల్లి మా
యప్పవుగా విహార సమయంబున నిన్నిట వీడినందుకే
యిప్పగిదిఁ మముఁ గసరుదే యని చేడెలు చేరి వేడఁగాఁ
జెప్పుట కేమి యున్న దని సిగ్గును బొందెను బాల యాత్మలో

ఉ. మొన్నగదమ్మ యీ తరుణి భూపతి యానతి విద్దె మాని తా
నున్నది యింటిలోన నిపు డూహకు మించిన సిగ్గువొందగా
నెన్నడు నేర్చె నీ వెఱుఁగుదే లలితా యని పల్కినంతలోఁ
గన్నులఁ గెంపు గల్గ గని కాంత హసించుదె నన్ను మాటికిఁ

ఉ. ప్రాణసమాన లంచు మిము భావనఁ జేసినదానఁ గాని నా
ప్రాణలతాలవిత్ర లని భావమునందుఁ దలంప లేదు మీ
జాణ తనంబు మాని యిఁక జాగొనరింపక పోవ కేల ని
ర్మాణము జేతు రూర కవమానము మాటల నేర్చి నా పయిఁ

క. బాలామణి యీ లాగున
మే లెఱుఁగక పలుక సఖులు మృదుమధురోక్తిఁ
జాలఁగఁ దనుపుచు నీ కత
బేలా విశదీకరింపవే యని యనగఁ

శా. అక్కా యేమి వచించు దాన నొకఁ డబ్జాస్యుండు నిద్రించు నా
పక్కన్ జేరి మృదూక్తులన్ బలుకుచున్ బాలా యికన్ దాళ నీ
చెక్కుల్ నా హృదయంపు టద్దములుగా సిగ్గేలనే యంచునన్
నిక్కం బిద్ది రమింపఁ జేసి చనె హృన్నీరేజమున్ భృంగమై 83

ఉ. అప్పటి నుండి నా మనము నందున శాంతి రవంత లేదె యో
యొప్పుల కుప్పలార యని యున్కని సాంతముఁ జేయ నంతలోఁ
జప్పుడు సేయఁ బోక యొక చక్కని కీరము చెంత వ్రాలఁగా
నప్ప యిదేమి హేతు వని యన్న ధరాధిప పుత్త్రి కిట్లనున్ 84

చిలుక సావిత్రికిఁ దన వృత్తాంతము చెప్పుట

శా. ఓ సావిత్రి ననున్ గుఱించి యది యేమో యెంచుచున్నావు న
న్నీ సామాన్య ఖగంబు లట్ల మదిలో నెంచంగఁ బోకమ్మ నీ
కే సందేహము లున్నఁ దీర్చుటకు దేవేంద్రుండు పుత్తెంచె నీ
నా సామర్థ్యముఁ గాంచి డెందమున నానందంబునన్ జెందుమా 85

సీ. కొదమ కోయిల కంచు కుత్తుక వెలువడు
నునుసొంపు నాదంపు టనువు నొరసి
మినువాక తరగల తొణుకులఁ బయనించు
రాయంచ నడకల రమణ మెఱసి
గాడ్పుకూనలు చిన్ని కరముల పైఁ జల్లు
ఘా దుమారపుఁ దావి పొలుపు బెరసి
తలఁపు మొత్తముల కందగరాని జగమును
గీచిన పనివాని గీటు నరసి

తే. యాణి ముత్తియపుఁగోవ లందు నున్న
జిలుగు వెలుఁగులఁ గులుకు కూర్పులకు మురిసి
ప్రతి పదంబును మకరంద రసము విరిసి
పలుకఁ నేర్తును బద్దెముల్ వ్రాయ నేర్తు 86

వ. అని తన శాకచందంబును వీనులకు విందుగాఁ బొందుపఱిచిన
డెందంబున నానందంబు మల్లడిఁగొనఁ గృపాతరంగిత వీక్షణ
పరంపరల ముంచుచు సావిత్రి 87

తే. గంధ లిప్తంబు గద చన్నుగవ యయారె
చిత్రగతులను నింతగాఁ జిట్ల నేలఁ
జెప్పఁ గదవమ్మ మా తల్లి సిగ్గు విడిచి
శక్తి గల్గిన లోపంబు సలుప మెపుడు 76

క. అనుచుఁ బల్కిన విని యా
మనసిజ బాణంబుఁబోని మానిని వారిన్
గనుఁగొని కనలుచుఁ బల్కెను
వనితామణులార! యింత పగ యెందులకే 77

శా. చాలుం జాలును నమ్మగాఁ దగునె మీ సామర్థ్యముల్ గాంచితిన్
లోలత్వంబున నిట్లు వల్కితిరి నన్నున్ మిమ్ముగా నెంచి మీ
కేలా? నా చరితంబు సెప్పుటలు పొండీ యన్న నా బాలికల్
బాలా కోపము పూన నేల మము నీ ప్రాణంబుగా నెంచుచున్ 78

ఉ. చెప్పగదమ్మ యింతలుకఁ జెంపట నీకగు నమ్మ తల్లి మా
యప్పవుగా విహార సమయంబున నిన్నిట వీడినందుకే
యిప్పగిదిన్ మమున్ గసరుదే యని చేడెలు చేరి వేడఁగాఁ
జెప్పుట కేమి యున్న దని సిగ్గును బొందెను బాల యాత్మలో 79

ఉ. మొన్నగదమ్మ యీ తరుణి భూపతి యానతి విద్దె మాని తా
నున్నది యింటిలోన నివు డూహకు మించిన సిగ్గువొందగా
నెన్నడు నేర్చె నీ వెలుఁగుదే లలితా యని పల్కినంతలోఁ
గన్నులఁ గెంపు గల్ల గని కాంత హసించుదె నన్ను మాటికిన్ 80

ఉ. ప్రాణసమాన లంచు మిము భావనఁ జేసినదానఁ గాని నా
ప్రాణలతాలవిత్ర లని భావమునందుఁ దలంప లేదు మీ
జాణ తనంబు మాని యిఁక జా గొనరింపక పోవ కేల ని
ర్మాణము జేతు రూర కవమానము మాటల నేర్చి నా పయిన్ 81

క. బాలామణి యీ లాగున
మే లెఱుఁగక పలుక సఖులు మృదుమధురోక్తిన్
జాలఁగఁ దనుపుచు నీ కత
బేలా విశదీకరింపవే యని యనగన్ 82

శా. అక్కా యేమి వచించు దాన నొకఁ డబ్జాస్యుండు నిద్రించు నా
పక్కన్ జేరి మృదూక్తులన్ బలుకుచున్ బాలా యిఁకన్ దాళ నీ
చెక్కుల్ నా హృదయంపు టద్దములుగా సిగ్గేల నే యంచునన్
నిక్కం బిద్ది రమింపఁ జేసి చనె హృన్నీరేజమున్ భృంగమై 83

ఉ. అప్పటి నుండి నా మనము నందున శాంతి రవంత లేదె యో
యొప్పుల కుప్పలార యని యున్కిని సొంతముఁ జేయ నంతలోఁ
జప్పుడు సేయఁ బోక యొక చక్కని కీరము చెంత వ్రాలఁగా
నప్ప యిదేమి సేతు వని యన్న ధరాధిప పుత్త్రి కిట్లనున్ 84

చిలుక సావిత్రికిఁ దన వృత్తాంతము చెప్పుట

శా. ఓ సావిత్రి ననున్ గుఱించి యది యేమో యెంచుచున్నావు న
న్నీ సామాన్య ఖగంబు లట్ల మదిలో నెంచంగఁ బోకమ్మ నీ
కే సందేహము లున్నఁ దీర్చుటకు దేవేంద్రుండు పుత్తెంచె నీ
నా సామర్థ్యముఁ గాంచి డెందమున నానందంబునున్ జెందుమా 85

సీ. కోదమ కోయిల కంచు కుత్తుక వెలువడు
నునుసొంపు నాదంపు టనువు నొరసి
మినువాక తరగల తొణుకులఁ బయనించు
రాయంచ నడకల రమణ మెఱసి
గాడ్పుకూనలు చిన్ని కరముల పైఁ జల్లు
ఘా దుమారపుఁ దావి పొలుపు బెరసి
తలఁపు మొత్తముల కందగరాని జగమును
గీచిన పనివాని గీటు నరసి

తే. యాణి ముత్తియపుంగోవ లందు నున్న
జిలుగు వెలుఁగులఁ గులుకు కూర్పులకు మురిసి
ప్రతి పదంబును మకరంద రసము విరిసి
పలుకఁ నేర్తును బద్దెముల్ వ్రాయ నేర్తు 86

వ. అని తన రాకచందంబును వీనులకు విందుగాఁ బొందుపఱచిన
డెందంబున నానందంబు మల్లడిఁగొనఁ గృపాతరంగిత వీక్షణ
పరంపరల ముంచుచు సావిత్రి 87

మ. చిలుకా! మంజుల వాగ్విలాసమున మించెన్ నీదు జిహ్వాగ్ర మా
వల శృంగారము రూప మొంది నటు కన్పట్టెన్ శరీరంబు కో
మలమై ప్రేక్షక రంజకంబు నయి సమ్మానార్హమై యొప్పె నీ
జిలుగుం బల్కుల లోని సారము ప్రశంసింపంగ సామాన్యమే 89

శా. అమ్మా! నాదు హృదంతరాళ జనిత వ్యాపారబోధ ప్రభా
వమ్మున్ గల్గిన కీరరాజము మృదుత్వంబైన నీ దేహ మం
దిమ్మా హస్తమిదే యటంచుఁ గర మందీయంగ ప్రాలెన్ వడిన్
గొమ్మా కొమ్మయటంచు మానసము నందున్ ప్రేమ మింపొందగన్

క. ఈ విధమున నా కీరము
సావిత్రి కరంబుఁ జేర సఖు లానందం
బావహిలంగను దమ తమ
భావంబులు వెల్లి విరియఁ బలికిరి వేడ్కన్ 90

మ. నెలతా నీ దగు శక్తి యింత యని వర్ణింపంగ నౌనే నిలిం
పులు మోదంబున నీదు వాంఛితములన్ మోదించి యున్నారు నె
చ్చెలు లెల్లన్ శుభ కార్యములన్ గనుచు సుశ్రీభాగ్యముల్ గాంచ లో
పల నూహింపుచు నున్న వార లిఁక నీ భాగ్యంబు సామాన్యమే 91

శా. కాదేనిన్ మదిలో జనించు శుభసంకల్పంబులన్ దీర్ప నిం
ద్రాదుల్ వే ద్విజరాజు నీ యొడకుఁ దా రంపంగ నూహింతురే
వాదం బేటికి స్వప్న మందు రతిఁ దేల్పన్ వచ్చె నెవ్వాఁడు వాఁ
డీ దేవీకరమున్ గ్రహించి సత మెంతే ప్రేమఁ బాలించెడిన్ 92

క. ఈ లాగున సఖు లాడఁగ
బాలామణి సంతసంబు పైఁబైఁ బాఱన్
గేళీ వని విహరించుచు
లోలోపల మురియు చుండి లోలాక్షులతో 93

తే. వనవిహారంబుఁ జాలించి వారి యందు
స్నాన మాడుదమా యన్నఁ జాన లెల్ల
వల్లె యనుచును జిల్గుపావడలు జుట్టి
జలజ నిలయమ్ముఁ జేరిరి సరభసమున 94

జలక్రీడా వర్ణనము

సీ. చలువరా మెట్లపైఁ జరణముల్ మోపిన
యంతనె కెంజాయ లలము కొనియెఁ
గాలి యందెలు ఘల్లు ఘల్లని నంతనే
యంచ మొత్తంబుల కడలు పుట్టె
నీరంబు చెంగటఁ జేరిన యంతనే
కమలాకరము తరంగముల వడకె
జలకేళిఁ దేలంగ సరసి జొచ్చిన యంతఁ
జక్రవాకంబులు సంచలించె
తే. నుత్పలంబులపై వ్రేళు లుంచినంత
నూతనంబైన కాంతుల చేతఁ దనరె
నోల యోలోల యనుచు నొండొరుల గూర్చి
పలుకు సందడి రాచిల్క కొలము చేరె 95
ఉ. ఒక్కతె దోయిటన్ జలము నుంచి ధరాధిప పుత్రిఁ జూచి యో
చక్కెర బొమ్మ నీ పయినిఁ జల్లెదఁ జూడుము తప్పకుండ నే
ప్రక్కకు నీవు పోయినను వారి మునింగిన నంచుఁ జల్లఁగా
నుక్కిరి బిక్కిరై కరము నూపఁ బకాలున నవ్వి రందఱున్ 96
వ. దానికిఁ బ్రతీకారంబుఁ జింతించి 97
ఉ. తామరపూవు హస్తమునఁ దాలిచి ధారణి నాథ సూతి యో
తామరసాక్షి నిన్నిపుడు దండనఁ జేసెద నంచు వ్రేయఁ బోఁ
గా మకరంద పానమునఁ గన్నులు మూసిన చంచరీక మా
కోమలి మోముఁ దమ్మి కడకున్ జన కెవ్వన నార్చిరన్ సఖుల్ 98
తే. పద్మముఖి పద్మనేత్రవు పద్మహస్త
వౌట మధుకర మింక నీ యండఁ బాసి
యరుగఁ జాలదు ప్రియుని సాహాయ్య మున్నఁ
గాని యని మేల మాడి నగంగఁ గనలి 99
ఉ. అందఱుఁ జేరి నన్నిటుల హాస్యము సేతురె చాలు నీ జలం
బందున నుండి పోయెదను బ్రార్థనఁ జేయఁగఁ జాల మిమ్ము నే

బందుగు లందు ముఖ్యులని భావము నందున నెంచియుండ నీ
చందముగా నొనర్చుట యశంబగునే తగునే పగఱ వడిఁ 100

క. అని జలము నుండి వెడలినఁ
గని హాస్యోక్తులకు నిట్లు కనలుదె సకియా
యని జలము వెడలి వచ్చి వ
సనముల ధరియించి రంత సంజయు వచ్చెఁ 101

సంధ్యాకాల వర్ణనము

సీ. గగనకాంతా కర్ణయుగళీ ప్రకాశిత
జాంబూనద ప్రవాళంబు లనఁగ
భాస్కర మందేహ ప్రథన సంజనిత మ
హాశోణిత ప్రవాహంబు లనఁగ
సాంధ్య భామా శిరస్సంబంధ సలలిత
మందార పుష్ప దామంబు లనఁగ
నీల పయోద వనీ గర్భ విలసిత
లలిత సౌదామినీ లత లనంగ
తే. సమయ పూరుషు పట్టు వస్త్రంబు లనఁగ
వారుణాస్థాన రత్నకంబళము లనఁగ
త్రిజగ దభిరామ సంపద దిక్కులందు
సంజ కెంజాయ రేఖలు సంక్రమించె 102

పంచపాది

తే. సత్వరము చోపఁ గాలభిమగ్వగుండు
గగన మనునట్టి పెను సన్నెకల్లు మీదఁ
గర సహస్రము నుపయోగ పఱచి మర్ద
నంబుఁ జేసెడి యింగిలీకంబు నాగ
నరుణరోచిః పరంపర లలరె నపుడు 103

తే. ప్రకృతి నామక సౌధాగ్ర భాగములకుఁ
గాల పురుషుని యాజ్ఞ బంగారు నీరుఁ
గర సహస్రముతో దినకరుఁడు పూతఁ
బూయు చుండెనాఁ గెంజాయ పొలుపు మీఱె 104

వ. అంత నబ్బాలామణులు పుష్ప వాటికా విహారం బుజ్జగించి సరస సల్లాపంబుల నాడుచు గృహాభిముఖ లగుడు 105

సీ. తన కోరికల కన్నియును విఘాతంబులే
యనురీతిఁ దిమిరంబు లావరించె
సంకల్ప మెటులేని సమకూరు నని పుట్టు
నాశల వడి జుక్క లందు మొలిచె
భర్తతో సౌఖ్యంబు స్వల్పమే యన్నటుల్
త్రోవను క్షీణచంద్రుండు తోఁచె
నీ కీర్తి దిశలందు నిండు నీ విధియన్న
పగిదిని చంద్రికల్ ప్రాకుచుండె

తే. నట్టివేళను సావిత్రి యంతరంగ
మందు సందేహములు పుట్టి యంతరింప
నన్యథాయత్తచిత్తయై యంతనంత
నడుగు లిడుచును దాఁజేరె నంతిపురికి 106

వ. అంతఁ బరికించిన్న రేరాఁండు సందేహాకులుం డయి 107

ఆ. చిలుక నంపఁ దనకుఁ జేకుఱు భాగ్యంబ
దేమి స్వామి నిర్జరేశ్వరునకుఁ
జిలుక యెట్లు కార్యసిద్ధి యొనర్చెను
దెలుపు మయ్య కర్ణములు సుఖింప 108

వ. దానికిఁ బ్రత్యుత్తరంబుగ శుకయోగి యీ విధంబునఁ జెప్పం దొడంగె 109

మ. తన యాస్థానమునందు మానులు బుధుల్ ధర్మిష్ఠులుం గర్మఠుల్
జననాథుల్ వెలయాంధ్రు నిండి తనకుం సమ్మానముల్ సేయ వా
రినిఁ బ్రశ్నించెను సత్యవంతుఁడు యశశ్శ్రీ యుక్తుఁడైనట్టి వా
నిని భూలోక నివాసు నొక్కనిని మీ నేర్పొప్పఁగాఁ జెల్పుడీ 110

మ. అనుడుం నారదమౌని లేచి సురనాథా! సాళ్వభూపాలనం
దనుఁ డల్పాయువుఁ గల్గువాఁడు నయి చిత్రాశ్వుండు నాధారణిం

దనరుఁ దిగ్గజతుండ బాహుయుగళీ దర్పప్రభావాత్త మో
హానకీర్తి ప్రమదా కుచద్వయ సుగంధానూన వత్సుండునై 111

ఉ. నారదుఁ డాడినట్టి వచనంబుల వాసవుఁ డాలకించి యా
ధారుణి భర్త పుత్త్రకుఁడు ధర్మపరుండుఁ బ్రతాపవంతుఁడై
కారణ మేమిలేక యె యకాలపు మృత్యువు నొందనేల నా
మారక మెట్లు దప్పును గ్రమంబుగ నా కెఱింగింపుమా యనన్ 112

తే. ప్రాక్తన విశేషజన్మ సంప్రాప్తివశత
నాతనికిఁ గల్గె శక్తి సత్యానురక్తి
జనన సంబంధమా గ్రహచారదోష
ముంట దీర్ఘాయు విపుడు లేకుంట జరిగె 113

వ. అన విని సంక్రందనుం డయ్యా! మీ రఘటన ఘటనా సమర్థు లాతని యర్థాంగంబుఁ గైసేయంగల సౌభాగ్యవతి యే పవిత్ర నామంబునఁ బ్రకాశించుచుండె నే రాజన్యతిలకుని గీ మాయె పాద పద్మసంస్పర్శంబునఁ బేరెన్నిక కెక్కె వివరింపవే యని మస్తకన్య స్తహస్తాంజలియై వేడిన క్రతుభోజిం గని సుపర్వనేత్ర పర్వైశ్వర్య ధూర్వహా! నీయడిగిన ప్రశ్నం బుత్తమోత్తమంబు నేను నజస్ర మాతనియాయుష్కాలంబు దీర్ఘంబుగాక సుకుచితంబగుటఁ జింతించి యొక్కనాఁ డస్మత్పితృదేవు దర్శించి హృదయగత సందేహంబు వెల్లడించిన నాతండును గొండొకతడవు విచారించి సత్వరంబ మద్ర దేశాధీశుని పాలికిఁ జని సంతానకాంక్షఁ జేసి విలపించు నాతనికి సావిత్రీ మహామంత్రంబు నుపదేశించి రమ్మా మంత్రప్రభావంబున నుభయకులంబులఁ బవిత్రంబుసేయగల పుత్త్రిక యుదయించుననిపలికి వచ్చె నట్ల సల్పితి ననుడు 114

తే. దానిఁ దప్పింప యుక్తి లేదా మునీంద్ర
దేవి కృప చేత జనన మొందినది కాన
భర్తృజీవిత కాల మీ పగిదినుండె
ననుచుఁ దెల్పిన రక్షింపుకొనగ లేదె 115

వ. అనిన 116

క. సకలము నెఱిఁగిన శుకమును
నొకదానిని సృష్టిఁజేసి యుంచితి మును నా
శుకమును బంచెద సావి
త్రి కడ కని యనిచె వడిని నిది చరిత మనిర్మా 117

వ. తదనంతరం బెఱింగింపవే యనుడు ,సావధానుండవు కమ్మని
శుకమహర్షి పరిక్షిజ్జనపాలున కిట్లనియె 118

మ. ధరణీ నాయక పుత్రి యంతటను నిద్రార్థంబు దాసీజనుల్
పరివేష్టింప గృహంబు సేరి శయనింపర్ స్వప్నమం దొక్క భా
సుర దివ్యాకృతి దేవతా రమణి సుశ్లోక ప్రభావుండు సుం
దర రూపుండు వరుండు నీ కగును చింతంబొంద కంచాడినర్ 119

తే. హస్త యుగ్మంబు మోడ్చి యా యంబుజాక్షి
దేవిగా గుర్తెఱింగి నుతింపసాగె
హృదయ గత వాంఛలను ఫలియింపఁ జేయు
మనుచు సావిత్రి నిశ్చలమైన భక్తి 120

శా. నీ కారుణ్య కటాక్ష లేశములచే నిర్మాణమై వృద్ధియై
లోకంబుల్ తుది నాశమొందు నని సుశ్లోకుల్ మునీంద్రుల్ సురా
నీకంబుల్ వచియింప బాలికను వర్ణింపంగ నే నెంతయో
లోకాలోక పరీత కీర్తి కలితా లోకేశ సంసేవితా 121

చ. కలనగుపింపఁ జేసితి వొకానొక పూరుష సింహుఁ డొల్లి వ్యా
కులమును జెందఁగా మనము కోమల దేహుఁడు వేఱొకండు భూ
తల పతి కేలు వట్టు నని ధర్మమె పల్కుట సాటివారి లో
పలఁ దలవంపు లౌను గద భావమునందు నెఱుంగ కుండు దే 122

ఉ. నమ్మితి నీ పదంబుల మనంబున నిండిన భక్తి యెంతయుర్
గ్రమ్మకొనంగఁ గోర్కి లత ఖండన సేయకు మమ్మ వాని సా
ఖ్యమ్మున నీదు పుత్రికసుఖాఁబుధిఁ దేలఁగఁ జేయు మమ్మ స
ర్వమ్మును నీవె యమ్మ ననుఁ బాలన సేయఁ గదమ్మ యమ్మరో 123

చ. శరణని వేడుకొంటి నను జయ్యన రక్షణ సేయుమంటి నీ
ధరి నను జేర్పుమంటి ఘనదైవము నీవని నమ్మియుంటి నీ

కరుణను జూపుమంటిఁ గృపఁ గామితముల్ సమకూర్చుమంటి నీ
కరమర యేలనంటిని దయాంబుధి వంటిని దానపోషణీ 124

నిరోష్ఠ్యగీతము

తల్లి నీ కన్న నా కన్యథా జగానఁ
గాన రక్షణసేయఁగాఁ గలుగు చాన
దీన జననేత్రి యనుటచే దిక్కులేని
జనుల నేలుటయే యని యనుట కాదె 125

ఉ. దేవియు నీ విధంబుగ నుతించిన మోదము నంది పుత్త్రి నా
భావమునే గ్రహింపకయు వల్కితి వంతియె కాని కోరువాఁ
డే వరుఁ డౌచు నిన్ను సుఖియింపఁగఁ జేయు నటంచుఁబల్కి తీ
బోవుదు నమ్మ యీ చిలుక ముంగల సంగతు లెల్లఁ దీర్చుతన్ 126

ఆ. అని యనుగ్రహించి యా యంబ మాయమై
పోవ నామె నిదురబోవ లేక
తెల్లవారు టెటులు తెల్లంబుగా రాత్రి
చెప్పఁబడినదానిఁ జెప్పు టెటులు 127

వ. అన్న యాలోచనంబున నా నిశాశేషంబు నెట్టులో వేగించి వేఁ
వను మేల్కాంచి కాల్య కరణీయానంతరంబున సఖీ పరివృతయై
యున్న యపుడు 128

అశ్వపతి కూతుఁ జూడ వచ్చుట

తే. అశ్వపతి వచ్చెఁ దనయఁ గృహంబు కడకుఁ
దండ్రిరాక నెఱింగి యా తలిరు బోడి
యెదురు సని కేలు మోడిచి సదన మధ్య
మందు రతనంపు గద్దియ యందు నునిచె 129

వ. అంత 130

మ. కుశల ప్రశ్న మొనర్చి తన్మ విభుఁడు నీకుం గల్గు వాంఛావళిన్
విశదంబుగా బొనరింపు మెట్టి వరునిన్ వేఁదీర్చి తోషంబు నీ
వశముగా జేయుదు నంచుఁ బల్కు విని యా పద్మాక్షి యా వన్యులన్
గుశపత్రేంధన భాగ్య జీవనులన్ బూజింపఁగాఁ గోరినన్ 131

తే. అట్లు కాయని యేతత్ప్రయత్నమునకు
వలయు సంభారముల సిద్ధపఱచి భటులు
చెలులు కంచుకులు పరివేష్టింప నరద
మంపు నాసీన గావించి యంపె పనికి 132

సావిత్రి మున్యాశ్రమముఁ బ్రవేశించుట

వ. ఈ విధంబునఁ గంచుకీ దాసదాసీజన సంసేవితయై మాతా పితల యనుజ్ఞతోడి యాశీర్వాదంబు వడసి వేడివేల్పు ఘోటకంబులకు గమన విద్యం గఱుపఁ గల సైంధవంబుల న్బూన్చిన స్యందనం బారోహించి పురంబులను గ్రామంబులను పల్లెలను గడచి నియమిత ప్రదేశంబుఁ జేరునప్పటికి 133

తే. అల్లనల్లన నెదురేగి హరిణచయము
స్వాగతం బిచ్చెఁ బువ్వులు పరిమళంబు
ననిల బాలకుచే నుపహారమంపెఁ
గ్రమఫలముల కాన్క వృక్షంబులొసఁగె 134

ఉ. అంతరథంబుడిగ్గి నయనాంబుజముల్ వికసింపఁగా వనం
బంతయు వీక్షణప్రకర మాక్రమణం బొనరింపుచుండఁగాఁ
బొంతన వచ్చు చేడెల తపోధను లుండెడి తావుజేర నే
పొంతయటంచుఁ బల్కుచును బోవుచునుండ విలాసవైఖరిన్ 135

తే. అశ్వపద ఘోషములును భయంకరంబు
లైన కరులఘీంకారము లాక్రమించి
వనము నెల్లెడఁ జీకాకు పఱుప వ్యాఘ్ర
మొక్క గహ్వరమందుండి యుక్కుమిగిలి 136

మ. పరివారంబును లెక్కసేయక భయోత్పాతంబు పుట్టన్ దిగం
తరముల్ నిండి ప్రతిధ్వనింపఁగ మహానాదంబు సంధించి రా
నరికట్టన్ దగుశక్తి చాలమికి సైన్యంబెల్లఁ జేష్టోడుచే
భరమైత్రోచఁగ జీవయాత్ర యట నిల్వంజూచి దాసీజనుల్ 137

చ. కరములతోడ వక్షముల గట్టిగ బాదుచు రండు రండు భీ
కరగతి వ్యాఘ్రము మీ దెస కకాలపు మృత్యువురీతి వచ్చెడిన్

దరుణము మించెనేని యిఁక దక్కవు ప్రాణము లయ్యలార యో
పరిజనులార యన్న విని ప్రాణభయంబున రాకయుండినన్ 138

క. ప్రాణాశ లేక యటఁ బా
షాణంబుల రీతినిల్చి సర్వేశ్వరి వా
రాణసి వాసిని యని యా
ద్యేణాక్షులు వేడ సాగిరెంతయు భక్తిన్ 139

వ. అట్టి విపత్సమయంబున 140

శా. చచ్చెన్ వ్యాఘ్రము భీతినొందకుడు తోషంబబ్బగా నింకఁ బో
వచ్చున్ వచ్చిన కార్యసిద్ధికి విపద్ధ్వాంతంబు నాశక్తిచే
విచ్చెన్ భాసుర గాత్రలారయని గంభీరంబుగాఁ బల్కుచున్
వచ్చెన్ సుందరరూపుఁ డొక్కఁడు భయోత్పాతంబు వారింపుచున్

తే. ఉదధి మధ్యంబునందుండి యొడ్డుఁ జేరు
కరణిఁ దమముపీడి వెలుఁగుఁ గనినయట్లు
వ్యాఘ్రబాధాప హరణంబు శీఘ్రగతినిఁ
బొంది లేమలు సంతోష మందిరంత 142

ఉ. ఎక్కడ లేని సిగ్గు తరళేక్షణచూడ్కులయందు నిల్చియా
ప్రక్కనె యున్నపూఁబొదకుఁ బాఱఁగఁ జేయ సఖీసమూహ మ
మ్మక్క యిదేమి హేతువొకొ యాతనిఁ గాంచినయంతలోనె యీ
చక్కెరబొమ్మ పూవుటిలు చాటునకేగెను వింతయయ్యెడిన్ 143

వ. అంత 144

ఉ. ఆపాదమాటునన్ నిలిచి యాసుదతీమణి వానియంగ రే
ఖాపరిపూర్ణ భాసురతఁ గన్గొని మానసమందు నెద్దియో
తోపగఁ జింత సేయునెడఁ దోడివయస్యలు చేరవచ్చి యా
చూపులనున్న భావమును జూచి వచించిరి ప్రేమభాషలన్ 145

తే. స్వప్నగతుఁడైన భూనాధ చంద్రుఁడీతఁ
డౌన యేమేశలోదరి యైననింకఁ
దడయఁగానేల నిపుడె సంధానమునకుఁ
జిలుక నంపుదమా యన్న చెలులతోడ 146

సీ. ఈ నవమదనుఁడే యానాఁడు కలఁ బ్రక్క
యందునఁ జేరిన యట్టిపూజ్యుఁ
డీ మోహనాంగుఁడే నా మోహ మభివృద్ధి
నందంగ సల్పిన యట్టిమహితుఁ
డీ జగన్మోహనుండే నాఁడు నేటికి
నాకేడుగడ యైన నను పుకాడు
నీయబ్జ పత్రాక్షుఁడే ప్రేమరాజ్యంబు
నందుఁబట్టముఁ గట్టి నట్టి జెట్టి
తే. యితఁడెపో నేటిదాఁక నా హృదయసీమ
యందు నర్తించు చుండిన యట్టినర్త
కుండు పలుకులు వేయేల నుండఁజాలఁ
జెఱకు విల్కాని బారికిఁ జిక్కఁజాల 147

క. అని తరళేక్షణ పలుకఁగ
ననితర లభ్యంబు కోర్కి యని తగవానే
మన మును స్వప్నమునందున
మనమును దొంగిలెను గాన మనమును వేగన్ 148

వ. కప్పురపుం బలుకుల యొప్పు గులుకు పలుకులఁ బలుకు చిలుక
సంపుద మని కిసలయ మృదుతరంబు లగు కరంబుల దువ్వుచు
వాంఛాప్రదకల్పభూజం బగు ద్విజరాజంబ యుష్మత్సహోదరీ
మనోగతంబగు వెతంగు ర్తెఱంగి పుష్ప సుకుమారుండగు రాకుమా
రునిఁ జేరి శుభలక్షణంబు లగు సీక్షణంబుల బ్రసరించి మకరంద
బిందు సందోహంబు దెగడు సందేశంబు సందేహంబు వడకుండ
వీనులకు విందొనర్చి రాకుమారి హృదయ భార ధుర్యంబైన
యిక్కార్యంబు సర్వలోక ప్రసిద్ధంబుగా సిద్ధింపఁ జేయు మని
విడిచిపుచ్చుటయు నచ్చటఁ జిత్రాశ్వుండు బొబ్బ మొకంబు ను
బ్బడంచితి నని వచించుచు సన్నిహితుండు కానరు దెంచుచు మార్గ
మధ్యంబునం దాగి లతాసౌధంబునకు వెలుంగుల బ్రసాదింపుచు

దృక్శీలోత్పలంబుల నుపహారంబుగ స్వకీయం బైన కాయంబెల్ల
హారంబులఁ గ్రుచ్చివైచు చున్న సావిత్రి యంగసౌష్ఠవంబుఁ
గని మనంబున నిట్లని ప్రశంసింపం దొడంగె 149

చిత్రాశ్వుండు సావిత్రీ గుణ సౌందర్యాదులకు ముగ్ధుం డగుట

సీ. కలికి నున్నని చన్ను గవతోడ సమ మని
శైలంబులను బోల్పఁ జాలు నెవఁడు
వగలాడిజిల్గు నెమ్మొగముతోఁ దుల యని
జలజారినిం బోల్పఁ జాలు నెవఁడు
తరుణీ నీలంపు ముంగురులతో సరి యని
శైవాలమును బోల్పఁ జాలు నెవఁడు
తొయ్యలి వెలిచూపు దుగముతో నెన యని
జలజంబులను బోల్పఁ జాలు నెవఁడు
తే. చలన మెఱుఁగని యీ నును జఘనములకు
సైకతంబులఁ బోల్పఁగాఁ జాలు నెవ్వఁ
డౌర సౌందర్య మిట్టుల యమరవలదె
దీనిఁ బెండ్లాడఁ గలవాని దే భవంబు 150

ఉ. నూటికి నూరు పంచెమిడి నొక్కి వచించుచు నున్న వాఁడ నీ
పాటల గంధి చన్నుగవ బంగరు గిండియ లన్న మాటలన్
బూటక మంచు వానికి నపూర్వ విలాసమె కాని చేతిచే
ధాటిగ నొక్కినన్ మణుగుఁ దాల్చును బింకము నివ్వి నొక్కినన్

క. ఘనతరదుఃఖాంభోధి మ
థనములు లోకాళి గెల్వఁ దగు దీవ్యత్సా
ధనములు దూరస్థ మగు వ్య
ధనములు కాంతా కటాక్ష ధవళ ధనంబుల్ 152

సీ. సాయంతనంబునఁ జల్లని గాలిచే
వెల్లి విరిసి నట్టి మల్లెపూలు
గని నుండి యప్పుడే కొని వచ్చి నునుపుగ
సాన వెట్టిన యట్టి జాతిరాయి

రాహుగ్రహాగ్రహ గ్రహమున కందకఁ
జరియించు చున్నట్టి చందమామ
మృదుల పరాగ సమ్మిళితంబు గాకుండ
మింటిపైఁ దిరుగు తుమ్మెదల గుంపుఁ
తే. గ్రమముగాఁ బోల్చిచూచినఁ గన్నులకును
దనురుచికిని ముద్దుల మొగమునకుఁ గురుల
కును సమము గా వని వచింపఁ గొదువ కాదు
కనుక వాక్కున కందదం చనెద నీమె 153
ఉ. చందనగంధి మోము జిగి చంద్రునిఁగాంచి హసింపఁ జాలు నిం
పొందు మిటారినాస నిలుపొప్పగ నవ్వను నువ్వ బువ్వ లో
నందము లేక ఘ్రాతరుచిమై తగు నంచును గాలి తాకుచేఁ
జిందఱ వందఱౌ నని హసించు పిఱుందులు సైకతమ్ముల౯ 154
గీ. తరుణి కాదిది రతనాల బరణికాని
భామ కాదిది సౌందర్య సీమకాని
కలికి కాదిది చిల్కల కొలికికాని
బాల కాదిది సొగసు పూమాల కాని 155
సీ. జలదంబు తెరవాసి చనుదెంచి నట్టిశం
పాలతికాంగి యీ భాసురాంగి
పాలయల్కచే భర్త పొందును విడి ధరఁ
జేరిన వాణి యీ కీరవాణి
వక్షస్థ్సలంబున వసియించి ప్రియునితో
మురియు చిన్నమ్మ యీ ముద్దుగుమ్మ
యీశుని సగపాలు నెక్కంగఁ బుట్టు ప
ర్వతు రాకుమారి యీ రాకుమారి
తే. విరహులను బట్టి వేటాడ వెడలుచున్న
కాము చేతి కటారి సు మ్మీ మిటారి
బహుజనన లభ్యమౌ తపః ఫలముగాదె
యీ సుమాంగి కరంబు గ్రహించు నేర్పు 156

క. తమ్ములు నేత్రములకుఁ గెం
దమ్ములు తను రుచులు మంజు తరమైన ప్రభా
తమ్ములు నుడులు పికీ గీ
తమ్ములు చెలి నఖములకు వృథమె కుందమ్ముల్ 157

సీ. చలనంబు లేకున్న శంపాలతను దీని
యంగదీప్తులకు బోల్పంగ వచ్చు
ముకుళించ కున్న సంభోజాతములు దీని
నయనయుగ్మమున కెన యనవచ్చు
క్షీణింప కున్నఁ దారానాయకుని దీని
వదనంబుతోడ గూర్పంగవచ్చు
నిశ్చలత్వం బున్న నీలాంబుదము దీని
వేణితోడను సరి పెట్టవచ్చు

తే. గమన మూనక యున్న జక్కవలు దీని
కుచయుగముతోడఁ గొంతగాఁగూర్పవచ్చు
బండి పడకున్నచో బింబ ఫలము దీని
యధరదీప్తికి సమము సేయంగ వచ్చు 158

తే. రమణి మధురాధరంబు హీరమణి తోడ
వెలఁది యొడలు గంధంబులో వెలఁది లేనె
లంతగి లలాట మొప్ప నెలంతఁ జేసి
వదనములు నాల్గుఁ గల్గిన వాసి నిల్పె 159

ఉ. అంగన నొక్కదాని జగ మంతయు సంభ్రమ మందునట్లుఁ జే
యంగ నజుండు లోఁదలఁచి యంత ననంగుని రూపమందు సా
రంగవిలోచనంబుల విలాసము నందునఁ గొంతఁ గూర్చి సా
రంగవిలాసహస్త ధవళత్వముఁ గూర్చిన దీమె యేమొకో 160

తే. జలజపత్త్రాక్షి దంతపంక్తులను జూచి
లజ్జఁబొంది దానిమ్మ ఫలంబు గుండె
వ్రీల విలపించెఁ గాదేని బీటువాఱ
నేలఁ జక్కఁగాఁ బండిన వేళలందు 161

సీ. పంచాననము లోకభయద రూపంబయ్యు
నునుగానుగాఁ జేరి ఘనతమీఁతెఁ
గాలాహిఁ విషముచేఁ గ్రాలి దుష్టంబయ్యు
జడ రూపమును బొంది సవురు సెందె
గజము మిక్కుటమైన కాయంబు గలదయ్యు
గమనంబు సందొప్పి ఖ్యాతిఁ దనరె
హరిణి పిఱికితనం బలమి యడలుచుండి
నేత్రంబు లయి నుతి పాత్ర మయ్యె
తే. నౌర మృగములె యీ యింతి నాశ్రయించి
చిరతరంబైన కీర్తి నార్జించుచుండ
దీని యంగమ్ము లన్నింటి మానవుండె
యాశ్రయించిన నింకెంత యశము వడయు 162

సీ. నవవాటి సెలయేట మునిఁగి యాటల నాడు
కమ్మ పూదీవెల కన్న మిన్న
మెఱుపుగన్నెల గొప్ప పిఱుఁదుల నడయాడు
కాఱు మొగిలు పిండు కన్న మిన్న
చదలేటి తొలిపూవు జతపడంతికిఁ దోడు
గమియైన రిక్కల కన్నమిన్న
కలుముల జవరాలు కులుకుగుబ్బల పూయు
గందంపుఁ బూతల కన్నమిన్న
తే. గా నొడలు కీలుజడయు నఖములుఁ బరిమ
ళంబు నీమెలోఁ గలవు క్రమంబు గాగ
ఇంతవర్ణన సేయంగ నేల నీమె
మదనకోదండ నిర్గత మార్గణంబు 163

సీ. కంజాక్షి కురు లంధకారంబుఁ గల్పింప
నెలఁతనవ్వులు వెన్నెలలు సృజింప
లలితాంగి వదనంబు కలువరాయనిఁదీర్ప
సకి యొమ్ము జక్కవజంటఁ గూర్ప

చామనేత్రంబులు సారంగముల వంపఁ
జెలి నాస సంపెంగ కులముఁ బెంప
నలివేణి యూరువు లనఁటులై క్రాలంగ
నతివ యానము కరులై చెలంగఁ

తే. ప్రకృతి సహజ మయిన పరస్పర విరోధ
మును వహింపక యద్వైతమున రహించి
యనవరతము వెల్గెడు తపోవనము పోల్కి
కన్నులకుఁ బండు వొనరించెఁ గలికి సొబగు 164

వ. అని బహుప్రకారంబులఁ దలంచి యశ్వపతిపుత్త్రిమనోహరా నన్యదుర్లభ రూపరేఖావిలాసవిభాసురాభంగతరంగ సంకీర్ణ ద్యోధునీప్లావితసర్వాంగుండై కింకర్తవ్యతామూఢుండై గమలగర్భుఁ బునఁ బుమ్మెదవిధంబున రాజసుతయందుఁ జిక్కి దిక్కు తెలియకఁ బరిభ్రమించిన వలపువెక్కసంబయి మిక్కుటంబగు తమకమ్మున నెక్కువతక్కువలు లెక్కగొనక యక్కుమిగిలి కుత్తుక బంటి యి యుక్కిరిబిక్కిరిగ నొనర్పుటయు నగ్గిపై గుగ్గిలంబిడినట్లు తుంటవిలుకాడు పూమొగ్గల నెదఁ గ్రుచ్చి వలపుకాక లగ్గలంబగుటయు నేతత్తాపానలంబున సర్వాంగంబు లుడికి బిగువు తప్పిన కతంబునఁ గలిగిన యవశత్వంబుచే ధరణి నొఱగి సొమ్మసిల్లి యున్నయంత దాసీజన హస్తనిర్గతం బయిన కీరంబొక్క లేమావిగున్నపై వ్రాలి యందలి ఫలంబు నొక దానిఁ జంచూపుటంబున బొడుచుచు మనోహరంబుగ శ్రోత్రపేయంబుగ మృదుమధుర పదభరితంబుగ నిట్లని పల్కంజొచ్చె 165

హంసపంచకము

ఉ. కాంచిన యంతనే వలపుకాకల కగ్గముఁ జెంది యిట్లు గా
టెంచెద వేల దేహము వరించిన నీ ప్రియురాలు నాకమై
పంచశరప్రభా వనధిపై విహరింపఁగ జేయునెంచె నో
కాంచనపక్ష తొందరకుఁ గాలముగా దిది వేచి యుండుమా! 166

ఉ. కొండొక కార్యసిద్ధి కొఱకున్ జనుదెంచిన హంసిఁ గాంచి వీ
లుండును నుండకుండు నని యోచన సేయక యిట్లు పుష్పకో
దండుని బారిఁ జిక్కి పరితాపము నొందెదవేల లోననో
యండజరాజ ముందు సమయంబు లభించును వేచియుండుమా 167

ఉ. పావన జాహ్నవీ వికచ పద్మపరాగ విలాస దేహ మీ
తీవెలయందు వైచితివి దృక్కులు వేయుగఁజూచు హంసి దుః
ఖావృత మూర్తి కాదె యిదియంతయు లోఁదలపోసి యో మరా
ళావనిపాల! బాల యధరామృత మానఁగ వేచియుండుమా 168

ఉ. మంచిదినంబు లబ్బఁ గొఱనూలిన పల్కులు గావు వేగనా
లించుము యాచరించుము బలీయము మీకవ యొక్క ప్రేమ నే
త్రాంచల దృష్టిఁజూచి దరహాసమునన్ గవుఁగింటిలోన ని
న్నుంచి సుఖింపఁజేయు విహగోత్తమ హంసిక వేచి యుండుమా 169

ఉ. చల్లని గాలిచేఁ బ్రసవ సంతతి విచ్చదె విచ్చి వాసనల్
జల్లదె దిక్కులందున గళంబుల మూర్ఛను లందుఁ దాల్చఁగాఁ
జెల్లదె భోగ్య వస్తువయి చేతము సంతస మొందునట్లు సం
ధిల్లఁగఁ జేయదే ఖగపతీ గ్రహియింపుము దీని భావమున్ 170

తే. అనుచు నన్యాపదేశ భాషణము లాడ
నవయు చుండిన తీవెపై నవసుధ యయి
స్మృతి నెఱుంగని చిత్రాశ్వ చేతమున క
పూర్వ చైతన్య మప్పుడప్పుడ లభింప 171

ఉ. మెల్లఁగఁ గన్నువిచ్చుట సమీరుఁడు కమ్మని పూవుఁదావులన్
జల్లుచు దేహతాప ముపసంహరణం బొనరించుటన్ మహీ
వల్లభ నందనుండు శుకవాక్యములన్ మననం బొనర్చు కొం
చుల్లము పల్లవింప నట నుండి చివాలున లేచి ప్రేమతో 172

గీ. అన్న రావన్న నాయందు నున్న ప్రేమ
నెన్న నా కున్నదే శక్తి నిన్నుఁగన్నఁ
బున్నెములు గన్న మునుల చేసన్న పగిది
నెన్నగా రాని సౌఖ్యంబు లెన్నొ యబ్బె 173

వ. అని యనుటయుఁ జిరకాల పరిచయం బున్న హితచరునివలెఁ జిత్రా
శ్వుని హస్తంబున వ్రాలి హృదయానందంబుఁ గల్పించుటయు నా
తండును జిలుకా యింత చక్కనిపలుకులు వలుకుట యెక్కడ
నేర్చుకొంటి వెవ్వరు నిన్నంపి రే కతంబున నిందరు చెంచితి విట్లు
నిష్కారణంబుగ నా మేలుఁ జింతించుటకీ యల్పుని సహాయమేమి
యర్థించితి వింత నింత గల పులుగును గలలోఁ గనియుండ లేదని
సముచిత రీతినిఁ బ్రశ్నించినఁ గీరం బపారంబైన మేధావిభ
వంబుతో 174

క. బెబ్బులి నణఁచంగల మీ
యబ్బురమా దోర్బలంబు నర్చింపంగా
గొబ్బునఁ బనిచెను మా రా
గుబ్బెత దయ సేయువలయు గుణ గణసీయా 175

వ. అనుటయు 176

క. తులలేని సంతసమునన్
బలుమాఱులు ముద్దుఁగొనుచుఁ బక్షిం గీరం
తలు కొండంతలు సేయం
గల మీ నెచ్చెలినిఁ బొగడఁ గలమే యైనన్ 177

చ. పిలిచినఁ బోవు టొప్పనుచుఁ బెద్దలు వల్కుదు రట్లె వత్తు ముం
గలఁ జని నన్నెఱుంగు షటు కార్యగతిన్ వచియించి యాపయిన్
గల పను లెల్ల నొక్కొకటిగా సఫలం బొనరించి ప్రేమ సం
ధిలఁగ ఘటింపునా ఖగపతీ కవఁగూర్చెడి జాతియాటచే 178

వ. ఇది యిటులుండ నచ్చట 179

గీ. ఇంత తడవయ్యుఁ జిలుక యిందేల రాదు
కారణం బేమి యని మదిఁ గలత నొందు
రాజపుత్రి చిన్నారి కరంబు మీద
వ్రాలెఁ ద్వరిత గతి ద్విజరాజు వచ్చి 180

మ. శుకరాజం బిటు హస్త పల్లవము పై శోభింపఁగాఁ జూచి మా
మక వాంఛాళి ఫలించెనా సమత సమ్మానించెనా నిన్ను స్వ

చ్ఛ కటాక్షంబుల ముంచెనా యనుచు నా సావిత్రి ప్రశ్నింపఁగా
నకలంకం బగు ప్రేమ వాక్కులను హర్షాంభోనిధిన్ దేల్చుచున్ 181

తే. తరుణి నీ కోర్కె కింక విఘాతంబు లేదు
దైవ మనుకూలుఁ డయ్యె విధాత గూడ
నొండొరులకును ఘటియించి యుండెఁ బెండ్లి
పప్పు బువ్వ లభించు నో యప్ప మాకు 182

వ. అంతఁ బూవుటిల్లు వెడలి చిలుక నెక్కు రౌతు చికిలిఁ జేసినయలుఁగును బకపక నగు సొగసుతో డెందంబున సందడించు కోరిక లీరిక లెత్త నేలజేని కొమిరెకడ కడుగు లొక టొకటిగ నిడుచుఁ గడగంటి చూపు దూపుల వెడవెడ నిడుచు బుడమిపడఁతి మగఁడు వచ్చుటయు విడ రాని వలపు తడబడఁ జేయఁ బిడికిట నడగు నెన్నడుము వడక విడెము వలనఁ గలుగు కమ్మ తావులు తొగరువాతెఱ నుండి బుగులు కొనఁగఁ గాటుక కన్నుల ననుసిగ్గు దొంతరలు మాటిమాటికి లోని చాటుకతను దేట వలుప నబ్బురపు గబ్బి గుబ్బలు దబ్బర లాడువాని మది వడువున నిబ్బరముఁ దప్పి దబ్బిబ్బు లగుచుండ సాటి బోటుల మాటుచేసికొని నీటైన గుబ్బల పై గందంబు పేటులెత్తఁ బైటనడ్డుగ మీటుచు 183

తే. తాకినంతనె కసిగందు తావక మృదు
చరణ పద్మములకు నింత శ్రమముఁ గలుగఁ
జేసి యుంటిని మన్ననఁ జేసి నా యొ
సంగు స్వాగతమును గైకొనంగ వలయు 184

చ. అనుటయు రాకుమారుఁడు సుధానన నీ యుపచార వాక్యముల్
వినయము చేరి నా మదికి వేడ్క యొసంగెను జేయ కున్నఁ జే
సిన క్రియ సంతసింతును విశేషముగా నికఁ బోయివత్తు నా
జ్ఞ నొసఁగుమా మఱొక్కపుడు సల్పఁగ వచ్చును వేళయయ్యెడిన్

తే. అంత లోపల నొక్క బింబాధర వడి
వచ్చుటికి వచ్చి సావిత్రి నట్టెచూచి

దేవి పూజకు వేళ యతిక్రమించె
వేగ రావమ్మ యని పల్కి సాగిపోయె 186

సీ. కనుదోయి బాష్పంబు కణములు రాల హృ
దీశున కంత చేమొత్తి మ్రొక్కి
పోయివత్తు మఱువఁబోవకుఁ డను వేళ
మధురాధరంబు కంపంబు వొంద
నుపకారమునకుఁ బ్రత్యుపకారమును సేయ
ననుమాట కొంత సిగ్గును ఘటింప
జనకుఁ డీతని తోడి జతనంబునకు నిష్ట
పడునా యటన్న భావములు రేగ

తే. మాటిమాటికి వెనుకకు మఱలి ప్రియుని
సుందరాననసుధను జక్షులను గ్రోలి
పోవలేక పోవఁగలేక పొలతిమిన్న
యశ్వపతి పుత్త్రి పూజార్థమై చనంగ 187

తే. మోహవాహిని ప్రబలమై ముంప రాగ
దిక్కుదెలియక యందులోఁ జిక్కుకొనియెఁ
బరసతీ మణులను మాతృ భావమునను
జూచుచుండెడి పార్థివసూను డపుడు 188

వ. అంతనొక్కమునికుమారునిచేఁ బ్రబోధింపఁబడి వేడివెలుఁగు చదలు
నడిమిఁ జేరుటఁ గమనించి సమిత్కుశ ఫలాదుల సేకరించి 189

తే. అంధు లగు తల్లిదండ్రుల నర్చన మ్మొ
నర్చుటకు నేగె నతఁడు భూనాథయన్న
నంధులాటకుఁ గత మేమి యడవులందు
గాపురం బుండుటకు నేమి కారణంబు 190

క. అనుటయు శుక యోగీంద్రుఁ
డనుపమ నిస్స్వనము తోడ హర్షోత్కర్షం
బున నే తచ్చరితంబును
వినిపింపఁ దొడఁగెఁ దా వివేకంబొలయన్ 191

చిత్రాశ్వని జన్మ వృత్తాంతము

తే. జగతిలోపల సాళ్వ దేశంబు సుప్ర
సిద్ధ మవునట్లుగా ద్యుమత్సేన నాముఁ
డేలుచుండె శైబియనెడి గృహిణిఁగూడి
జనులు సుఖవీచికల నోఁగి సన్నుతింప 192

చ. అతనికిఁ జిత్ర కేతుఁడను నట్టి విరోధి కలండు వాఁడు దు
ర్మతి యయి మున్నొకప్పు డతి మత్సర వృత్తి రణం బొనర్చి దం
పతులను బల్మి మీఱఁ జెఱవట్టియు సంతస మందఁ బోక శ
త్రుతతి ధరాతలంబునకు దూరము సేయఁగ లోఁ దలంచుచున్ 193

తే. నిండు చూలాలు నామె యాతండు వృద్ధుఁ
డనెడు భావంబు గోరంత యైన లేక
క్రుస్లు పెకలించి వేసె గగ్గోలువడఁగఁ
బాప పుణ్యంబు లెంతురే పతిత జనులు 194

క. ఆ నాటి రాత్రిఁ గొందఱు
క్ష్మానాథుని భంగపాటు మదిఁ గలపంగన్
బూనిక మీఱఁగ నెట్లో
ప్రాణంబులతోడ వనికిఁ బంపిరి బ్రదుకన్ 195

తే. అంత నా వృద్ధ దంపతు లచట నున్న
మునుల సాహాయ్య మంది జీవనము సేయు
చుండఁ జిత్రాశ్వుఁ డనెడు పుత్త్రుండు పుట్టె
నిర్జరులఁ బ్రోవఁగ సుధ జన్మించి నటుల 196

క. బాలుం డద్భుత సుగుణ వి
శాలుం డకలంకరూప సమ్ముగ్ధజగ
జ్జాలుం డరిభూనాయక
కాలుం డని జనులు పొగడఁగాఁ బెం పెక్కెన్ 197

తే. తల్లిదండ్రులు వానిఁ జిత్రాశ్వుఁడనఁగ
బిలుచు కొనుచుండ్రు పేరిమి మలయుచుండ

నిత్య సత్య వ్రతుండయి నెగడు చుంట
సత్యవంతుండ టంచును జనములంద్రు 198

ఉ. వైరుల నాజి గెల్వఁ గల బాహు బలంబును గల్గి యుండియున్
మీఱఁగరాని దుర్విధి శమింపని దుఃఖముఁ గూర్చి యుంట నా
శూరకులాగ్రగణ్యుఁడు యశోధన మెల్లను గోలుపోయి య
ట్లూరక మానివృత్తి వని నుండెను జీకులఁ బూజ సేయుచున్ 199

వ. అనుటయు మేదినీ విభుం డెట్టిదైనఁ గాలప్రవాహంబు నరికట్ట
శక్తుండై యనుభవింపవలయుఁ గాక యని కొంత తడవు విచా
రించి యనంతర కథా విధానం బెఱుక వఱుపు మనుడు బాదరాయణ
సూనుం డిట్లని చెప్పందొడంగె 200

తే. మునుల యాశిషములనంది ముద్దుచెలులు
గతమునకుఁ గలకును గల సంఘటన గూర్చి
వ్యాఖ్య యొనరింపుచుండ గృహంబుఁ జేరి
మదన బాణానలమ్మున గ్రుగ్గుచుండె 201

చంద్రికావర్ణనము

వ. అంతఁ జరాచర పరీవృతాఖండ భూమండల మండిత శిరోమండల
ప్రభావిభాసిత శేషఫణిసహస్ర ఫణా రత్న కాంతులతో మంత
నంబులాడి యాఖండల వేదండ తుండోభయపార్శ్వ విలసిత చతు
ర్దంత దంతుర ప్రభారోచులఁ గీచులాడి పుత్రోదయానంద రస
పరవశ జనిత నిర్మలోత్తుంగాభంగ తరంగ భావోద్రేకం
బరచుంబి క్షీరపారావార ఫేన తళత్తళ ప్రకాశంబుల యవ
కాశంబుఁగొంతగొని వియత్తటినీతట విలసిత సముల్లసిత మల్లికా
మతల్లికావల్లరుల వెల్లివిరిసిన కుసుమంబుల పస నణంచి యభ్ర
స్థల విచ్ఛేదన పర్వతశిఖ రోద్భూత సరఝ్ఝరీ నివహానిస్తుల
ఝుంపాసంపాత వేగ కంపిత గిరిమల్లికల మొల్లంపు వెలుఁగుల నెల్ల
నుల్లసం బాడి హిమవన్నగ కటకగర్భ విరాజితానూన సూన
వితాన వాసనా ఘ్రాణానంద రసైక చిత్త చిత్తజాంతక
తను రుచులఁ బెనఁగొని మిక్కుటంబుగఁ గలిగిన తమి నుక్కు

మిగిలి పెక్కు రతుల మత్తిఁ గరఁగించిన సరసునిఁ గొసరి కొసరి చూచు బిసరుహాక్షుల వెలిచూపుల మెలఁగి వేడుకతోఁ గూడి మాడి కోడెగాం డ్రాడిన కోడిగంపు పలుకుల కులికి కులుకు మొగంబుల సగంబుగఁ జేసికొని రోసంబున గళంబుల భాసించు వెలగల మగఁజాల దూసిపోయ మరల నేర్చి సరంబులఁ గూర్చి యింత కైకొమ్మని చరణంబులఁ గరంబుల స్పృశించి వేఁడు ననువు కాండ్రఁ దన్ను వన్నెలాడుల పద నఖరోచుల కెదురువడి మది కుదురు వడక నదను దప్పి వచ్చిన యిచ్చకపు మచ్చెకంటులపైఁ బొలయలుక వహించి కళ డిందువడ మొగంబుఁ ద్రిప్పిన వగ కాండ్ర మొగముల మొగంబులఁ జేర్చి గుత్తంపు గుబ్బలు హత్తుకొనఁ గౌగింట బిగించి యింతకె యింత పంతము యని మంతనంబుల స్వాంతముఁ దనియించుచు నెడనెడ సరసోక్తులఁ విసరి ప్రత్యుత్తరంబు రామి విరుగఁబడి నవ్వ పువ్వుబోడుల మొత్తమ్మున కుత్తుకబంటి యయి చిత్తజ క్రీడాయత్త. చిత్తంబునఁ దత్తరించుచు నత్తమామలు కనకుండ దండనే వేసిన మంచంబునఁ బండియున్న మగని దండ కేగి వ్రేలి కొనలఁ దట్టిన నిట్టట్టనక బిట్టుగ ముసుఁగిడి తుట్టతుదకు బెట్టు నడలి చేపట్టున గదియించినఁ గని సంతసించి యింతి యొసంగు తెలనాకు మడుపులఁ దడివి యీడు జోడనక తోడి వారు కాదన వినక కన్నకన్నెల చిన్ని హొన్ని నెలవన్నె ప్రాయంబు మన్ను పాజ్ఞేయ సొమ్ముగల వృద్ధుల కమ్ము కొన్న యమ్మ య్యల పై దుమ్ముఁ జల్లుచు మెల్ల మెల్లన శయ్యలఁ దరిసి కొయ్యవారి నిదురించెడు ముదిమి మగలజేరి వచ్చితిమి లెండన దొంగముండల కింక పనియుండ దని చిట్టుబుట్టు లాడుచు నిట్టి నీల్గి బిట్టు బిగిసిన విసిగి కట్టడి దైవము మాకిట్టి మాది కట్టెల నంట గట్టె గదా యని విలపించు చెలుల కంటి నీళ్లంటి వెలవెలఁ బారు మొగంబుల కెగఁ బ్రాకి కలిమి గల చెలుల వెలగల వలిపెంపు చీరెల ధావళ్యంబును గవళించి చిఱుతబిడ్డల కొఱకు నేఱుపఱ

చిన వెండిగిన్నెల దండ కేగి తద్గర్భస్థ క్షీరాన్నంబు నోఁజసి ముంగి ళ్లఁ జల్లని పిల్లగాడ్పుల కానవడి తెల్లని చల్వ పాన్పులఁ బండిన నిండు చూలాంద్ర దేహ పాండిమంబున దీపించి పలుపు తమ్మెలు సడలించిన వడినడి గంతులిడుచు మొదవుల పొదుగుల వదనంబుల నదిమి యదిమి లేగలు చప్పరించు నప్పాలు సెలవులం బారు నురుగులఁ గెరలి భిల్ల పల్లవాధర ఉల్లసంబులు వల్కికొనుచు సమీపంబైన యటవిఁ దరిసి కొల్లగ పదనుచే వెల్లివిరిసెడి భల్లంబుల ముదురు వెదుళ్లఁ ద్రెళ్ళ నేసిన జల్లని రాలు క్రొత్త ముత్తెంపు గుంపుల నిగనిగలఁ దగుల్కొని మగలు పగలు పూనఁ దిగులు సెంది యింటి నడుమ చేల చెఱంగులపైఁ బండుకొను వేదండ గమనల పాండు వర్ణంబుల మెండుకొని స్ఫటికశిలావితర్దికల ననంగమర్దనాంగనా పూజార్పితకుందప్రసూనం బుల సహవాసమునఁ దేజరిల్లి వెన్నెల పులుగుల పుక్కిలింత లకు వెక్కసం బగు గంగానిర్మలతరంగ డోలికా కేళికాలోల సిత పుండరీకంబుల చకచకద్యుతులఁ గికురించి సావిత్రీమదనతాప నివారణ లిప్త ఘనసారంబునఁ దొరంబై చేటికా ప్రకల్పిత నవ కర్పూరరంభాపత్ర శయ్యాతలంబున సయ్యాట లాడి పిండి యార వోసినట్లు ముత్యాల ముగ్గులు వెట్టినట్లు గంగానది పొంగినట్లు మల్లెపూవుల కలయంపిఁ జల్లినట్లు కౌముదివలె సకల పదార్థ గ్రహణ జ్ఞానంబునకు నెలవై కౌముది వెల్లి విరిసె నట్టియెడ 202

మాళవి యశ్వపతితోఁ బుత్త్రికావివాహ ప్రశ్న సేయుట

తే. అంతిపురమున వేడుకయైన పలుకు
లాడుకొను వేళ మాళవి యాత్మ పతిని
మనసు గరగించు వలపుల చనవు నించి
పలికె నిట్టులఁ గపురంపుఁ బలుకు లొలయ 203

తే. ఏడులు పదాఱు నిండె నింకేల జాగు
చిన్ని కూనకుఁ బెండిలి సేయవలయు

రాచబిడ్డల కెల్లవారలకుఁ జిత్ర
ఫలకముల నంప వ్రాసి పంపంగ రాదొ 204
వ. అనుటయు 205
క. హృదయేశ్వరి నీ చెప్పుట
ముదమొదవం జేసె నింకఁ బో తేపే పం
పెదఁ జారుల దేశంబుల
మదిలో సంశయము వీడుమా నీ వనఁగన్ 206
తే. అట్టి సంతోష సమయంబు నందు మిపులు
యామములు మూఁడు గడియలో నంతరించెఁ
బక్షి సంతాన కలకలస్వనము మేలు
కొలుపు రీతిగ నా దంపతులు తలంచి 207
వ. మేల్కాంచి కరణీయంబులన్ నిర్వర్తించి యర్ధాంగి నంతిపుర
మున నుండ నియమించి కొలువుకూటమున కేగుదెంచి సభికులఁ
గుశలప్రశ్నంబులన్ దనియించి కొండొక తడవు రాచకార్యంబు
లన్ బ్రొద్దు నించి చారుల లక్షించి 208
తే. జలధి పరివృత ధారుణీ చక్రమందు
గల్గు దేశంబు లన్నింటిఁ గలయఁ జూచి
రాచబిడ్డల లలిత చిత్రముల తోడ
వర్తనముల గ్రహించి రావలయు మీరు 209
మ. అని యాజ్ఞాపన సేయఁగా భటులు సాష్టాంగంబుగా మ్రొక్కి ప
త్తనముల్ పల్లెలు గ్రామముల్ మొదలుగా దర్శించి చిత్రంబులన్
గొని భూనాథుని కొల్వుకూటమునకున్ గొంపోయి యర్పింపఁ బు
త్త్రిని రావించి వచించెఁ జిత్రగతచారిత్రంబు లొక్కొక్కటిన్ 210

చిత్రపట విమర్శనము

ఉ. వీఁడు కళింగభూమిపతి ప్రేముడిబిడ్డఁడు విద్యయందునన్
గాడుపు తిండివాఁడు కొఱగాఁ డనిపించెడువాఁడు పార్థుతో
నీడు పరాక్రమంబున మహేశ్వరుఁ డేనియు వీని తోడుతన్
రాఁడు పెనంగఁ బోల్ప సరిరాడు స్మరుండును రూపసంపదన్ 211

ఉ. ఈతఁడు వంగరాజ్య రమణీశ్వర సూనుఁడు బాహువిక్రమో
పేతుఁడు శిష్టరక్షణ వివేక వినమ్ర విశాలభావ వి
ఖ్యాతుఁడు చండశాత్రవనికాయతనూపరిదీర్ణభల్ల వి
ఖ్యాతుఁడు వీని గోరికొని ఖ్యాతిని నొంకుమ యింపు నందునన్ 212

గీ. ఇతఁడు కాశ్మీర దేశంబు నేలువాఁడు
వీఁడు కర్ణాటపతి యశో విభవుఁ డీతఁ
డంగనాథుఁడు మరి వీఁ డనంగ సదృశుఁ
డు మగధ ధవుఁడు కోరుకొనుము యొకనిని 213

శా. ఈ రీతిన్ ఫలకంబు లొక్కొకటిగా నేతచ్చరిత్రంబు నిం
పారన్ దెల్పుచుఁ జూపుచుండు నెడ మున్యాకార పూర్ణున్ ధను
శ్శారిన్ సుందర రూపునిన్ గలుగు చిత్రం బొండు కాన్పించినన్
ద్వారంబైన ముదంబుతోడఁ గను కూతుర్ గాంచి విభ్రాంతుఁడై

తే. ఎవ్వఁ డీతఁడు వీని నీ వెల్లెటుంగు
దితనిఁ గనుఁగొన్న మాత్రె సంతృప్తియేలఁ
గలిగెఁ బేరున్న రాచ బిడ్డలను గాంచి
విముఖతను జూపఁ గత మేమి వే వచింపు 215

మ. అని ప్రశ్నించిన తండ్రినిన్ గనుచునో యయ్యా యితండొక్క రే
యిని స్వప్నంబున వచ్చి యంచు నటుపై వృత్తాంతమున్ నిల్పి వీ
క్షణ సందోహము సిగ్గు దొంతరలనున్ గల్పింపఁగా భామినిన్
గనుచున్ నిల్చిన కీర మందుకొని పల్కం జొచ్చె నిమ్మాడ్కి గన్ 216

తే. స్వప్నగతుఁడైన నాఁడె మా సకియ వీని
నాధునిన్ జేసెఁ దన యావనంపు రాజ్య
మునకు నటుపైని నోసఁగెను మునులఁబూజ
సేయ నరిగిన వేళను జిత్తధనము 217

తే. అని వచించిన చిలుక వాక్యములను విని
సాంత మెటిగింపు మితని వృత్తాంత మనిన
నశ్వపతితోడ బలికెఁ జిత్రాశ్వు చరిత
మమృత మొలుకు గంభీర వాక్యములు మలయ 218

వ. ఏతచ్చరిత్రంబుఁ దుదివాఁక నాలకించి కటకటం బడి యకటకట యిట్టి కట్టడి కోర్కె నీ కెట్లు వుట్టెఁ బట్టువల మానుము పుట్టక పుట్టక పుట్టిన చిట్టి పట్టివి బెట్టిదం బైన యిట్టి యాసం బెట్టుకొని పుట్టిన యింటి నట్టేట నెట్టుదె గట్టి కీరితిఁ జేపట్టినట్టి పట్టభద్రు లుండఁగ దుట్టతుదకు 219

శా. రాజ్య భ్రష్టునిఁ గోరఁగాఁ దగునె గారాబంపు బిడ్డా మనో రాజ్యం బంను నసహ్యతాయుత విచారతామముఁగ నిల్పు వా ణిజ్యంబుఁగ విడనాడి వేశోకనిర్విఁ జే పట్టి లోకంబునఁగ బూజ్యత్వంబును మాకుఁ గూర్పఁ గదవే పున్నెంబు నీ కయ్యెడిఁగ

క. ఇందఱు తేజోఽధికతము
లిందఱు గోత్రైక రూపు లిందఱు శూరుల్
మందులక్రియఁ దోచిరె మా
యందఱనుఁగ దుఃఖపెట్ట నాత్మజ నీకుఁగ 221

చ. వనములఁ బెద్దకాలముఁ దపంబొనరించి యథావిధిఁగ శివా జనని కృపఁగ నినుఁగ బడసి సర్వము నీవని నమ్మియున్న మా మనము విచార భారమున గ్రుగ్గఁగఁ జేయఁగఁ బాడి యౌనె యే రినిఁ గని సంతసింతుము ధరిత్రినిఁ గానకు నిన్నుఁ బంపుచుఁగ 222

సీ. అతిరమ్య కలిత సౌధాంతరంబుల హంస
తూలికా తల్పాన దూగు నీవు
కనుసన్న మాత్రనే కార్యముల్ నెఱవేర్చు
దాసీ జనంబుతోఁ దనరు నీవు
గోక్షీర చిత్రాన్న గోఘృత రాజాన్న
ముల నారగించుచు వెలయు నీవు
మోహనం బైన పుష్పోద్యాన శృంగాట
కంబుల నిరతంబుఁ గడపు నీవు
తే. మృదుల సుమరజః కలిత సమీరమంద
మంద గమనాతి మోద సంబంధ హృదయ

జనిత నిర్మలభావ ప్రసక్త వీవు
ప్రళయ దారిద్ర్యవహ్నిలోఁ బడగఁ దగునె 223

వ. అని సాంత్వనవచనంబులఁ బ్రియపుత్త్రికోర్కి మఱల్పం బ్రయ
త్నించిన నామెయు సిగ్గు తెరను గొంత సనరించి 224

తే. అడవి నుండినఁ గష్టంబు లానరించి
యంతిపురి నున్న మానునే వంత యేల
స్వాంతమందున జనక యావంత యేనిఁ
గీడు రానేర దాతని తోడి చెలిమి 225

వ. సందేహింపవలదు నా ముద్దు చెల్లింపు మని తద్దయుఁ బ్రొద్దు
వేడిన ముద్దుబిడ్డను గాదనలేక ముందు రానున్న యాపద్దశ
హృదయ గోచరంబు గాక సందిగ్ధావస్థం జిక్కి యొక్క భటునిఁ
బిలిచి తన పత్నిం గొని రా ననుజ్ఞ నిచ్చిన నాతండును దేవి
యానతిఁ దల ధరించి చిత్త మని వెడలి చిరంతన పుణ్య పరి
పాకంబైన నిజతనూజా పరిణయ కాలంబు చేరువయ్యె
ననెడి మహదానందంబున నొడలు మఱచియున్న పట్టపు
దేవిం గని తల్లీ మీ రొక్కపరి స్వామివారి సన్నిధికి రావలయు
నిది ప్రభునాజ్ఞ యన్న వర్తమము గాక నీవేగు మని యొక్కయాడి
గంపుఁగత్తె మార్గ పరిచయము సేయఁ గొల్వుకూటమున కరుగు
దెంచి మేలిమి వన్నె బంగారునందు మగఱాల మొత్తంబులఁ
దాపి యమర్చిన కుచ్చులనుండి వింత వెలుఁగు గలుఁగఁ జేయు
చున్న వలిపెంపుఁ దెరల నడుమ ప్రవేశించి నమస్కరించి నిలిచిన
జాయ నాలోకించి దీవించి గత మెఱింగించి సుతావాక్యంబు
సూచించి నీ వైనం జెప్పు మనుచు మీ వలనఁ గాని కార్యంబు నేన
దీర్చుదాన నైనఁ జెప్పిచూత మని యాత్మజాతఁ జేరఁ బిలిచి తల
నిమిరి కొప్పు సవరించి చెక్కులు ముద్దుఁగొని యాలింగన పూర్వ
కంబుగా 226

తే. అష్టకష్టము లెల్లను ననుభవించి
మమత బాధింపగా నవమాసములను

గర్భమున మోసి నిన్నిటు కన్నవారు
నీ పురోవృద్ధిఁ జూడ కే నేర్పవలెనె 227

సీ. నునుగాడ్పు కూనలు తనువు సోకిన జిల్గు
పుట్ట మే దను చిట్టి పట్టి వీవు
వెన్నెల గుంపుల వేడిమి కాఁగని
పొల్పారు తమ్మి పూఁబోడి వీవు
ఆఁకటి ప్రొద్దెంత యైనను బల్వెచ్చి
యడుగంగఁ జాలని యబల వీవు
పనివారి నసుమ నున్నను జీమ చీఁటు కన్న
భయమందు లేఁత గుండియవు నీవు

తే. అత్తమామలు ముది వార లంధు లన్న
మాకులుఁగా దుఃపలును పండు లాత్మ భర్త
పేద మునిబాలకుం డిట్టి వీరితోడఁ
గాపురంబెట్లు సేతు వా కాననమున 228

వ. అని కనుఁగొలఁకుల నుండి నీటిచుక్కలు వెడలి కొమరిత తలను
వెచ్చఁ జేయుచుండఁ బలికిన పలుకుల నాలకించి 229

తే. ముందు నొకవాని మదియందుఁ బొందుపఱచి
మఱల నింకొక వానిని మదిని నిల్ప
నేటి సరసమొ మదిని నూహింపు మమ్మ
రాజపుత్త్రికల కిది ధర్మంబె చూడ 230

సీ. తారకమంత్ర సంస్తవ పాత్రమై యొప్పు
జిహ్వ కోరునె వేప చేదు మెసవ
జగదవనాఢ్య సాక్షాత్కారమును గోరు
కనులు గోరునె నీచజనునిఁ జూడ
భువి నహింసా పరమో ధర్మ యని యెంచు
ప్రాణి కోరునె ప్రాణి బాధపెట్ట
సత్య సంరక్షణాసక్తి సంకలితమా
బుద్ధి కోరునె తా నబద్ధమాడ

తే. స్వప్నగత సుందరాకార సరస మధుర
వచన రచనామృతాపగా ప్రవిమలకణ
జనిత శీతల వాతప్రశస్తసౌఖ్య
మైన దేహము కోరునె యన్యవాంఛ 231

వ. తల్లీ వగవకుము చెప్పకొనంగ దగిన నడవడికతో నొప్పుచు జన
ముల మెప్పుఁగన్న నీ విప్పగిదిఁ జెప్పి నా మది నొప్పింపకు మెప్ప
గిది విధి లిఖించిన నప్పగిదిం దప్పక జరుగు నన్న కూతు నా
లోకించి వెనుకముంగల సంగతులు కలతఁ బెట్టంగ బట్టిపైఁ
గట్టలుక వహించి 232

సీ. నీ యశశ్చంద్రికల్ నిఖిల దిక్కులఁజల్లి
కులముఁ బవిత్రంబు సలుపు దనుచు
సద్గుణానంద విశాలుఁడౌ భర్తను
జేపట్టి సుఖము నార్జింపుదనుచు
నుజ్వలశౌర్య సంయుత సుతోదయమున
దరములఁ బదునాల్గుఁ దనుపు దనుచు
త్రైలోక్య నారీ మతల్లుల లోపల
నధికురాలుగ నుండి యలరు దనుచుఁ

తే. నెంతయో మోదమున నుండ స్వాంతమందు
గఠినతమమైన నీదు మూర్ఖ్యంబు చేత
నడవి గాఁచిన వెన్నె లట్లగుట కాక
కడుపు చెఱువయ్యె నినుఁ గన్న కారణమున 233

వ. అని క్రోధారుణిత లోచనుండై పలికిన తండ్రిం గని సుధారసంబు
తొట్రిల సావిత్రి యిట్టు లనియె 234

తే. పగతురకు వెన్ను నిచ్చుట ప్రాణభీతి
చే నసత్యంబు వల్కుట చిత్తమిచ్చి
మఱల గైకొంట యవమాన కరముగాదె
పరిహాసింపదె తద్జ్ఞాళి పలుకు వేళ 235

చ. కులగిరు లేకమైన ధర క్రుంగిన వార్నిధు లింకిపోయినన్
గలువలఱేని మండలము కాంతిని వీడినఁ దారకావళుల్
జలజల నేల రాలినను జక్రి యధర్మపథంబు ద్రొక్కినన్
వలచిన వాని వీడి వరణం బొనరింప మఱొక్కరాసుతుల్ 236

వ. ఇట్లు నిబ్బరం బగు పలుకు లాడుచున్న కూఁతుం గాంచి యశ్వపతి పెద్దయుం బ్రొద్దు చింతించి పుత్రికామనస్స్థైర్యంబున కచ్చెరువడి యన్నింటికి రక్షకుండు వాఁడె యున్నవాఁడని యాడుచు నట్ల యగుగాత మింక నీ వేగి సుఖం బుండు మనుడు నాపత్కాలంబునన్ గాక దైవంబు మనంబునకు రాదు ముందు మమ్ము నిందింపవల దాతం డల్పాయుష్కుం డీప్ట మున్నవానికి నీ కన్నకూన నొసంగి పెండిలి యొనరింపు మింక వత్సరంబు మాత్రమే యాయుఃప్రమాణంబు కలదు ప్రేమాంధత ముందు వెనుక లరయక యొక యవ్యక్త కార్యం బాచరించు వడువునఁ దెలిసి వచింపకునికి చెప్పరాని తప్పిద మగు నద్ది యాత్మవంచనయుఁ గూడ నగు నని యశరీరవాణి యాడిన మాటలు ములుకులవలె వీనులన్ గ్రుచ్చుకొని లోనం జొచ్చి ధైర్యకంచుకమును విచ్ఛిన్నం బొనరింప నాతండును ప్రచండవజ్రాహతిన్ స్థానభ్రంశంబు నొంది భూస్థలింబడిన భూధరంబు పగిది ధరణింబడిన సేవకజనాధారంబున మాళవీదేవి యంతిపురంబుఁ జేర్చి జ్ఞానోదయంబుకొఱ కుపచారంబుల నొనర్చుచుండె, నిక్కడ సావిత్రి చిరకాలం బాశ్రయించి యుండ నా వృక్షస్థ ఫలము పండి యనుభవకాలంబురా దైవయోగంబుననో వాయువశంబుననో చేఁదప్పి నట్టేటం బడి కొట్టుకొని పోవు నట్టు లయ్యె నని బిట్టుగ వగచుచు మూలచ్ఛేదం బొనరించిన కదళీ తరువు గతి నొందినఁ జెలిమికత్తెలు గిల గిల లాడుచుఁ గరములు కంపింపఁ బాదములు తొట్రుపడ గుండియలు కొట్టుకొనుచుఁ దుట్టతుదకు నెట్టులో యా రాచపట్టి నొక్క శిబికం జేర్చి లోనికిన్ గొని చని సపర్యల నొనరించుచుండి రట్టియెడ విజ్ఞానసారంబైన కీరంబు తేని చెంగట వ్రాలి సగము తెలివి నుండుట గుఱుతించి మధురాలాపంబుల సేద దేర్చి

తా నిం దరు జెంచుటయుఁ దర్వాతి కథనంబును నెఱింగించి నేటిసంగతి వైవాహికానంతరము నీ పట్టికిఁ జెప్పి తద్రక్షణ మార్గంబు సువ్యక్తంబుఁ గావించి పోఁదలంచితి నైన నేమామె నాత్మ శక్తి యొుండుండవలయుఁ గాక కాని కార్యం బుండునె నిజ ప్రభావంబున సూర్యగమనం బరికట్టిన సుమతికత మఱచితె యుక్కు సెనగల గుగ్గిళ్లుగ నొనర్చి ముమ్మూర్తులఁ బొత్తి బిడ్డలఁ గావించి లోకమాతల మించి నిర్ధూత గంగా కల్మషయు ప్రసాదిత కౌశిక పునర్జీవితయునై ధ్యేయమై వెలసిన యా యన సూయా చరిత్రంబు తలంపునఁ బాసెనె యని సంగ్రహించి విశద పఱచి ధైర్యంబు వహియించి యిక్కార్యంబు నాచరింపు డిందున నుభయకులోద్ధరణంబు తిరంబుగఁ జెలంగు ననుడు దరహసిత వదనుండై తనకుఁ దన చిలుకకు నడుమ నడచిన పలుకులు కూఁ తునకు వినికిడి జేయించిన నంతకు ముందెందు డాగెనో యా స్వస్థత యా పలుకాలించి నంతఁ దనంత వచ్చి చేరఁ బెల్లుబుకుచున్న సం తసము కనుగొలకులఁ దొలుకాడ నవశ్యాచరణీయ కార్యంబుల కాత్మసఖీజనంబు నియోగించి యొుక్కరితయ గవాక్షంబు చేరు వఁ జని సమీపంబననున్న కేళీవనంబుఁ గాంచి ముసిముసినగవులు ముద్దుమోవి పయి మురిపెములు సేయ 237

సీ. మానసమా! యింక మర విభ్రమము వీడి
నిశ్శంక వృత్తితో నెగడ వలయుఁ
జిలుకలారా! యింకఁ జిత్తము రంజిల్లఁ
బ్రణయ వాక్యంబులఁ బలుక వలయుఁ
బికములారా! యింకఁ బ్రేమగీతంబుల
భావ ముప్పొంగఁగాఁ బాడవలయు
నెమళులారా! యింక నిరుపమానంబైన
శృంగారనటనంబు సేయవలయు
తే. సుందరోద్యానమా! యింక సుందర మగు
తలిరుటాకుల వసనముల్ దాల్ప వలయు

నెంపుల కటంచుఁ బలుకుదు రేమొ వినుఁడు
వచ్చుచున్నాఁడు మీ చెలి వన్నెకాడు 240

వ. అనుడు పూవుఁదోటతల్లి సయ్యాటల మూటయైన రాచపట్టికిఁ బెండిలి యగు నను నుబ్బున నుబ్బి కేరింతలు కొట్టుచున్న దనఁ గోకిల ముత్తమ్ములు కుహూ కుహూ నినదంబుల నంబరం బెల్ల మధుర నాద మేదురంబు గావించె నామె యానంద బాష్పంబులు రాల్చుచున్నదో యనఁ బూదేనె జడులు గురిసె నంతలో నొక్క పరిచారిక యరుదెంచి యమ్మగారు మిమ్ముల రమ్మనిరి రండని యెదురు సూచు ముదితకు వచ్చెదఁ బద మని యానతిచ్చి యమ్మెచ్చులాడి నెన్నున వచ్చు చున్న భావి భాగ్యోదయంబుఁ గని నీ కోరిన మగండు నీ కబ్బె నని లోని సంతసము వెల్లువలై వెలికిఁ బాఱ ముచ్చటించుచుండ సాపడు వేళ యగుటయు మాళవి ముద్దుపట్టిం గూడి మజ్జన భోజనాదుల నొనరించి శయనించె మజ్ఝారే! ఫలాసన్న కాలము దినము వత్సరం బానేమొ యెప్పుడు తెల్లవారునన్న సందడి నా ముద్దియను నిద్దురఁబోనిచ్చి
నది కాదంత 241

ప్రభాత వర్ణనము

సీ. తన బిందువులఁ బాద్యమును గూర్చి దినమణి
తనియంగ భక్తిఁ జూపెను హిమంబు
తన నాదమున స్తవంబును జేసి భానుని
నలరింపఁ జేసె విహంగకులము
తన చిన్నినడకతోడను జామరము వైచి
కమలాప్తు మెప్పించె గాడ్పు కూన
తన పూలతో నివాళినిఁ బట్టె సూర్యున
కానంద మిచ్చె నుద్యానకన్య

తే. తన వెలుంగునఁ దమ రాక ధరణి యెల్ల
వెల్లడించితి మీ రింక వెడలవచ్చుఁ

తే. ప్రకృతి సౌధంబు నందున ధ్వాంత మావ
రింప కుండెడు లాగుఁ గాలంపు టింతి
ప్రజ్వలింపఁగఁ జేయు దీపంబు నాఁగఁ
దేజరిలె భాస్కరుఁడు తూర్పు దిక్కునందు 247

అశ్వపతి పండితుల రావించి ముహూర్తము పెట్టించుట

వ. అంత సూర్యోదయం బగుటయు నా రాజశేఖరుఁ డుచిత కృత్యంబులఁ దీర్చి త్వరితగతిఁ గొలువుకూటంబున కేగుదెంచి పండితులను జ్యౌతిషకులను రావించి యర్ఘ్యసత్కారంబుల బహూకరించి నిటల తటఘటిత కరపంకరుహుండై 248

ఉ. పండితులార శాస్త్రముల బాగుగఁ జూచి వచింపు డయ్య నేఁ
బెండిలి సేయగా వలయు బిడ్డకు మంచి ముహూర్త మెప్పుడో
కొండిక మాట కాదనుచుఁ గోరిన నాతనిఁ గాంచి ప్రీతులై
దండధర ప్రతాపము వృథా యనిపింపఁగఁ జాలు లగ్నమున్ 249

తే. పెట్టి పంచాంగములు కట్టఁ గట్టి చంకఁ
బెట్టి సెల వన్న వారిని వీడు కొలిపి
తత్ప్రయత్నంబు నందునఁ దవిలి రాజ
చంద్రుఁ డంతటఁ బుర మెల్లఁ జాటఁ బంచి 250

క. ఇలువేల్పులఁ బూజించెను
కలుషంబులు బాపి సకల కామ్యంబులతో
నిలవేల్పయి యెల్లప్పుడు
వెలయుంగా కల్లుఁ డంచు వేడుక మీఱన్ 251

వ. ఇట్లు దేవతాప్రీతికరంబుగఁ బూజల నొనర్చి యొక్క శుభ దివసంబున 252

అశ్వపతి పరివార బంధుసహితుండై తపోవనము ప్రవేశించుట

క. చతురంగ బలంబులతోఁ
జతు రుదధి పరీత భూమి చక్రము వడఁకన్
హితమతి వచ్చెడు భూమీ
పతిఁగని గనుఁగొనుచు సత్యవంతుఁడు మదిలో 253

ఉ. మున్నొకమారు మా యెడల భూపతి నీతిని వీడి మోసముల్
బన్ని వనీతటంబులకుఁ బంపెను వృద్ధుల గ్రుడ్లు పీకి మే
మన్నిటి నోర్చి కాలమునకై తపియించుచు నుంటి మల్లె యా
పన్నులరీతి నిప్పటికి వైరము తీరఁగ లేదొ వీనికిన్ 254

శా. కాని మ్మిప్పటికైన మేలొనరె శంకాహీనమౌ యుద్ధవి
ద్యానైపుణ్యముఁజూపి తండ్రి హృదయం బానందమున్ బొందఁగాఁ
బ్రాణంబుల్ హరియించి మింతుననుచున్ బాణంబు సంధించి యో
రీ నీచాత్మక చిత్రకేతు హతకా ప్రేమాబ్జవిధ్వంసకా 255

తే. వెదుకఁ దలఁచిన తీవయే యెదురువచ్చి
కాలికిన్ జుట్టుకొన్నట్లుగా ఘటిల్లె
నిరతమును యుద్ధభూమిని నిన్నుఁ జంప
నెంచియుండెడి నాకు నీ వెదురువడుట 256

చ. నిలునిలు పారిపోవకుము నీ పసఁదూల్చెదఁ జూడుమిప్డు వృ
ద్ధులను బరాభవింపఁగను దొంగతనంబుగఁ బత్తనంబులో
పలికిని సారమేయ మటు వచ్చుట కాదు మదీయ కార్ముకో
జ్వల జనితాశుగ ప్రకరచండ ధనంజయ కీల నోర్చుటల్ 257

వ. అని ప్రళయకాల పుష్కలావర్త మేఘనిర్ఘోషంబును ధిక్కరించు
నినదమ్ముతో బెట్టుగ నార్చుచుఁ ద్రిపురసంహారం బొనర్చునాటి
కొండవిలుకాని దండిరూపంబును బెండుపఱచుచుఁ ద్రిభువన
భయంకర ఘోరపాప కార్యాచరణ దీక్షాదక్షుండైన కనకకశి
పుని వక్షస్థలంబు ఛేదించి వెచ్చనెత్తురు జుఱ్ఱుచు నోడలు మఱచిన
నృకేసరిదైన యాకారంబునకుఁ జక్కట్లు దిద్దుచు వీర రసాధి దేవ
తాపరావతారం బోయన నారి వింటికొనకున్ దగిలించి యస్త్రంబు
సంధానంబున కాయత్తపడుచున్న కాబోవు నల్లునిన్ గని భయంబు
పెల్లుబుకఁ బురోహితుని వెన్నుఁగాచుచుఁ గంపిత స్వరంబునఁ
బగతురము కాము పగ సాధింపఁగ నని యాచార్యు ను ద్దేశించుటయు
నాతండును సాళ్వదేశ రక్షామణి! యితండు మద్రదేశాధీశుండగు
నశ్వపతి కాని శత్రుఁడైన చిత్రకేతుండుగాఁడు తన యాత్మజాత నీకు

నర్పింపవచ్చెఁ గోపం బుడిగి పూజ్యుల వాసంబునకు ద్రోవ సూపు
మనుడు వైరి కృతప్రాక్తనమహావమాన రోష దందహ్యమాన
మానస సంజాత క్రోధాతిరేకంబున ధృతి సెడి పలికిన నా వచనం
బుల మన్నించు డని సవినయంబుగ వారలఁ దోడుకొని నిజ నివా
సంబున కరిగి నమస్కరించి యుదయభానుని పోల్కి నిలిచియున్న
నృపాలు నుద్దేశించి తండ్రితో 258

తే. మద్రదేశాధిపతి యసమానగౌర
వాభిరాముండు శూరకులాగ్రగణ్యుఁ
డశ్వపతి యను దివ్య నామాక్షరముల
వ్యవహరింపంగఁ బడుచున్నవాఁడు భువిని 259

వ. అని వారలఁ బరిచయం బొనర్చి కాల్యాదికంబులఁ దీర్ప లోని
కరిగిన సత్యవంతుని మనసారఁ గాంచి తృప్తుండై యయ్యా! ద్యుమ
త్సేన మహారాజ! సర్వలక్షణ లక్షితుండైన నీ పట్టికి నా పట్టి
నిచ్చి పరిణయంబుఁ గూర్ప వచ్చితి ని ట్లనాహూయమానుండై
యే తెంచిన వాఁడు వీని పొత్తు గిట్టదని గట్టి పట్టుఁ బట్టక సమ్మ
తింపు డని యన్న యశ్వపతి నాలోకించి ద్యుమత్సేనుండు 260

ఉ. పెండిలి సేయరో జగతి బిడ్డల కెందును నిన్నుఁ బోలు వాఁ
డుండునొ లేడొ నే నెఱుఁగ నొక్కఁడు నూటికి వారిలోనఁ బ్రా
జ్ఞుండవు గాన మాకిటుల శోభనముఁ బచరించినావు లే
కుండినఁ జీకులై యడవి నుండిన మమ్ముఁ దలంతురే యొరుల్ 261

మ. అనుచుఁ గన్నులబాష్పముల్ మలయ మాటాడంగనావృద్ధునిఁ
గనుచుఁ బాష్పజలంబునుఁ దుడుచుచుఁ గాలప్రవాహోద్ధతుల్
వనజాతాసను లంత వారలకె దుర్వారంబుగా నుండఁ జిం
తనుబొందఁ దగునే మహాత్మ యిటు పెద్దల్ మీరు కష్టాలకై 262

సీ. చంద్రప్రకాశంబు చందంబు గాదె యీ
కష్టసుఖంబు లుత్కృష్టహృదయ
యెన్న నంతటి వాని విడచెనే ప్రాకృత
కర్మంబు సుంతైన ధర్మనిరత

జరిగిన కత నెంచి సంతాప మొందుట
పెద్దల పని గాదు విమలచరిత
దైవ నిర్ణయమును దప్పించుకొనఁ జాలు
ప్రాణి కల్గదు గదా పావనాత్మ

తే. సకల మెఱిఁగిన మీ వంటి సజ్జనులకుఁ
జెప్పఁ దగు నీతు లుండునే క్షితితలమునఁ
దెలిసి తెలియకఁ జనువునఁ బలికి నట్టి
నాదు పల్కులఁ బ్రేమ మన్నన మొనర్పు 263

తే. వగ పుడిగి యింక మీరు శుభశ్చ శీఘ్ర
మనెడి యార్యోక్తి చొప్పున నస్మదీయ
పుత్రికారత్నమునకు మీ పుత్రరత్న
మునకుఁ బెండిలి యొనరింప ముదల యిండు 264

వ. అని సవినయంబుగఁ బలికి నిలిచిన వియ్యంకు నాలోకించి సిరి రా
మోకా లడ్డువా రుందురె యయాచితంబుగఁ దమ వంటి పెద్దలు
మాకుఁ జేయూత నొసంగుట పురాభవవిశేష పుణ్యపరిపాకంబు
గాదె యని వత్సా యుస్మద్గురువుల సంతోషపఱుపు మనుడు తమ
యానతికి భిన్నంబు జరుగునే యని సత్యవంతుండు యథాశక్తి నా
రాత్రి వారల నర్చించె ననంతరంబ 265

ఆశ్వాసాంతము

శా. దక్షధ్వంసి పితృప్రసాదవిభవా! దాతృత్వహృద్భాసితా
ధ్యక్షా! యక్షియుగావలోకన నిమిత్తైశ్వర్యవ ద్యాచకా!
దాక్షిణ్యాకర! నైకవంశ శిశువిద్యాదాన వాః పూరసం
రక్షా! శిక్షితవైరిపుంజ ధిషణా! ప్రజ్ఞానపాథోనిధీ 266

క. విద్వన్నుతవర గుణసం
పద్విభవా! రూపవిజితపంచశరా! రా
జద్వనజసమవదన! త్రిజ
గద్వల్లభ చరణ వినుత! కరుణావార్ధీ 267

గద్య

ఇది శ్రీ ప్రసన్నాంజనేయ మహామంత్రోపాసనా జనిత మృదుమధుర
మధురపదభరిత చతుర్విధానవద్య కవిత్వధారా సుధాపూరసుహృ
జ్జనచరణసేవా నిరంత రాపస్తంబ సూత్ర భారద్వాజస గోత్రపవిత్ర
కోటాన్వయ క్షీరపారావార రాకాసుధాకర రామశాస్త్రి
దత్తసుత కళాకోవి దాష్టావధాని బాలకవిశేఖర బాల
సరస్వ తీత్యాది బిరుదాంకిత వీరాంజనేయ
శర్మాభిధాన విరచిత చిత్రాశ్వీయం
బను మహా ప్రబంధంబు నందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# చిత్రాశ్వీయము

## తృతీయాశ్వాసము

క. సీతానాయక పదకం
జాత ప్రవిమల మరంద సంగత చేతా!
యాతా యాతాశ్రితసం
ఘాతా మోదవిభవ! భవ కల్మష హరణా 1

సావిత్రీ సత్యవంతుల పరిణయము

తే. అవధరింపుము జనమేజయావనీశ
జనకునకుఁ బ్రీతి శుకయోగిచంద్రుఁడు వచి
యించె నద్దాని నీ కెఱిఁగించు వాఁడ
నట్ల వైవాహిక మొనర్ప నాజ్ఞ వడసి 2

వ. ఏ తచ్ఛుభ వర్తమానంబు మిత్ర పురోహితామాత్యుల కెఱుక
వఱచిన 3

తే. ఏరి పనులకు వారు వేర్వేఱ నరుగఁ
జెలిమి కత్తెలు సావిత్రిఁ జేర వచ్చి
సంబరము తోడ నాలింగనం బొనర్చి
స్నాన మొనరింప రావమ్మ సకియ మిన్న 4

మ. అని యామెన్ గొని పోయి రత్నమయపీఠాధిష్ఠితన్ జేసి ఘు
మ్మని తావుల్ వెదఁజల్లు నూనియలచే నందంబుగా హస్తకం
కణనిక్వాణము కర్ణరంధ్రములు సౌఖ్యన్ గానమున్ జేయగాఁ
ఝన ఝొప్పన్ దమి శీర్షమంటిరి యుగోజద్వంద్వ మూటాడగన్ 5

సీ. చెదరిన కురులను చిక్కుఁ దీసె నొకర్తు
వాసన నూనెలఁ బూసె నొకర్తు
సవరైన పూసరుల్ జడముడిచె నొకర్తు
తిలకంబు నొసటను దిద్దె నొకర్తు
వెలగల సొమ్ములు గళమున నిడె నొకర్తు
కుచముల కస్తురిఁ గూర్చె నొకర్తు
జిలుగు పావడ ఱైక నలవరించె నొకర్తు
కనుదోయిఁ గాటుక నునిచె నొకర్తు

తే. రమణ మీఱంగ నొకర్తు పారాణి రమ్య
చరణ యుగళంబునకు వెట్టె చాన యొకర్తు
వలదు వలదన్న మానక వరుస నెంచి
చెక్కిటను గాటుకను దెచ్చి చుక్క వెట్టె 6

వ. అచ్చటఁ జిత్రాశ్వుండును మంగళ స్నాతుండై వివిధాలంకార భూషితుండై పరిణయంపు గడియ కొఱ కెదురు సూచుచుండె నంత

తే. బంధుమిత్ర పురోహిత భటసమూహ
మనుసరింపఁగ వాద్యనిస్వనము లెగయఁ
బెండ్లి పందిరి కరుదెంచె వేడుకలర
భార్యతోఁగూడి యంత నశ్వపతి వేగ 8

తే. అంధ దంపతు లట నుండి యాత్మసుతుని
సాయమున నచ్చటికి రాగ సత్వరమున
వేదవిధి నెంచి విప్రులు పెండ్లిపీట
లందు నూత్న వధూవరు లలరఁ జేసి 9

చ. ఇరువురిమధ్య నీ వఱకు నిట్టులె యడ్డముఁ గల్గియుండె నిం
కిరువురు నట్టి భేదము వహింపక యొక్కటియై మెలంగి కా
పురమును దిద్దుకొండు జగముల్ వినుతింపఁగ నన్న రీతిగాఁ
దెరఁ దొలఁగించి రంత సుదతీ మణు లెల్లను వేడ్క నందగా 10

సీ. ఎంతచక్కనివాఁడె యీ రాజపుత్రుండు
మన కన్యకకుఁ దగు మగఁడె యగును
చక్కదనం బున్నఁ జాలునే సుఖియింప
భాగ్య భోగ్యము లుండ వలదె సుంత
భాగ్య భోగ్యములు శాశ్వత మైనవే పతి
వ్రతలకు దైవంబు భర్తయె గద
యీ మాట సత్యమే యయ్యె మాటాలించి
కుష్ఠువాని సుమతి కోరె పతిగ
తే. ననుచుఁ జూచెడి యమ్మక్క లంతరంగ
మందుఁ గల్గిన భావంబు లాడికొనఁగఁ
దప్ప దీక నీకు నాకు బంధం బటన్న
యటుల బంధించె సతి గళ మందుఁ దాళి 11
క. చలమూని వెనుక తగ్గక
నెలప్రాయపు టాలు మగలు నేర్పు మెఱయఁగాఁ
దలఁ బ్రాలుఁ బోసికొనిరి
సలలిత హస్త ద్వయములు స్పర్శసుఖ మిడఁ 12
మ. శ్రుతి పేయం బొనరించు గానములతో సొంపైన వాద్యాళితో
నతి రాగంబున నిచ్చు కట్నములతో నత్యున్నతాసక్తితో
శతమానం భవ తీతి మంత్రములతో సాహోనినాదంబుతోఁ
జతురత్వం బగు పల్కు సందడులతో సర్వాధికారంబుతో 13
వ. వైవాహికంబు పరిసమాప్తిఁ గావించి గృహంబుఁ బ్రవే
శించు నవసరంబున 14
ఆ. మగని పేరుఁ జెప్పనూ యని కొందఱు
సాలి పేరుఁ జెప్పు మనుచుఁ గొంద
ఱాలు మగలఁ జేరి యట్ల పల్కించిన
వినుచు డెందములను వేడ్కపడిరి 15
ఉ. అవ్వలఁ బంచ భక్ష్య పరమాన్నములుఁ వడియాలుఁ గూరలుఁ
గ్రొవ్విన ఘ్రాణిమాంసమును గోఘృత మప్పడముల్ రహింపఁగా

నవ్వులు పువ్వులై కురియ నారులు వడ్డన సేయ సందఱుర్
బువ్వము బంతులాడుచును భోజనముల్ ముగియించి రింపుగన్ 16

అప్పగింతలు

తే. ఇంక మొదలుగఁ దమబిడ్డ యింటనుండ
దనెడు దుఃఖము మెండయి యంతరంగ
మల్లలాడంగ దంపతు లాత్మపుత్త్రి
నెంచి గాఢముగాఁ గౌఁగిలించుకొనుచు 17

సీ. అది యిది లేదని యాత్మేశునిన్ బల్మి
బాధించు తలఁపులు వలవదమ్మ
యత్తమామలు చీకు లదిఁగాక ముదివార
లని నిరాదరణంబుఁ జనదు తల్లి
కడుపు నింపుకొనంగఁ గందమూలాహులే
గతి యని కుందకు మతినిఁ జిట్టి
యాఁటాడుకొనఁగ భయంకర వన్య స
త్త్వమ్ము లే యని దుఃఖపడకు కూన

తే. భయదకంటక పాషాణపాళి పండు
కొనఁగ నని దిగులును వెట్టుకొనకు పట్టి
కన్న కడుపోట నిటు చెప్పు చున్నవార
మంతియే కాని గోల వీ వనుచుఁ గాదు 18

ఉ. కోరిన భర్త జీవితము కొంచెమె యంచును లోఁదలంకకన్
బారములేని సంసృతిని బంధనలన్ దలఁదూర్చి యుంటి వే
తీఱున రెండువంశముల తేజములన్ వెలయింపఁ జేతువో
భారము నీ బుజంబు పయిఁ బడ్డది నేఁడు మొదల్ కుమారికా 19

గీ. ఏడులు పదాఱు నిన్ను మా హృదయపీఠి
నుంచి ప్రేమామృతమును వర్షించి నేఁడు
వేడి కన్నీటి ధారలతోడి శిరముఁ
దడుపఁబడునంచు నెన్నఁడుఁ దలఁపలేదు 20

తే. చూచుటకుఁ గన్నుదోయి నశ్రువుల నిండెఁ
బల్కు గాద్గదికంబును ప్రబలుచుండెఁ

బాయఁగాఁ బాదములఁ దొట్రుపాటు పండె
నొక్క వడినిఁ గొట్టుకొనుచు నుండె గుండె 21

వ. అని చిత్రాశ్వని దిక్కు మొగంబై 22

సీ. కాలప్రసాదిత కర్మ బద్ధుల మాచు
గడుపఁ గావలె నయ్య కాపురంబు
కాపురమ్మున నెంత కలిగిన నదె దైవ
దత్తంబుగా మదిఁ దలఁపు మయ్య
భార్యను దాసిగాఁ బరిగణింపక యుష్మ
దర్ధాంగ మట్టుల యరయు మయ్య
కలిమి లేములు రెండు కావడి కుండలు
తనువు లుండిన నవి తప్పవయ్య

తే. పెద్దలను గన్న భక్తి సేవింపుమయ్య
మానసమ్మున మమ్ముల మఱువకయ్య
యేమొ చెప్పితి మనినట్టు లెంచకయ్య
యెంతయును బ్రేమ మా బిడ్డ నేలు మయ్య 23

క. నాకుఁ బుత్త్రుఁడు పుత్త్రిక
యీ కోమలి యాటచే వహింపుము ధరణిన్
నీ కేల యితరచింతలు
లోకత్రయ గేయ సత్యలోలుప హృదయా 24

వ. అని పుత్త్రికావియోగక్లేశ మనుభవింప లేకఁ గన్నీరు మున్నీరుగాఁగ బిట్టు విలపించు జననీ జనకులఁ బ్రియవచనంబుల నూరార్చుచుఁ జేల చెఱంగునఁ గంటి నీ ళ్లద్దుచు సావిత్రి యిట్లు వాక్రువ్వఁ దొడంగె 25

సీ. పదుగురు నడచిన బాటయే కద మన
మొగమునఁ బొడిచెనే ప్రొద్దు నేఁడు
అత్తవారింటికి నాఁడుబిడ్డను బంపు
టాచారమే కదా యవనియందు

కలిమి లేములు నొక్క గతి యుండఁబోవన్న
మాటను బొత్తిగా మఱచినారె
వెనుకటి జన్మఁ జేసిన పున్నెములు పండి
హృదయేశునకు జీవ మీయలేవొ

తే. నమ్ముకొనువారి కష్టముల్ వమ్ముసేయ
తల్లి సావిత్రి నీడ విధంబుగాఁగ
జూచుచుండి నా మంగళసూత్రమునకు
హాని రానిచ్చునే దుఃఖ మందవలెనె 26

తే. ఇంత మాత్రమ్మునకె దుఃఖ మేల నమ్మ
యెన్నటికి నైన నిద్ది యున్నదే కదమ్మ
తలచు మీ సేమము నెఱుక వఱుపు మమ్మ
పోయిరావమ్మ మఱువంగఁ బోకు మమ్మ 27

వ. అనుచుఁ బల్కు నప్పు డెరువుఁ దెచ్చుకొనిన ధైర్యంబు నపహరించి మాతాపితృ వియోగంబు పొంగి పొరలి కనుగొలఁకుల నిండి పాఱిన నా వేగంబున కాగలేక నవవధువు రానున్న మహానందంబు మఱచి పూజ్యుల బిట్టుగఁ గౌఁగిలించుకొని నన్ను విడనాఁడి పోకుడు మీరు నిందుండుఁ డని రుద్ధకంఠయై పలుకుచు సోదరుల కన్న నెక్కువ మక్కువం గూడిమాడిన చెలిమికత్తియల నెడఁబాయలేక తడఁబడు కరంబులఁ గ్రుచ్చి యాలింగనం బొనర్చుచు ముద్దులాడుచు నక్క నన్నేమి చేసిపోయెదవు, చెల్లీ మన కవితాగోష్ఠి కింక నంతరాయంబు కల్గినది కదా, లలితా మన మిరువురము నిరంతర పరిశ్రమంబున వృద్ధికిఁ గొని తెచ్చిన సన్న జాజిని నాకుమారుగా గౌరవింపుము, తరళా పొరపొచ్చెము లేక సవ్వడి వినినంత నె రివ్వునవచ్చి యొడిలో నొడలిడి సుఖసుషుప్తి నందెడు హరిణి నేటికి నిండు చూలాలు సుమా ప్రసవించిన వెంటనే నాకుఁ జెప్పి పుచ్చుము, శ్యామలా కోమలాతికోమలమై రస తరంగితమై యపూర్వ కథానకమై యసమాన శేముషీ విశేష సంపాదిత మనోజ్ఞభావ బంధురమైన నీ తెలుగుఁకన్నెయను కావ్యం

బున కుపోద్ఘాతంబు వ్రాయుటకు నాకింకఁ దీరిక యుండదేమొ
యన్యథా మాత్ర మెంచకు మని వచించుచు నెట్టకేలకు వియోగ
భారంబున మందగమనంబునఁ జనుచు మాటిమాటికి వెను
దిరిగి మరల నాశ్లేషం బొనర్చుకొని విలపించు నాత్మజనబంధు
పరివార సంతతిని గొంత దవ్వు సాగనంపి 28

తే. మరలి పర్ణకుటీరంబు దరియఁజొచ్చి
యుత్తమామల పరిచర్య నాత్మభర్త
ప్రణయ సౌఖ్యంపు లీలల ప్రతిదినంబు
తోషితులఁ జేసి తుష్టి నాతోయజాక్షి 29

క. కాపురముఁ జేయఁగఁ
బాపురె యని యచటి జనులు పరమ యతీంద్రుల్
తేపకు వారలఁ బ్రియముం
దోపఁగ దీవింతు రిట్లు దోషవిదూరా 30

శా. వాగర్థంబుల రీతివొల్చి భువనవ్యాపార పారీణులై
రాగద్వేషములన్ హరించు సుజన వ్రాతంపు వాంఛావళిన్
దీర్చల్ సాగఁగఁ జేసి ప్రోచెడి మహాదేవాన్నపూర్ణల్ కృపన్
ద్యాగైశ్వర్యము లిచ్చి దంపతులఁ దారార్కంబుగా నేలుతన్ 31

సీ. నిర్మలాకాశధునీ లలిత తరంగ
తతిఁ దేలు హంస దంపతులవోలె
నవకిసాలయ ఖాదనంబునఁ బంచమ
శ్రుతినిఁ బాడు పిక దంపతులవోలెఁ
గమనీయమౌ శరత్కాలరల కౌముదిఁ జొక్కు
భవ్య చకోర దంపతుల వోలెఁ
బ్రణయ రసోన్మాద పరవశంబున మించి
పలికెడు కీరదంపతులవోలె

తే. స్వాదుమేదుర రతి రసాస్వాదనమున
బరువు లిడెడు కపోత దంపతుల వోలెఁ
గన్నులకుఁ బండు వొనరింపఁ గలుగునట్లు
తిరము జగతిని మీఁదు కాపురము తనరు 32

చ. గొనములఁ బ్రోవు నీదు సతి కూరిమి పెన్నిధి నీదు భర్త పూ
చిన విరజాజి నీ గృహిణి చిందుమరందము నీ విభుండు మో
హాన నవవంశి నీ పడతి యందలినాదము నీ మగం డనర్గ
జననుతి కెక్కి కాపురము సల్పుడు సంతత మేకభావులై 33

సీ. మానినీలోకంబు మర్యాద హెచ్చె నీ
పుట్టుకఁ జేసి యో చిట్టితల్లి
పురుష ప్రపంచంబు పూజింపఁబడియె నీ
పుట్టుకం జేసి యో చిట్టితండ్రి
రతిమన్మథులవోలె నతిలోక సౌందర్య
మరయ మీ యందె కాపురము సేయు
నణుమాత్రమైన సద్గుణసమితికి రెండు
కొలముల యందును గొదువ లేదు
తే. బ్రహ్మ మీ కనుకూల దాంపత్య మొసఁగి
తనరఁ జేసెను బూవునుఁ దావిఁబోలె
రమణ మీఱఅ గృహస్థధర్మంబు నెఱపి
యైహికాముష్మికంబుల నందుఁ డింక 34

తే. కమ్మ పుష్పాళ్ళుగల వసంతమ్మునందు
వీనులకు విందుగాఁ బాడు పికము లటుల
జనులు మీ యశోగీతి నిచ్చలును బాడఁ
గాపురవుఁ బూవుదోటలు కలయఁ బ్రాకు 35

వ. ఏవం విధ సన్నుతాశీర్వాద పరంపరామృత రసార్ద్ర హృదయు
లై చక్కఁగా గింజవట్టిన వరివెన్నుల వలె వినయంబుఁ జూపుచు
నా దంపతులు లక్ష్మీనారాయణుల వోలె నుమా మహేశ్వరుల
పోల్కి వాణీ హిరణ్యగర్భుల క్రియ శచీపురందరుల తేవ రతి
మన్మథుల చందాన సీతారాముల రీతిఁ బొఱపొచ్చెము లేక
నన్యోన్యానురాగంబున సంసార సౌఖ్యంబుల ననుభవించుచుండి రిది
యిట్లుండ నంత నొక్కనాఁడు దండి భుజా దండంబున దండంబు
మెఱయ నిండుకొలు వున్న యవసరంబున శ్రీ నందనందన చరణార

విందామంద నిష్యంద మరంద బిందు బృంద తుందిల మిళిందాయ
మాన మానస సరోజాతుండైన బ్రహ్మాత్మజాతుండు 36

నారదుండు యమునిఁ జూడవచ్చుట

సర్వతః ప్రాసనీసము.

కమలా మనోహర విమలాబ్జ పదయుగ
కమలాసనస్తుత్య సుమశరీర
యమరారి హర జగద్రమణీయ తనుధర
కమనీయ కుంతల విమలచరిత
రమణీశత సహస్ర యమునాతట విహార
యమలినగుణ జాల కమలనయన
సుమశాణ జనక శ్రీరమణీ నివాస హృ
త్సమభావ సంపన్న యమర వినుత

తే. కమలనాభ విలోచనాక్రమితభువన
విమల మానస ద్రౌపదీ సమయరక్ష
కుముద కల్హార పంకజ సుమవితాన
సుమధు మధుర హృదయతత్వ యమృతవదన 37

మాలికా చతుర్విధ కందము

శ్రీరామా నవతనుధర
ధీరా మా నవ రద ప్రముదిత రణ మధునా
శౌ రామానవనుత సుగు
ణారామా నవశుభ చరణ హరసమఘనా 38

గోమూత్రికాబంధకందము

సరసిజ గాత్ర విభూషణ
సురరంజన విజయలోల సుజన విహారా
సరసిజనేత్ర విభూషణ
మురభంజన వినయలోల భుజగవిదూరా 39

కందగీత గర్భచంపక మాలలు

నరసుర పూజితా శుభగుణా వరభూషణ శోభితాంగ వా
నర భరణా హరీ సుచరణా కరిపాలన శుభ్రకీర్తి సుం

దర మురళీధరా కమలనాభ రమాధవ కంజనేత్ర భా
సుర హృదయార్ణవా విజయశోక నివారణ విశ్వరక్షణా! 40

చ. వరకరుణాకరా హరి కృపాకర జ్ఞానవిహార శూర కా
వర దయ తోడ నన్ బతితపావన కేశవ భక్తపోష శ్రీ
ధర మురభంజనా సుగుణ తత్పర మాధవ సుందరాంగ భా
సురహృదయాంబుజా భువన శోభిత కీర్తిద మోహనాంగకా 41

గీర్వాణ పద భూయిష్ఠ సర్వ లఘు కందము

ముని సురనుత మృదు పదయుగ
మనసిజ జనక లలిత కుసుమ విసర రుచిమో
హన శుభగళ యమృతవదన
జననమరణ హరణ భవ గజ మద విదళనా! 42

వ. అని పరిస్తుంపుచు మూర్తీభవించిన భక్తి స్వరూపమో యనన్
దనున్ జేరవచ్చు నారదుని నల్లంతనఁ గని పీఠంబు డిగ్గి యెదు
రేగి సముచిత సత్కారంబు లాచరించి 43

క. మీ పాద స్పర్శంబున
నా పుర మంతయును బావనతఁ గాంచెను స్వా
మీ పలుక వె కృపతో నిట
నే పని వాంఛించినారో యిప్పుడె తీర్తున్ 44

మ. అనుచున్ బల్కిన కాలునిన్ గని సుధాహాసంబు కెమ్మోవిపై
నను నర్తింపఁగఁ బద్మగర్భజుఁడు ప్రాణత్యాగమున్ సేయఁ గ
ల్గిన జీవాళుల పేరులన్ వరుసగా లెక్కింపుమా నేటికిన్
దినముల్ నాలుగు లోపు నందునను బృధ్వీనాథ సంతానముల్ 45

మ. త్వరఁ జూడన్ దగు నయ్య నాకిచట నిల్వన్ రాదు వైకుంఠ మం
దిరమున్ జేరి రమామనోహరుని సాన్నిధ్యంబునన్ నిల్చి కొ
న్నిరహస్యంబుల నేర్వఁగా వలయు ప్రాణి ప్రాణనాశా యనన్
బరికింపంగను జిత్రగుప్తు నట రాఁ బంచెన్ సభాక్షోణికిన్ 46

తే. కవిలె కట్టల సంచిఁ జంకఁ దగిలించి
సంభ్రమంబున జనుదెంచి జమునిఁగాంచి

యేమి సెలవన్న జీవంబు లేరు నాల్గు
దినములకు లోపు విడుతురో తెలుపు మన్న 47

వ. ఆతఁడును గ్రమంబుగ నందఱపేరులఁ బఠించుచుఁ జిత్రాశ్వుని పే రుచ్చరించిన కించిద్దరహాస వదనుండై నారదుండు దండధరా! యఖండ తేజః పరిపూర్ణుండై సత్కార్యాచరణ పరాయణుండై సత్యవంతుండైన సత్యవంతుఁడు నీ చేతఁ జావండు మహాపతివ్రతా శిరోమణియు సావిత్రీ కృపాలోకనప్రసాదిత ప్రభావ శోభితు రాలగు సావిత్రి యతని దండ నుండ ఖండపరశుం డేని నిస్తేజుండగు నన దండ తాడిత దండశూకంబు రీతి మండి పడి దండి పండ్లు పట పటఁ గొఱుకుచుఁ జూచుచుండుమా వేదండగమన యుండఁగనే యాతని గతాసువుఁ జేసెద ననుడు 48

ముక్తపదగ్రస్తకందము
మనుమార్గంబునఁజనుమా
చను మానము పోయి చూచి సత్యమె యనుమా
యనుమాన పడక కనుమా
కనుమాయను వీడి శుభముఁ గని దివి మనుమా 49

క. అని పల్కినఁ బెడచెవి నిడి
గనుమా నా శక్తి యనుచుఁ గాలుఁడు రౌద్రం
బున నొక హస్తంబున గదఁ
గొని వేఱొక హస్త మందుఁ గొని పాశంబుఁ 50

వ. సావిత్రీ మనోహర జీవాకర్షణాయత్తుండై తత్తరంబు వడుచున్న చిత్తంబున ధరణికి లంఘించిన, లంఘించిన తోడనే సుపర్వులు శోకించిరి కిన్నరులు ఖిన్నతఁ జెందిరి తుషితులు దుఃఖమునఁ దోగిరి జలధిసప్తకంబు చలించెఁ గులాచలంబులు కూలెఁ జరా చర పరివృతంబైన సరోజాతాండ భాండంబు గ్రక్కదలె వైవ స్వతుని వామ నేత్రంబు తోడి హస్తంబును వడంకె నిర్ణిమిత్తం బైన యపశకునంబు లెన్నియేనిఁ బొడకట్టె నట్టి యవసరంబున నియ్యవి లోనెంచక భట సహితుండై మహిషాధిష్ఠితుండై ఖేచర

మార్గంబునఁ బయలు వెడలె నిది యిట్లుండ నచ్చట నత్త
మామల పరిచర్య ముగించి ప్రాణేశ్వరుని పదాబ్జంబు లొత్తి నిద్ర
పుచ్చి గీతాపారాయణం బొనరించు చున్న సావిత్రిఁ జేరి
కీరంబు 51

చిలుక సావిత్రికి ద్విరాత్రోపవాస వ్రతం బుపదేశించుట

మ. దినముల్ నాలుగు మాత్రమే మిగిలెఁ గాదే నేటికిన్ నీదు నా
థుని యాయుఃపరిమాణ మెన్న మన మందుల్ దోపదే లెమ్ము దే
విని నర్చింపుము నాదు మంత్రములచే విఘ్నంబు లేకుండఁగన్
దినముల్ మూ డుపవాసముల్ సలిపి యింతీ నీరముల్ గ్రోలకన్

వ. ఇయ్యది భక్తిమెయి నాచరించిన మాంగళ్య సంరక్షణంబును
దూరగమనంబును సత్పురుష సందర్శనంబును సర్వాభీష్టసిద్ధియు
నగు నని యుపదేశించిన సావిత్రియుఁ బెన్నిధిఁ బొడగనిన పేద
వడువున మిక్కిలి సంతసించి మఱునాడు వఱువాతనే తెలివిఁ
గాంచి శుచియై నాఁడు మొదలు దినత్రయంబు నతినిష్ఠతోడ
వ్రతంబు సలిపి యనంతరం బుద్యాపనంబు సెప్పి 53

తే. అత్తమామలకును దన యాత్మభర్త
కును మునీశ్వరులకు వలగొనుచు మ్రొక్కి
పొంగి వారలు దీర్ఘసుమంగలీభ
వ యన దేవీప్రసాదముఁ బంచె నంత 54

శరదాగమనము

వ. వసంతసమయ వికసిత కుసుమవిసర మసృణ మకరంద ధారా
పాన ప్రహృష్టమానస మదబంభర సంతానేంద్రనీలప్రభా జేతృ
భాసమాన మృదుపక్ష సంభవానిల భారగమన సంస్పర్శనా
నందరసానుభవ పులకాంకూర సర్వాంగులై రంగు మిగిలి గ్రీష్మ
కాలశతసహస్రాశ్వ ఖర ఖురోద్ధూత పరాగావృత ద్విశత
సహస్రాశ్వగమన వేగానుకరణ ఝంఝూవాత ప్రచండ తాపాధి
కోష్ణ ప్రతాప సంతప్త సర్వాంగులై చేష్టలు దక్కి వర్షర్తు
వేళా ముహుర్ముహుశ్శ్రవణ కుహర నిర్భేదక గర్జాళి మేనుర

యాతాయాత శంపాలతా సమావృతాజస్ర గాఢధ్వాంత నిరస్త భానుకర కఠోరశిలాపాత కరీంద్ర కరసమాన ధారా విదూరాహోరాత్రుమై చుఱుకుఁదనంబుఁ దఱిగియున్న జనముల మనములు సంతసంబున మల్లడిఁగొన సమశీతోష్ణంబై నిర్మల జలతటాకంబై మందమారుత సంచారంబై కుముదినీ వార ప్రముదిత హేతుభూతంబై కమలినీ సంతాప భాజనంబై విరహిణీ జన మదన తాపాధికంబై సకల ప్రసూన సంతాన వికసిత మనోజ్ఞారణ్యంబై మదబంభర ఝుంకారోద్యానంబై ప్రవిమల మేఘమాలికా విలసిత గగనంబై శరత్కాలంబు వర్షర్తువవలెఁ జిత్రాశ్వుం డంతరించు ననియుఁ దన వలె దివ్యతేజంబున మఱల నుద్దీపించు ననియుఁ దెలుపుటకో యని నట్లు ప్రవేశించె నాఁటి రాత్రి సత్కాలక్షేపంబులఁ దెమల్చి కాల్యకరణీయానంతరంబునఁ బ్రాభాత లక్ష్మి వలె మంటప ముఖంబున నిల్చియున్న యాత్మేశ్వరి నవలోకించి చిత్రాశ్వుండు 55

సత్యవంతుడు సావిత్రి కష్టంబులఁ దలంచి పొగులుట

మ. తొలి జన్మంబున సల్పి నట్టి వ్రతసందోహంబు లెట్టిట్టివో
పలుకన్ జాలను నీ మనోహర పదబ్జ చ్ఛాయలన్ బర్ణశా
లలు నీ లేతకరద్వయంబునఁ దనూలావణ్య రేఖన్ గళ
స్థలమున్ నేత్రములన్ విలాస గరిమన్ సంభావ్యమయ్యెన్ సఖీ 56

మ. వలదంచున్ దలి దండ్రు లేక మగుచున్ వాక్రుచ్చినన్ సుంత భీ
తిలఁగాఁ బోకయ నన్ వరించితివి యింతీ! యేమి కాంక్షించితో
ఫల పత్రాదులు కందమూలములు దర్భలన్ వేళ్లఁ గెంజాయగు
డ్డలు లభ్యంబులు కావటంచు నను గూడన్ గోరిన ట్లెంచెదన్ 57

శా. శ్రీమన్నాథాన్వయమందుఁ బుట్టి విమలంబై నవ్య సౌందర్య నా
నానేకామల పుష్ప గుచ్ఛ కలితానంత ప్రకాశ ప్రభా
ధీనంబై వెలుఁగొందు తల్పమున మేల్ తీయమ్ములన్ నెచ్చెలుల్
వీణానాదము సేయఁ బండెడి సుఖాబ్ధి నేటి కిట్లైతి వే 58

ఉ. కోరినయట్లఁ గూర్చె ననుకో మన కో చెలి యంతమాత్రనే
తీఱెనె సౌఖ్యవాంఛ తగదే వగఁ దేలుట పాడియౌనె యీ

దారుణ మానివృత్తి సరదా పరదారలు రాజ్యలక్ష్మి నిం
పాఱఁగ నిట్టులుండ మురువా కరవా జగ మందు రాసుతుల్ 59
వ. అని యీ ప్రకారంబుగ నిజసుందరి చందంబు డెందంబునఁ దలంచి
కుందు కాంతు నాలోకించి సావిత్రి యిట్లు పలుకఁ దొడంగె 60
చ. భువనము లిన్నిమాఱులుగఁ బుట్టి నశింపుచు నుండ నింక మా
నవులు చిరాయురున్నతు లనారత మొంది సుఖింతురే మనో
ధవ యెవి శాశ్వతంబులు ముదంబున మీరలు నన్నుఁ జూచి నా
కవు సుఖదుఃఖముల్ గనిన నంతియె చాలును వేయునేయకన్ 61
మ. మిముఁ బెండ్లాడిన కష్టముల్ కలిగి లక్ష్మీనాథు నొందఁగ వరిం
ప మహావైభవరాజిఁ గల్గి సుఖియింపఁ గూడునే యొక్కసా
రి మొగంబందున నట్లు వ్రాసి మఱి వారింపంగ సాధ్యంబె స్వా
మి మనోవేదనఁ బొంది కుందఁ దగునే మీ కన్న నే నెక్కుఁడే 62
వ. అని పలికిన పలుకులు వీనులకుఁ దేనెసోనలై యానందంబు సంధిం
చిన భూనాయక తనూజుండు వనీసందర్శన కుతూహలాయత్త
చిత్తుండై పోయి వచ్చెదననుడు 63
ఉ. అంతకు మున్నె చెల్వనకు నాయువు మూడుదినంబు లుండె నం
చెంతయు నన్నపానముల నేనియు ముట్టక నిష్ఠతో దినం
బంతయు నీశ్వరీ మృదుపదాంబురుహద్వయచింతనామృత
స్వాంతముగాఁ ద్ర్యహర్నిశలుఁ బాయని భక్తిని సల్పియుంటచే 64
ఉ. కాంతుని నొంటిగా నడవిఁ గాంచుట కట్టులు పంపలేక వా
సంత నరేంద్ర మోహన భుజా కిలికించిత రంజిత ప్రసూ
నాంతర మాధురీ మధు మదాళి ముఖోత్థరవానుకారి సం
భ్రాంత మనోజ్ఞ వాక్యములఁ బల్కఁగఁ జొచ్చెను నమ్రభావయై
చ. వనముల కేగి మీ రెటులఁ బర్ణములఁ ఫలముల్ కుశాదు లిం
ధనములు సేకరించెదరొ దాపున నుండి కనుంగొనంగ నా
మనమునఁ గోర్కెపుట్టెఁ గొఱమాలిన కోరికఁ గోరెనంచు లోఁ
గినుక వహింపఁ బోవకుఁడు కేల్లవ మోడ్చెద ప్రాణవల్లభా! 66
వ. అని ప్రార్థించిన యర్ధాంగి పలుకుల కులికి 67

తే. మూఁడహర్నిశ లుపవాసమునను బడలి
యొంత చెప్పిన వినక తదేకదీక్ష
జలము నేనియుఁ గొన కున్న చాన వేడ 68
భయద గహన సందర్శన వాంఛ యేడ

సీ. కఠిన కంటక శిలా కలితమై దారులు
కత్తులు వఱచిన కరణి నుండు
కను గల్గి నడచినఁ గబళించు మృగములు
తస్కర చయము చందాన నుండు
ఘోరవిషాహులఁ గూడి వల్మీకముల్
మధులిప్త శస్త్రాళి విధిని నుండు
బండలో యన నొప్పు కొండచిల్వలగుంపు
మేకవన్నె పులుల వీక నుండు

తే. సతత మందున వసియింత్రు సవరజాతి
చెంచులును గోయలును భిల్ల సంచయంబు
కాలు కదపంగ భయ మిడు కాననంబు
నతివ నీ తోడఁ బోవ భావ్యంబె చెపుమ 69

వ. వలదు నీ యునికికిఁ దగిన కోరిక యగునె నేటికి మాను మెప్పు డైనఁ జనవచ్చు నన్న మనోహరుని చరణంబుల వ్రాలి నా ముద్దు చెల్లింపఁ దగదె దేహశ్రమంబు సుంతయేని లేదు మీ పరిశ్రమం బునకుఁ జేయూత నగుదు నన్న లేమఁ గొని చనుచు నెడ నెడఁ బొడగట్టు వింతల విశేషంబుల వినికిడిఁ జేయుచుఁ బోయి పోయి చిత్రాశ్వుండు సావిత్రి నుద్దేశించి

సావిత్రీ సత్యవంతులు వనంబున కేగుట

చ. ఇదియె నిరంతరంబు మన యింటికిఁ గాదగు పత్రపుష్పముల్
మొదలగు వస్తుజాలమును పొంపిరివోవ గ్రహించు కాననం
బిదియె యనేక జీవులకు దృష్ణ నడంచు సరోవరంబు పో
వుద మిటఁ బోవఁగాఁ దగదు పోయిన వచ్చుట లేదు కామినీ 71

చ. కనఁబడు వృక్షరాజమునఁ గాదగు పర్ణములన్ ఫలంబు లిం
ధనములు లభ్య మయ్యెడిని దాపుననే వసియించి చూడు దా
నిని నెటు లేను బ్రాకెదనొ నేర్పున మానిని యింక మీదటన్
మన కెడబాటు కల్గు క్షణమాత్రము లోపల నెట్లు సైచెదో 72

చ. పొగులకు మీ విపత్తునకుఁ బోయెద నీ విట నిల్చియుండు 'మో
మగువ తరింపఁ జెల్లునె యుమాపతి కేనియు ధాత వ్రాతలన్
మగఁటిమి గల్గియుండి' యని మాటల మాటికి మంగళం బెసం
గఁగ వచియింప లోఁదలఁకి కన్నుల నశ్రులు జాలువాఱఁగా 73

మ. ఇటు లశ్లీల పరంపరల్ గురియఁగా నేలా మనోనాథ దు
ర్ఘట కార్యంబులు సైతమున్ దమ వచో గాఢ ప్రభావఁబు చెం
గట నిర్మూలము లౌను గాదె తలఁపంగా దీన భావంబుఁ బొం
దుట ధర్మంబె యముండె వచ్చు నెడ లేదో సత్య మాసన్నమై 74

వ. అనుచు విలపించు గృహిణి నాలింగన మొనర్చి చెక్కు ముద్దుఁగొని యిప్పుడె వత్తు నని పల్కుచు భూమీరుహంబున్ జేరఁ బోయి హస్తగత పరశువుచేఁ దచ్ఛాఖ నొక్కదాని ఛేదించి శకలంబుల నొక్కచోఁ జేర్చుచు నాత్మేశ్వరి! సావిత్రి! భరింపలేని శిరోవేదన యావిర్భవించె నింక జీవించుట యసాధ్యం బని యాక్రోశించి ధరణి నొఱగిన చిత్రాశ్వునిన్ దరిసి తదీయ మస్తమంకంబు నందిడి 75

సావిత్రి పతి పాటునకు చింతించుట

చ. వలవ దటంచుఁ బల్కు గురు బంధు జనంబుల ధిక్కరించి కే
వలమును దిక్కు నీవె యని భావమునన్ దలపోసి యుంటినే
చెలువుఁడ! యట్టి నన్నిటుల శీఘ్రముగా విడిపోవఁ జెల్లునే
పలుక వదేల నా హృదయ భారము దీర్ప వదేల కోపమా 76

చ. తొలకరి శంపవోలె సిరితొయ్యలి చేతి సుమంబు నూడ్కి వ్రా
తల మెకిమీని చెల్వొ సతతంబును మీ కెడు వీణ వోల్కి తద్
జ్ఞుల హృదయంబు లట్ల మధుసూదను చక్రము రీతి నెప్పుడున్
గళ కళ లాడుచున్న మన కాపుర మా విధి కన్నుఁ గుట్టెనే 77

మ. తరుణీ కష్ట వనాంత వాసముల చేతన్ జీవితం బెల్ల ని
ష్ఠుర సంతాప పరంపరా మిళితమై శుష్కించుచుండెన్ బర
స్పర సౌఖ్యార్ణవవీచికావిహరణ వ్యాపార దూరస్థమై
యరరే యుంచును దుఃఖమొందు ప్రణయం బాత్మేశ్వరా దాచితే 78

చ. అతులిత వేగమొప్పఁగ నహంకృతిఁ బైఁబడ రాగ నీ వయా
చితముగ బెబ్బులిన్ దునిమి చిత్తము స్వాస్థ్యము గూర్చితే మనః
పతి యిపు డట్లు కాక కయిపట్టిన మైదువ నోచు వేడ స
మ్మతిఁ గన కేల యర్థిజన మానస రంజన! మాను దీమెడన్ 79

మ. కలలో సైతము నీదు పాదయుగళీ కంజాతముల్ నా మదిన్
నిలువన్ జేసి నిరంతరంబుఁ దమి ధ్యానింపంగ న న్మెచ్చుచున్
గలలో దర్శన మిచ్చి నీ మనము లోనన్ నిల్చియున్నట్టి కో
మలదేహాండుచిరాయువొందు నను దంబా యద్దియేమయ్యెడిన్ 80

ఉ. నమ్మిన వారి కష్టముల నాశ మొనర్చెద వంచు నిన్ను నే
నమ్మి భజించుచుంటినె యనారతమున్ బతి జీవరక్షకై
వమ్మొనరించుదే యిటుల వాంఛిత మెల్లను నీవె యిట్లుఁగాఁ
గిమ్మన కుండ నున్న దిలకించెడు వా రెవరంబ పృథ్విలో 81

శా. నా మాంగళ్యము దూరముం బొనరుపన్ న్యాయంబె తల్లీ! భవా
నీ! మూఢాత్ముఁడు నిన్ను లోఁదలఁప వానిన్ బ్రోచి తద్దుర్గుణ
స్తోమంబుల్ హరియింతు వంట సత మెంతో భక్తి నర్చించు వా
రే మాడ్కిన్ భవ వీచికా వితతిలోఁ నీదంగ నౌఁ జెప్పుమా 82

వ. అని కంటనీరు కాల్వలై ప్రవహింప దైన్యంబు తనువొందినట్లు
శోకంబురూపంబుఁ గైకొనిన చందాన విలపించుచు సావిత్రి
కట్టెదుర 83

సావిత్రి యముని దర్శించుట

మ. కరమున్ రోష కషాయనేత్ర భయదాకారున్ దిగంతోజ్జ్వల
త్ఖరదంష్ట్రా వికట ప్రభావృతు మహాకాలాఖ్యపాశాంకిత
స్ఫుర దుద్వేల కరాంబుజున్ బటుతర ప్రోన్నీల మేఘచ్ఛటా
వర కేశ ప్రచలద్భుజస్థలు మహా పాపఘ్ను వైవస్వతున్ 84

క. కని యేతద్భీకరునిం
మనమందునఁ బెక్కు గతుల మథనపడుచు మా
నిని ధైర్యంబునఁ దుద కిటు
వినయంబునఁ బల్కఁ జొచ్చె విమల ఫణితిన్ 85

సీ. అయ్య యెవ్వరు మీర లనదనై విలపించు
నను బ్రోవ వచ్చితి రని తలంతు
నాత్మేశుఁ డనివార్య మైన శిరోవేద
ననుఁ బొంది నను దుఃఖముననుముంచె
మిముఁ జూచిన కొలంది శ్రమ తగ్గుచుండుట
దైవాంశజు లటన్న తలఁపు వుట్టె
తమ రెఱుంగనివి లోకములందు నుండవు
దయచేసి భర్త వేదనను వాప
తే. మందునో మాకునో తెల్పి మామక హృద
యమున కించుక శాంతిని నలవఱుపుము
ఆర్తజన రక్షణము పుణ్యావర్తనులకుఁ
దప్పనిది యంచు మీకు నేఁ జెప్పవలెనె 86

వ. అని శారద పూర్ణిమా శశాంకతరుణ కిరణ విజయ ప్రభాకలితంబు లగు పలుకుల నాడిన విని పితృపతి డెందంబున మిక్కిలి సంతసించి యహో యేమి యీ పతివ్రత ప్రభావ మనితర దుర్లభంబైన నా తేజం బీయమ యెట్లు దర్శించె నిట్లు గావుననే త్రిలోకగమ నుండు నా తోడఁ బండెంబుఁ జఱచె నని యాశ్చర్య రస నిమ గ్నుండై 87

మ. నవలా నీవు మహా పతివ్రతవు కానన్ శక్తి దర్శించినా
వు వచోమాధురి ముంచినావు పరు లెవ్వర్న్ జూడఁగా రాని నా
దవురూపంబును నా హృదంతరము సత్యంబున్ క్షమాధర్మముల్
దివిఁ బాటించుచు నుంచు ధర్ముఁ డనఁగా దేవాళిలో మేటినై 88

తే. పడఁతి నేను నీ పతి శిరోబాధఁ బాప
వచ్చినట్టి వాఁడను గాను ప్రాణములను

బాప వచ్చినవాఁడను వగపు డించి
యుత్తమామల కెఱిఁగింప నరుగు మింక 89

క. అని పల్కిన దండధరు వ
చనముల కులికిపడి హృదయజలజము వాడన్
మను ధర్మ సూత్ర పథములఁ
జనుచుండిన మిమ్ముఁ బొగడ సాధ్యమె నాకున్ 90

క. పతియే దైవముకాదే
సతికిఁ బరస్పరముఁ బాయఁ జనునే త్రిజగ
న్నుత నను నీ పాశమునన్
గతాసువుగ నొనరిఁచి శుభగతి మనుము దివిన్ 91

గీ. మీ యెఱుంగని ధర్మముల్ మే మెఱింగి
పల్కఁ జాలుదుమే ప్రేత పతి! యథోచి
తముగ నాడుచు నుండు పెద్దల నుడువుల
ననుసరించి వచించితి నంతె కాని 92

తే. గొప్పవారల కేని నగోచర మగు
మీ స్వరూపముఁ గాంచిన మెలత కెటుల
భర్తృ యోగము లేకుండు భవ్యరూప!
సజ్జనులు దుఃఖమును గూర్చి చనిరె యెపుడు 93

చ. త్రిభువన కంటకంబుగఁ జరించిన దుష్టులు సైత మాత్మలో
ని భయము చేత నొక్కపరి నీవె శరణ్యము నాగఁ బ్రేమతో
నభయ మొసంగి కాతురుగదా మిము బోటులు ధర్మమూర్తి నా
యభిమత మిట్లు శూన్యతమమై నశియించునె పెంపు వొందకన్ 94

వ. అని యంజలిం బట్టి సాశ్రుజల నేత్రయై ప్రార్థించు సావిత్రిం
గనుంగొని 95

మ. అతివా దాఁపగ నేల నీ పతికిఁ బ్రాణాసన్న కాలంబు నీ
పతి ధన్యాత్మవు కాన దర్శనము నీయంజాలితిన్ భర్తృ జీ
విత వాంఛన్ విడనాడి కోరికొనుమా వేఱొక్కదానిన్ బతి
వ్రత లర్థించినఁ గాదు కూడ దనఁగా రా దేరికిన్ బృథ్విలో 96

ఉ. వచ్చినవారు రా రనెడి సామెత నీవ యెఱింగియుండి న
న్నిచ్చట నిల్పు చింత తగునే యెప్పుడైనను జూచియుంటివే
మచ్చున కైన నొక్కరిని మానిని యన్నను కేలు మోడ్చి యో
సచ్చరితా పతివ్రత విచారమునన్ బడి యొండు కోరునే 97

ఉ. ఇచ్చెద నన్నఁ గాదనఁగ నేలను పుణ్యుఁడ నేత్రహీనులై
ముచ్చట ముద్దు లేక ముని ముఖ్యులె తోడుగ నత్తమామ లా
పచ్చనిరాజ్య పాలనముఁ బాసి వసింతురు కాననంబు నం
దిచ్చిన నేత్రదృష్టియు మహీపరిపాలన నీయుమా కృపన్ 98

వ. అనిన 99

క. నీ కోరిన యటు లిచ్చితి
నో కోమలి! యింక నిచట నుండుమ యనఁగా
నా కాలునిఁ గని భక్తినిఁ
రాకాపూర్ణేందువదన రహి నిట్లనియెన్ 100

వ. అర్ధభాగ మాత్రోపలబ్ధ వాంఛిత నొసర్చి చనుట నాయంబె
యస్మత్ప్రార్థన మన్నింపఁదగదె యన్న జీవపాలనుండు నీ కోరిన
యర్థంబు వ్యర్థంబు గాక సార్థకంబు గా నేర దని యంతర్ధానంబు
నొందుటయు సావిత్రి మనోవారాశి నూహావీచికలు కొండొకతడవు
విజృంభింప స్వకీయార్చనా పరి తుష్టాంతరంగ యగు గంగా
సపత్ని నెంచి భర్తృ దేహంబు నొక్కచో భద్రపఱచి 101

మ. కరుణా హీన మనస్కుఁడై బలిమినిన్ గాలుండు నా నాథునిన్
బరలోకంబును జేర్పఁ బాశమున జీవంబున్ నిరోధించి యం
బరమార్గంబునఁ బోవుచుండె నయయో బ్రహ్మాండ సంరక్షణీ
తెరవున్ జూపఁగ రావె నీ వలన గాదే భర్త నే నొందుటల్ 102

వ. అని ముకుళిత నయనాంబురుహయై వినుతించు చున్నంత నప్రతి
హతంబు నస్య దుర్లభంబు నగు నొక్క మహాశక్తి యాత్మం
బ్రవేశింప నద్దాని సాహాయ్యంబునఁ బతిపతి యెన్నంటి నీడ విధం
బుగఁ జనుచు నెలుంగెత్తి 103

మ. ఇది యే న్యాయము ధర్మమార్గచర! భర్తృప్రాణముల్ గొంచుఁబో
వ దయాహీనత, మాట లేడొరులతోఁ బల్కంగఁ జుట్టంబు ల
య్యెద రం చాడుదు రట్లుగాకఁ దమతో నే నెన్నియో పల్కు లిం
పు దలిర్పన్ వచియించియుండఁ దగ్గదే మోమోటముల్ బూనగా

తే. ఈ స్వరూపముతో నెట్టు లింటి కరిగి
యత్తమామల నీక్షింతు నయ్య నెట్లు
దర్శనము సేతుఁ దలఁపు మో ధర్మనిలయ
రెండు కొలములు వెనువెంట మండిపోవె? 105

తే. ఏకపుత్త్రికా విషయంబు నేకపుత్త్రి
విషయముగఁ దండ్రి మామ జీవితములు సత
తమును మా పయి నిల్పుదు రమల హృదయ
వారు సంతోష పడునట్టి పథముఁ జూపు 106

క. అని యర్థించెడి సావి
త్రిన్నిఁ గన్నారంగఁ గాంచి దీర్ఘక్రోధం
బున రాఁదగ దన్న వినక
వనితా దుర్మార్గ మనక వచ్చుట తగునే 107

ఉ. ఊరక వచ్చిపోవు టది యుక్తము కాదని యెంచి కాదె నీ
కోరిన కోర్కె లిచ్చితిని కోమలి యిఁకను దృప్తినొంద కీ
తీఱున వెంట రాఁదగునె దివ్యులు సైత మెఱుంగరాని యి
ద్దారిని రాఁదలంచుట వృథా యని యెంచుము డెందమందునన్

తే. ఘోర మృగజాతి రవము గగ్గోలువఱుపఁ
గర్కశశిలాన్వితముగ మార్గములు వెలయ
సాంద్ర భూరుహ సంతతి చదల నంటి
యంధకారంబుఁ గల్పింప నడవు లొప్పు 109

తే. మింటికిన్ మంటి కేకమై మిట్టపల్ల
ములను నిబిడీకృతంబయి పొలసుదిండి
కొలము నఱపులఁ దెలివిఁ బోఁగొట్టఁ జాలి
పార మెఱుఁగని పర్వత పంక్తి యొప్పు 110

వ. ఇంక పైన మఱియు పథంబు దుర్గమంబు వెనుదిరిగి చను మని
యంతకుండు పోవ నుండ 111

తే. అననుకూలంబుగా నుండి నంత ప్రాణ
పతిని విడనాడి యనుకూల పథమె యైన
హితముఁ జూప నెంచుట పతివ్రతల కగునె
భర్త నొసఁగెడు దాక మీ పథమె నాకు 112

వ. అని సవినయంబుగ వేడుచున్న సావిత్రి కోర్కె మరల్పం జూ
చియు విఫల మనోరథుండై యింక నొక్క వరంబుఁ గోరు
మయ్యాది భర్తృప్రాణ సంరక్షణంబు గాకుండవలయు నన్న
దేవ యన్యంబు వాంఛించుట కులాంగనలకున్ గూడునె మఱియు
నితరంబుఁ గోరుట తనకు మాలిన ధర్మంబును మొదలు చెడ్డ
బేరంబువలె నుండు నపుత్రికుఁడై విలపించు నా తండ్రి విషయమై
సుంతయైనఁ జింతింప నట్టి నే నొండు వేడుట కల్ల యన్నఁ గాలుండును
నీ తండ్రిసత్సుతశతంబుఁ గలిగి సుఖంబుండుదీనఁ బరితుష్టి నొందుమని
యగోచరుండై స్వకీయ మాయా పరి కల్పిత గాఢధ్వాంతమయ
చతుర్దశ భువనుండై నిజపురాభిముఖుండై చనుచుండ సావిత్రియు
నధైర్యంబు వడక యయాచితముగ వరం బొసంగిన వైవస్వతుండు
గతాసుండైన మద్హృదయనాథుఁ బునర్జీవితునిగ నొనర్పకుండునె
యని మార్గ పరిశీలనంబుఁ గావించి హా తాశమై 113

తే. ఎందుఁ బోయెద నే గతి యేది దారి
యంధకారంబు జగముల నాక్రమించి
మిన్ను మన్నేక మొనరించు చున్న దిప్పు
డన్యథా శరణం నాస్తి యంబ నాకు 114

తే. అనుచు వేడిన తోడనే యఖిల జగము
కాంతిమయ మాచుఁ దనకు మార్గంబుఁ జూప
వడివడిగ నేగి పథిఁ బ్రేత పతిని దరిసి
నాదు కోరిక మన్నింపవా దయాత్మ! 115

క. ఈ విధి నిర్దయఁ బూనిన
నే విధి మా యట్టి యల్పు లిష్టార్థమ్ముల్
కై వస మొనరింపఁగలా
రో వే పల్కుడన ధర్మ్మఁ డోరిమి ననియెన్. 116

ఉ. చచ్చిన వారికై యిటు విచారము సెందుట పాడి యౌనె యీ
సచ్చరితుండు నిత్యమును సత్యముఁ దప్పక జన్మ మాదిగా
హెచ్చుగఁ దల్లిదండ్రులకు నింపు దలిర్ప మెలంగి దేవత
ల్మెచ్చగ జీవితంబు వదలెన్ సతి యుత్తమ లోక మందఁగన్ 117

శా. తల్లీ సద్గుణకల్పవల్లి యిటు గాత్రంబెల్ల నల్లాడఁగా
ఫుల్లాంభోజ దళ ప్రకాశ నయనమ్ముల్ కెంపునుం దాల్పఁగా
వల్లీసన్నిభ హస్తయుగ్మమున కైర్వాలంగ నెమ్మోము న
శ్రుల్లావై కురియంగ దీనమతివై శోకింపఁగాఁ జెల్లునే! 118

వ. వెండియు జీవులు నిరంతరం బొనరించు పాపపుణ్యానుసరణంబుగా మాచే శిక్షాసత్కారంబుల గ్రహింపుచుండుదు రందునఁ జేసి ధర్మ్మండనఁ బరగితి నవసానకాలంబు గుఱుతెఱుఁగుచు వర్తించు చుండుటఁ గాలుండనా నొప్పితి సర్వ సర్వంసహా జీవాళి నంత మొందించుటఁ నంతకుండనై యన్వర్థనాముఁడ నైతి మఱియు స్థూలదేహంబునఁ బరగు ప్రతిజీవియు విధినిర్ణయంబునకు బద్ధమై యుండు నందువలన నీ హృదయేశ్వరుని యసువుల నిడ నే నసమర్థుండ మద్వచనంబుల నిరాకరించి రాఁదగదు. నీవు సాధ్వీశిరోమకుటమాణిక్యంబ వగుట నింతవట్టు వెన్నంటఁ జాలితి వీక్షఁ బైన

తే. పర్ణముల గుంపునుఁ జూచి ప్రాణికోట్లఁ
నంత మొందించి క్రోశద్వయంబువఱకు
నస్థి సంతాన గర్భమై యనవరతము
ఘనతతో నొప్పు నసిపత్రవనము నాఁగ. 120

క. మానవ దేహముతో న
ద్దానినిఁ దరియంగరాదు తన్వీ యటుపైఁ

గానఁబడుచున్న నది గను
దాని చరిత్రంబుఁ దెలిపెదను విను మింకన్ 121
సీ. చీము నెత్తురుతోడఁ జిక్కనై పాఱుచుఁ
బెన్నీటి మెకముల విడిది యగుచు
బహులోర్మిఘట్టితాభ్ర ప్రాభవం బౌచు
దర్శితావర్త పాతాళ మగుచుఁ
బర్వతభూమిజ పతనవేగం బౌచు
నిర్జితబడబాగ్ని నిలయ మగుచు
సంవర్త సమయ సంజనితాంబుధర జాల
మేదురాశనిపాత నాద మగుచు
తే. కఠిన దంష్ట్రా కరాళవక్త్ర ప్రయుక్త
దానవానీక సంచార తటము నగుచు
రహితపుణ్యాత్మ తతికి దుర్ధర్ష మగుచుఁ
దనరుచుండును సతము వైతరణినాగ 122
వ. నిజమరణ కర్మ సమయంబున గోదానం బీక యున్న నా ప్రేత
మేతన్నదీతరణం బొనర్పఁజాలక యనేక మన్వంతరంబు లందుఁ
ద్రెళ్లి ఘోర బాధాపరితప్త సూక్ష్మదేహియై నశించు నటుమీఁద
క. పాపాత్మ దుర్లభంబై
తాపానల దగ్ధజీవితావాసంబై
నా పురి సంయమి యనఁగా
నేపాఱుచు నెపుడుఁ దనరు నింతీ వినుమా 123
చ. బ్రతికిన వారు నా నగరి బాధల నంది కృశింపు జీవసం
తతినిఁ గనంగరాదు నెలఁతా తలి దండ్రుల బంధు బృందమున్
హితులనుఁ బొట్టకోస మయి హీనముగాఁ బలుకాడునట్టి కు
త్సితులను బల్మి నాలుకలఁ జీల్తురు కూయిడుచుండ మద్భటుల్
సీ. కూటసాక్ష్యంబులఁ గొంకులేక పలుకు
మోటకు మానిసి ఫణుల్ కటువ మొఱుగ
భ్రూణహత్య నొనర్ప బుద్ధి జంకక యున్న
పోలతి కత్తులఁ జీల్పఁ బొగులుచుండుఁ

గొంపలఁ గాల్పంగఁ బంపఁ బ్రయత్నించు
జడుఁడు నాలుకఁ గోయ నడలి యేడ్చు
వావివరుసలేక వర్తించుచుండిన
ఖలులు నిప్పులఁ ద్రోయఁ గ్రాగుచుంద్రు
తే. తరుణి యింక ననేక విధాల నొప్పి
చెప్ప శక్యంబుగా కుండు నిప్పు డటకుఁ
జేరఁబోయెడు సన్నిపు చేరరాదు
త్వరిత గతిఁ గనఁబోవమ్మ పర్ణశాల 125
వ. అని ప్రేతపతి యంతర్ధానంబు నొంది నగరిఁ బ్రవేశించి కోట తలుపులు మూయించి యంతిపురిఁ జొచ్చి నిజపత్నితోడ సరస సల్లాపంబుల నాడుచు నెడనెడ నారద వచనంబును దనప్రతిజ్ఞా నిర్వాహణంబును సావిత్రీ పాతివ్రత్య ప్రశంసయును వినికిడిఁ జేయుచుండె నింక నిక్కడ నశ్వపతిసుత ప్రభాకరకుమారుఁ గానక మిక్కుటంబగు సంతాపంబునఁ బొక్కుచు నెట్లు వైతరణిఁ దరింతు నెట్లసిపత్రవనంబు దాటుదు నెట్లు శ్రాద్ధదేవు దర్శింతు నే క్రియ నాథుఁ బడయుదు నని సావిత్రిని హృదయపీఠాధిష్ఠితం జేసి
తే. తల్లి నీ దయవల్ల నింతవఱ కెటులొ
రాఁ గలిగి తింకమీద మార్గంబునాకుఁ
గానఁగా రాదు కాలుండుఁ గానరాదు
అస్మదిష్టార్థమును బొంద నగునొ యింక 127
వ. అని యేకైక చిత్తంబున నుతించి నంతనే యనేక శతసహస్ర ఘంటారవంబును ధిక్కరించి భూకంప కంపి తాగ్నిపర్వత మూర్ధోద్భూత శిలాశకల ప్రయుక్త కీలా కలాప భయంకరార్భటులఁ దరిమి సప్త పాథస్తరంగ సంఘర్షణావసరావిర్భూత గంభీర ఘోషణంబును బరిహసించి జగద్ధర్మ రక్షణ దీక్షా మహాత్యాగ బంధుర శ్రీ రామచంద్ర ధిక్కృత సీతామాతృ పాతాళ వివర ప్రవేశకాల బంభజ్యమాన భూదేవతా శరీరాణ్వణు సంఘట్టన మహానాదంబును గాదని యొక్క మహారవంబు జనించి దండ

ధరాజ్ఞాబంధిత కవాటంబు శతధా భిన్నంబై ధరణిఁ దొఱంగిన నంతఃపురాంగనానంద విరచిత వాక్య మిళింద మానస పద్మాకరుండగు యమధర్మరాజు చిత్తం బుత్తల పడ దిగులువడి విచారించుచున్న నారకపతిఁ దరిసి భటులు 128

సీ. చరణముల్ మోపిన సలసలఁ గ్రాగెడు
తైలభాండములు శీతలతఁ బొందెఁ
దాఁకు మాత్రనె యనంతము నంట మండెడి
యగ్నికుండములు చల్లాఱిపోయెఁ
బిలిచినమాత్రనే ప్రేతాళి బాధించు
వృశ్చికంబుల గుంపు వెడలిపోయెఁ
గనులఁ జూచిన మాత్రఁ గ్రాగెడు కంబముల్
కపురంపు టనఁటులై గ్రాలఁజొచ్చెఁ

గీ. జేరి పాపుల బల్మి శిక్షించుచుండ
మా బలము సన్నగిలెను క్రమక్రమంబు
నేమి చెప్పుదు మో దొర యిట్టులాట
కొక్క కన్యక యరుదెంచి యున్న దిపుడు 129

గీ. అనిన విని దండి వారల నవలఁ బంపి
వేగమే దర్శనమును సావిత్రి కొసఁగి
యెంత చెప్పినఁ జెవి నిడ కింతి యింత
సాహసాచరణము నూన సరస మగునె 130

గీ. అల్పజీవుండు దీర్ఘాయు వగుట పెద్ద
పులి తపం బొనరించెడి పోల్కి యగును
గోల యీకనైన నా పలు కాలకించి
మగిడి గృహమున కేగుమా వగపు వీడి 131

క. ఈ వెంత శక్తిఁ జూపిన
నీ విధి నెన్నని వేల యేండ్లుండిన నీ
జీవితము ధారవోసిన
నీవిభుఁ బడయంగ లేవు నిజముగ వినుమా 132

క. యముఁడన్న నల్పుఁడని నీ
వుమదిఁ దలఁచితివొ యేమొ పోలతీ తగునే
యముఁడన్న పేరునందే
యిమిడెను నిర్దయుఁ డటంచు నెఱుఁగఁ దగు నీకున్ 133

వ. అని ఖండితంబుగా నాడిన పలుకులాలకించి కనుదోయిఁ గెంపు గదుర దెగువఁదనము మగువ గూపొందిన ట్లశనిపాతఘోషణంబు నిరసించు భీషణాలాపంబుల వైవస్వతుఁ గాంచి 134

శా. నేనే సృష్టిలయాది కారణ మృడానీ దివ్యపాదాంబుజ
ధ్యానైకాత్మన యేని మద్ధృదయ నాథానూన సేవాధురీ
ణానందామృత వీచికా విహరణ వ్యాపార నేర్నిఁ ద్వదీ
యానంతప్రభ తోడ నీ వొడలు బాయం గల్గు దిప్పట్టునన్ 135

వ. అని శాపం బిడఁ బోవునంతలో నతల వితల సుతల రసాతల తలాతల మహాతలాది చతుర్దశ భువనంబు లొక్కపెట్టునఁ గంపించిన దేవానీకమ్ములు నిలువలేక కైలాసంబున కరిగి మాం రక్ష మాం రక్ష యని యెలుగెత్తి యేడ్వ నామెయు జగన్మాత యగుటచే దదార్తారావంబు కర్ణరంధ్రంబుల దూరిన తోడ నిజపతి విరచిత శృంగారచేష్టా కలాపంబులన్ జొక్కిన డెందంబును మగలించి భీతచేతస్కులైన సురలన్ దోడుకొని సావిత్రీ యమధర్మరాజుల మధ్య సాక్షాత్కరించి యోం శాంతి శ్శాంతి యనుచున్న సావిత్రీదేవిం గని యముండు మస్తకన్యస్తహస్తాంజలియై 136

మ. చరమేకాకచరంబుఁ గావఁ గల సత్సామర్థ్య సచ్ఛీలమున్
వర కారుణ్య సుధా తరంగిత మనః పాథోధియున్ ధీవశీ
కరణంబున్ సమభావ చింతనయు నేకంబైన నిన్నన్యథా
శరణం నాస్తి యటంచుఁ గొల్తు జననీ సత్కర్మ సంచారిణీ 137

క. అని భయమున వేడిన శా
లుని భయము నుడుపుచు నరకలోకపతీ యీ

వనితా చూడామణి నే
మనుకొంటివి కలదె వెలితి యామెకు నార్యా 138

ఉ. ఈయమ కోరినట్టి వర మెయ్యది యైనను లోఁదలంపఁ బో
కీయఁగనౌ త్రిమూర్తులకు నేనియుఁ గాదనరాక యెప్పుడున్
గాయమునందె నీమెగ నకల్మష మంతయు నేకరాశియై
యో యమధర్మరాజ యిఁక యోగ్యుఁడవై పతి నిచ్చి పంపుమా

గీ. ఈపె యలిగిన భువనముల్ రూపడంగు
నమృతపానంబుఁ గావించి యమరులైన
వారు సైతము జీవముల్ బాయఁగలరు
కాలచక్రముఁ దలక్రిందుగా దొరలును 140

వ. అని నుడివిన యంబావాక్యంబు లాలకించి సంతుష్టాంతరంగుండై పాశాంతర్గతంబైన సత్యవంతుని యసువులఁ దిగిచి దక్షిణదిశాధిపతి సావిత్రిం గని 141

మ. కొనుమా నీ దగు ప్రాణనాయకుని నీకున్ వీనికిన్ బుత్త్రికుల్
గుణరాసుల్ జనియింత్రు నూఱుగురు ముల్లోకంబు లారా యనన్
గణియింపంగ ననంతమైన క్రతువుల్ గావించు పెక్కేండ్లుఁ దాఁ
గను వర్షంబులు నాల్గు నూఱు లవుదాకన్ నిల్చి వైకుంఠమున్ 142

వ. మఱియు నొక్క దివ్య విమానంబు నిన్నుం గొని గతాసుండైన భవత్పతి సన్నిధానంబున డించు నని యనుగ్రహించిన సావిత్రియు నపరిమితానందంబు నంది ధర్మకర్ముని నిర్మలచిత్తంబున నిట్లు స్తుతించె 143

ఉ. మానవరూప మొందు నొక మానిని వేడిన గొప్పఁ జేసి సు
జ్ఞానులు సైతమున్ బడయఁజాలని యట్టి వరంబు లిచ్చి దుః
ఖానల తప్త మానసము హాయి దలిర్పఁగఁ జేసి నట్టి మి
మ్మేను నుతింపఁ జాలుదునె యెన్ని భవంబుల కైనఁ బుణ్యుఁడా!

వ. ఏత న్నుతితోడ దేవతాశీర్వాదంబు నంది దండి యంతర్హితుండయ్యె ననంతరంబ తొల్త సావిత్రీ దేవికిన్ దరువాత సురానీకంబునకుఁ గ్రమంబుఁ దప్పక నమస్కరించి యమనియుక్త

విమానం బధిష్ఠించి త్రిమూర్తులఁ జయించిన యనసూయ భంగి ద్యోమణి గమనంబు నిరోధించి మించిన సుమతి చందాన నగ్ని పరీక్షయందు నెగ్గి నవ్యాలంకార భూషితయై కుండంబు వెడలి వచ్చెడు సీతాసతి వడువున నిజవిభు సాన్నిధ్యంబుఁ జేరి హస్తకిసలయంబునఁ దట్టి లేపిన సత్యవంతుండును ద్రుల్లిపడి మేల్కని వంశ వర్ధనియైన యర్ధాంగినిఁ గని యొడలు పులకింపఁ గనుల నానందాశ్రులు జల్లున విరియ నాలింగనం బొనర్చి 145

గీ. బల్మి నొక దివ్య పురుషుండు ప్రాణములను
పాశమున లాగి దక్షిణపథము పట్టి
పోవుచుండఁగ నీవును బోయి వెంటఁ
గడకు బ్రదికించి నట్లుగాఁ గలను గంటి 146

క. నిక్కవ మగునే మానిని
తక్కక వచియించు మన్నఁ దగునే నాథా
యిక్కడ నిట్లే మసలిన
నక్కడ మన పెద్దవార లార్తిఁ బడరే 147

క. దారినిఁ జెప్పెద లెండికఁ
జేరఁగవలె పర్ణశాల చీఁకటియు వడెఁ
ఘోరాటవి దాటంగను
తీరని శ్రమ మందవలయు దీర్ఘము పథముఁ 148

గీ. అనుచుఁ బ్రేరేచి భర్తతో నడవి దాటి
గతమునకుఁ గలకుఁ గల సంఘటనగూర్చి
వ్యాఖ్య మొనరింపుచును ద్వరఁ బర్ణశాల
కరిగె సావిత్రి వింటివే ధరణిపాల 149

వ. అన్న శుకయోగీంద్రు నీక్షించి పరీక్షిన్నరేంద్రుండు 150

క. తరువాతి కథ నెఱుంగఁగఁ
ద్వరఁ బుఱెడు దేవమాని వందిత చరణా
కరమున్ మానస మిప్పుడు
దురితాంబుధిఁ బాయు చింతఁ దొట్రిలుచుండఁ 151

వ. అనవుడు ఋషివల్లభుం డిట్లని చెప్పఁ దొడంగె 152

ఆ. కంటిచూపు లంది యింటికి రాకుండఁ
దడవు మసలి పట్టి కొడుకుఁ గోడ
లినిఁ దలంచి దుఃఖమును బొందుచుండిరి
వృద్ధదంపతులు వివేక మెడలి 153

క. కారణము లేక కన్నుల
కీ రీతిని దృష్టి నించి యెంతయు వేడ్కన్
గూరిచిన దైవ మక్కట
దూరం బొనరించెఁ గొడుకతోఁ గోడలినిన్ 154

సీ. ఏ నాఁ డెఱుంగమే యింత కాలము వనం
బందునఁ దడయుట యచట నేమి
కని విన రానట్టి కష్టముల్ సంప్రాప్త
మయ్యెనో యే దారి నరిగి యుండి
రొక్కొ తెల్పెడివార లొక్కరు లేరె యిం
కెట్టుల బ్రదుకుదు మేది మార్గ
మయ్యెయో ముప్పున నల్లాడఁ జేసిన
దుష్కాలమా నీకు దురిత మబ్బ

తే. కుండునే కన్నులకుఁ జూపు లుండి తీర
రాని దుఃఖాబ్ధి మునుఁగక లేని విధమె
యుండి పిల్లలతో సుఖ మొందునట్టు
దనరఁ జేయఁగరాదె యా దైవ మైన 155

వ. అని యెడతెఱపిలేక వచ్చు సంతాపంబున నొడలు మఱచి చర
ణంబులు తడఁబడ గుండెలు తీవ్రవాతాహతిఁ గంపించు భూరు
హంబుల మాడ్కి సంచలనంబు నొంద భార్యాసహితుండై ద్యుమ
త్సేనుండు సన్నిహితమై యున్న పథంబు పట్టి కొడుకును గోడలిని
నుచ్చైస్స్వరంబునన్ బిలుచుచు నందందు నెమకుచుఁ జనుచుండ 156

గీ. అంధకారంబునన్ జీల్చి చవతరించు
శీతకిరణుండు రోహిణి చెలువుఁ దనర

వచ్చు కొడుకుఁ గోడలిఁ గని బాహువులను
జాచి కౌఁగింటిలో నుంచి సంతసమున 157

క. మా ప్రాణము మా మానము
మా ప్రియమును మాదు కీర్తి మా సౌఖ్యంబుల్
మా ప్రభ మా సర్వస్వము
మా ప్రేమము మీ రటంచు మది నెంచుదుమే 158

ఆ. అట్టి మమ్ము నిట్టు లల్లాడఁ జేయంగ
నింతతడవు మసలు టేల మీకు
నేమి చెట్టగలిగి యేమైతిరో యని
హృదయ మగలఁ జొచ్చె నింతవట్టు 159

వ. ఇప్పటికి నేత్రదృష్టి యొదవిన ఫలంబుఁ గంటి మని పలుకు తలిదం
డ్రులకు గత వృత్తాంతమ్ముల్ దెల్పుచు 160

సీ. శార్దూల హరి కిటి చమర కరీంద్రాది
మృగముఖోత్థనినాద మిళితమగుచుఁ
గలిత కంటక వృక్ష కఠిన పాషాణసం
కీర్ణ దుర్గమ పథ కృచ్ఛ్రమగుచు
సకలజీవానీక సంతాపకారణా
లఘువహ్ని కీలా కలాప మగుచు
ఘోర రాక్షస వీరకోటి ప్రకల్పితా
నంత జీవోపద్రవాబ్ధు లగుచు

గీ. హరి తిమి తిమింగిల ఫణి మకర కలిత త
రంగ విలసిత వాహినీ రాజి యగుచు
వెలయుచుండెడు ఘోరాటవులఁ దరించి
నన్ను బ్రదికింప నేర్చె నీ సన్నుతాంగి 161

ఆ. అంత సంతసింప కంతకు బతిమాలి
తమకు నేత్రదృష్టి తండ్రికి సుతు
లలరునట్లు వరము లంది రెండు కుటుంబ
ములను నిలిపెఁ బుణ్యబలము కలిమి 162

తే. ఎంత పొగడిన తీరునే యీమె నంచు
జరిగిన విధాన మంతయు నెఱుకపఱుప
నపరిమిత మైన యానంద మనుభవించి
యదియె పలుమఱుఁ దలఁచి గృహంబుఁ జేర 163

వ. అంతకుఁ బూర్వమె సాళ్వదేశంబు నుండి కొందఱు భటు లరుదెంచి సకుటుంబముగఁ జనుదెంచు చున్న ద్యుమత్సేనుఁ దిలకించి ఫాలంబులు ధరణి సోక మ్రొక్కి లిడి మహారాజ! యేలినవారు పురంబు వీడి నప్పటి నుండి ప్రజాసౌకర్యంబులు పాడైన కతంబున ప్రజాసందోహ ముక్కు మిగిలి చిత్రకేతువును బరాభవించి రాజ్యంబు నుండి తఱిమివైచి మిమ్ముం దోడ్కొని రా మముం బంపి రింక నాలస్యంబు వలవ దదియె రథం బధిష్ఠింపు డని ప్రత్యుత్తరాకాంక్ష నిరీక్షించు నిజభటుల యుల్లంబులు మల్లడిఁగొని సంతసంబు పెల్లుబుక నట్ల యగు గాత మని నగరాభిముఖుం డై కుటుంబముతోఁ జని ప్రజ లొసంగు కృతజ్ఞతాపూర్వకాభివందనంబులఁ బ్రీతిఁగ్రహించి వారలఁ బనిచి మఱునాఁడు వేకువఁ బండితుల రావించి పట్టాభిషేకంబునకుఁ సుముహూర్తంబు పెట్టించి యేతచ్ఛుభదినంబున బాంధవ మిత్ర పురోహితామాత్య సామంతజనంబు బలసి కొలువఁ బుత్త్రిక నభిషేకించి సింహాసనంబునఁ దాను స్వయంబుగఁ గూర్చుండఁ బెట్టి సకల వాద్యధ్వనులతోఁ గరతాళ నాదంబులు మిన్ను ముట్ట మహారాజుం గావించె నా సమయంబున నశ్వపతి బహువిధామూల్య రత్నాంబర హాహన ప్రకరంబు నల్లునకుఁ గానుకగ నొసంగి పుత్త్రికా ప్రభావంబు వేనోళ్లఁ బొగడి 164

క. వలదన్న వినక బిడ్డా
వలచితి వల్పాయుష్కుండు వరుఁ డంచును లో
పల నెఱఁగి యేమి నమ్మిక
కలదో యింతటి యశంబుఁ గాంచఁగ నీకున్ 165

క. నా కోరికఁ జెల్లించితి
వో కూఁతుర కొడుకు లెట్టులో యని సతమున్
జీకాకు వడగ నూర్వుర
నేకంబుగఁ గల్గఁ జేసి తెంతయు వేడ్కన్ 166

వ. అని పుత్త్రికాశీర్షం బాఘ్రాణించి కపోలంబుల ముద్దుఁ గొని స్వగృహంబున కేగెద నమ్మ యని యానందాశ్రులు చింద వియ్యం కుండు వెంటరాఁ బురంబున కరిగె నంత 167

సీ. మనుమార్గమునఁ బ్రజల్ మను మార్గమున్ జూపి
మనువును మఱపించె మనుజవిభుఁడు
జీవనంబులు సదాజీవపాళికి దివ్య
జీవనంబులు జేసె క్షితి విభుండు
ఘనబృంద విరచిత ఘనభావ సంపద
ఘన బృందముల జేసె జన విభుండు
సంతానముల నెల్ల సంతానములఁ జేసి
సంతానముల మీఱె తన్మ్వవిభుండు

తే. అనుచుఁ బ్రజలెల్లఁ గొనియాడ ననవరతముఁ
దల్లిదండ్రుల తోడను ధర్మపత్ని
తోడ ధర్మువుఁ దప్పక యీడులేక
సత్యవంతుఁడు రాజ్య మాసక్తి నడుప 168

క. నెల మూడువర్షములతోఁ
గలకల లాడుచును వృద్ధిఁ గాంచెడు సస్యం
బులతో సత్సౌభాగ్యం
బులతో రాజ్యంబు పెంపు వొందుచు నుండెన్ 169

చ. ఇటు ధరణీతలంబు వహియించుచు నిర్జరు లుల్లసిల్ల మి
క్కుటముగ జన్నముల్ సలిపి క్రోధమనస్కులు గూర్చు దుష్టసం
కటముల మాన్పి, ధర్ముఁ డనఁగాఁ దగి యా పయి నాల్గునూర్గుగాఁ
బటుతర విక్రమస్ఫురణఁ బాలనఁ జేసెను రాజ్యలక్ష్మినిన్ 170

సీ. ఈకథ నెవరేని యింపు దలిర్పంగ
జదివిన వ్రాసిన సకల శుభము
లనుభవించుచు నుందు రా పయి స్వర్గంబు
నంది తాఁగార్కుంబు నమిత సుఖము
బొంది పునర్జన్మ మందు సావిత్రియు
సత్యవంతుల పోల్కి సర్వ కాల
మఱగొఱ లెఱుఁగక యానందమున సఖీ
పుత్త్రిసంయుక్తులై పొలువుఁ గాంతు

తే. రబలలు పఠింప సబలలై యనవరతము
నైదువతనంబు గొఱవడ కలరు చంద్రు
బధిరపంగ్వంధు లిద్దాని పఠనసేయు
వేళ శ్రద్ధగ విని నంత విభవ మబ్బు 171

వ. అని జనమేజయజనకునకు శుకయోగిచంద్రుండు వినిపించిన నాతం
డును శ్రవణపర్వంబుగా నాలకించి వైకుంఠంబు దరిసె 172

ఆశ్వాసాంతము

శా. దక్షధ్వంసి పితృప్రసాదవిభవా! దాతృత్వహృద్భాసితా
ధ్యక్షా! యక్షియుగావలోకన నిమిత్తైశ్వర్యవ ద్యాచకా!
దాక్షిణ్యాకర! నైకవంశ శిశువిద్యాదాన వాః పూర సం
రక్షా! శిక్షితవైరిపుంజ ధిషణా! ప్రజ్ఞానపాథోనిధీ 173

క. విద్వన్నుతవర గుణసం
పద్విభవా! రూపవిజితపంచశరా! రా
జద్వనజసమవదన! త్రిజ
గద్వల్లభ చరణ వినుత! కరుణావార్ధీ 174

## గద్య

ఇది శ్రీ ప్రసన్నాంజనేయ మహామంత్రోపాసనా జనిత మృదుమధుర
మధురపదభరిత చతుర్విధానవద్య కవిత్వధారా సుధాపూరసుహృ
జ్జనచరణసేవా నిరంత రాపస్తంబ సూత్ర భారద్వాజస గోత్రపవిత్ర
కోటాన్వయ క్షీరపారావార రాకాసుధాకర రామశాస్త్రి
దత్తసుత కళాకోవి దాష్టావధాని బాలకవిశేఖర బాల
సరస్వ తీత్యాది బిరుదాంకిత వీరాంజనేయ
శర్మాభిధాన విరచిత చిత్రాశ్వీయం
బను మహా ప్రబంధంబు నందు
సర్వంబును తృతీయా
శ్వాసము
సంపూర్ణము

గ్రంథములకు

కోట వీరాంజనేయశర్మ

నాగరాజుపల్లి

మార్టూరు పోస్టు

నర్సారావుపేట తాలూకా

అని వ్రాయవలెను.